# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక పత్రిక

జనవరి 2008 78 రు. 10

- ఫోకస్ : ఆంధ్రప్రదేశ్‌లో గ్రామీణాభివృద్ధి
- మూడో ప్రత్యామ్నాయ మబ్బులు
- వలసాంధ్రలో స్త్రీల సంఘాలు
- చెంచుల జీవన స్థితిగతులు
- తాగునీటి ప్రైవేటీకరణ
- రైతుల ఆత్మహత్యలకు కారకులెవరు?
- వాకపల్లి ఆదివాసి మహిళల పోరాటం

పాఠకులకు, రచయితలకు, ప్రకటనకర్తలకు, శ్రేయోభిలాషులకు
2008 నూతన సంవత్సర శుభాకాంక్షలు


వీక్షణం రాజకీయార్థిక, సామాజిక మాస పత్రిక

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

జనవరి 2008
సంపుటి : 6
సంచిక : 1

గౌరవ సంపాదకులు:
వి. హనుమంతరావు

సంపాదకులు:
ఎన్. వేణుగోపాల్

సహాయ సంపాదకులు
డి.వి.రామకృష్ణారావు

సర్క్యులేషన్ మేనేజర్
వై. రామచంద్రం
9949391028

కంపోజింగ్ & లే ఔట్
సి. రాజశేఖర్

ఆఫీస్ అసిస్టెంట్
ఎస్. వెంకటేష్


**వీక్షణం చందా వివరాలు**

| | |
|---|---|
| సంవత్సర చందా | రు. 120 |
| 3 సంవత్సరాల చందా | రు. 350 |
| 5 సంవత్సరాల చందా | రు. 550 |
| 10 సంవత్సరాల చందా | రు. 1000 |


'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, డి.డి లు పంపాల్సిన చిరునామా

వీక్షణం
రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
మైత్రి రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
ఇమెయిల్ : reachcdrc@yahoo com



డిస్ట్రిబ్యూటర్స్
ఆనంద్ ఏజన్సీస్, హైదరాబాద్.
ఫోన్ : 98482 49695
98484 28516

ప్రింటర్స్
చరితా ఇంప్రెషన్స్
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411


సంపాదకీయం

## మందు వేయాల్సింది వ్యవస్థకు

రాష్ట్రంలో ప్రభుత్వాస్పత్రులలో, ప్రత్యేకించి హైదరాబాదులోని నిలోఫర్ పిల్లల ఆస్పత్రిలో, నయాపూల్ ప్రసూతి ఆస్పత్రిలో జూనియర్ డాక్టర్లమీద రోగుల బంధువుల, రాజకీయ నాయకుల దాడులు, నిందితుల మీద పోలీసులు చర్యలు తీసుకోకపోవడం, జూనియర్ డాక్టర్ల సమ్మె మొదలయిన పరిణామాలు చాలా లోతయిన విషయాలను చర్చకు తేవలసింది. దురదృష్టవశాత్తూ పైపై అంశాలపై వివాదంతో, అంత ముఖ్యం కాని పరిష్కారాల ప్రతిపాదనతో, కంటితుడుపు చర్యలతో జరగవలసిన చర్చ జరగకుండా పోయింది. నిజానికి వైద్యుల సమ్మె ప్రభుత్వాస్పత్రులలో వైద్యులకు రక్షణ కరువైందనే నిజమైన సమస్య దగ్గరనే మొదలయినప్పటికీ, అసలు వైద్యులకు రక్షణ అవసరం ఎందుకు వచ్చిందనే మౌలికమైన ప్రశ్న వేయలేదు. మూలకారణాన్ని వెతికే ప్రశ్న తలెత్తకపోవడం వల్ల రక్షణ కోసం ఆర్డినెన్స్ తేవడమా, ప్రత్యేక పోలీసు బలగాన్ని కల్పించడమా, ఆస్పత్రులలో పోలీసు శిబిరం ఏర్పాటు చేయడమా అనే తప్పుడు పరిష్కారాల చుట్టూ వివాదం తిరిగింది. ప్రభుత్వాస్పత్రులలో వైద్యుల మీద దాడికి కారణం రోగులకు సరైన చికిత్స అందకపోవడమే. అలా సరైన చికిత్స అందక ప్రాణాలు పోగొట్టుకుంటున్న, ఇబ్బంది పడుతున్న రోగులు ఎక్కువగా నిరుపేదలే. వారికి సరైన వైద్యసహాయం అందకపోవడానికి కొంత కారణం వైద్యుల నిర్లక్ష్యమో, వైద్యులకు పేద రోగులపట్ల ఉండే చిన్నచూపో కాగా, ఎక్కువ కారణం ప్రభుత్వాస్పత్రులలో వైద్యుల సంఖ్య చాలినంతగా లేకపోవడం, పడకలు, పరికరాలు, మందులు, ఇతర సౌకర్యాలు తగినంతగా కాదుగదా, కనీసంగా కూడా లేకపోవడం. వైద్యుల వైఖరికి మూలాలు మారుతున్న సామాజిక విలువలలోను, ఆస్పత్రులలో సౌకర్యాల లేమికి మూలాలు ప్రభుత్వ విధానాలలోను ఉన్నాయి. కాని ఇటు రోగుల బంధువులలో గాని అటు వైద్యులలో గాని కలిగిన కోపావేశాలు ఈ అసలు ప్రశ్నవైపు తొంగిచూడనైనా లేదు. ఇబ్బందులు పడిన నిరుపేద ముస్లిం కుటుంబాల వారు ఓటర్లుగా మాత్రమే కనబడే మజ్లిస్ రాజకీయ నాయకులు ఏ కారణాల వల్ల వైద్య చికిత్సలో లోపం కలుగుతున్నదో చూడదలచుకోలేదు. వైద్యుల మీద దెబ్బలు పడితే చాలు తమకు ఓట్లు పడతాయని ఆశించారు. ఏ కారణాలవల్ల తాము సరైన వైద్యం అందించలేకపోతున్నారో, ఎవరివైపు వేలెత్తి చూపవలసి ఉన్నదో వైద్యులు చెప్పదలచుకోలేదు. లేని మందుల గురించి అడిగే బదులు తుపాకి లైసెన్సుల గురించి అడిగారు. రాజకీయ నాయకులు, వైద్యులు పాత్రధారులుగా మొదలయిన ఈ ప్రహసనంలో ప్రభుత్వం, పోలీసులు, సంఘపరివార్ నాయకులు కూడా చేరి తమ పాత్రలు పోషించారు. న్యాయవ్యవస్థ కూడా తనవంతు జతకలిసింది. అందరికందరూ కలిసి ఇప్పటికే దిగజారిపోయిన మన ప్రజారోగ్య వ్యవస్థను మరింతగా పతనం చేశారు. ప్రభుత్వాస్పత్రులలో వైద్యుల ఉద్యోగాల ఖాళీలు పూర్తిగా భర్తీ అయ్యేవరకూ, ప్రభుత్వాస్పత్రులలో అవసరమైన అన్ని సౌకర్యాలు, మందులు, పరికరాలు సమకూరేవరకూ, వైద్యులలో సేవాభావాన్ని పెంపొందించే విధంగా సామాజిక విలువల పునర్నిర్మాణం జరిగేవరకూ ప్రభుత్వాస్పత్రులలో పేదరోగులు నిర్లక్ష్యానికీ, అకాల మరణాలకూ గురవుతూనే ఉంటారు. ఎన్ని పోలీస్‌స్టేషన్లు వచ్చినా, ప్రత్యేక పోలీసు బలగాలు ఏర్పాటయినా మరణించిన రోగుల బంధువుల ఆగ్రహావేశాలు వైద్యుల మీదనే ప్రకటించడం జరుగుతుంది. ఆ ఆగ్రహావేశాల ప్రకటనలో రాజకీయ ప్రయోజనాలు ఉన్నాయనుకుంటే రాజకీయ నాయకులుకూడ ప్రవేశిస్తూనే ఉంటారు. మందు వేయవలసింది వ్యవస్థకు, వైద్యులకో, రోగులబంధువులకో, శవరాజకీయాలు నడిపే రాజకీయవేత్తలకో కాదు. ◆

## చిరంజీవి రాజకీయాలు

తెలుగుసీమలో ప్రధానస్రవంతి పార్లమెంటరీ రాజకీయాలు ఎంత పతనావస్థకు చేరుకున్నాయో అర్థం చేసుకోవాలంటే సినిమా నటుడు చిరంజీవి రాజకీయ రంగప్రవేశాన్ని గురించి జరుగుతున్న చర్చలను చూడాలి. నిర్భాగ్య ప్రజానీకం ఎవరో వస్తారని ఏదో చేస్తారని ఇంతగా రక్షకుడికోసం ఎదురు చూసే స్థితి ఉన్నదంటే ప్రజలకు అన్ని రాజకీయ పక్షాల మీద విశ్వాసం సన్నగిల్లిపోయిందని అర్థం. అన్ని రాజకీయ పక్షాలూ ప్రత్యక్షంగానో పరోక్షంగానో చిరంజీవికి అనుకూల ప్రకటనలు చేస్తున్నాయంటే, తాము తమ పాత పద్ధతుల ద్వారా, తమ పాత వాగ్దానాల ద్వారా ప్రజలను ఆకర్షించజాలమని, ఇక ఒక కొత్త జనాకర్షక ముఖాన్ని తగిలించుకునో, లేక ఆ ముఖంతో పొత్తు పెట్టుకునో మాత్రమే ప్రజల దగ్గరికి వెళ్లవలసి ఉందని అన్ని రాజకీయ పక్షాలు అనుకుంటున్నాయని అర్థం. పార్లమెంటరీ రాజకీయాలు నిజంగా ప్రజాభిప్రాయ సూచికలేనా కాదా, అంత సంక్లిష్టమైన రాజకీయాలను ఏదో ఒక సూత్రంలో బంధించి సరళీకృత సమీకరణం వేయవచ్చునా అనే ప్రశ్నలు ఎట్లా ఉన్నా, ఆ రాజకీయాల పరిమితుల లోపలే పరిశీలించినా గత ఆరు దశాబ్దాలలో ఎన్నడూ ఈ రాష్ట్రంలో అరవై శాతం కన్న ఎక్కువ మంది ఓటర్లు తమ ఓటు హక్కు వినియోగించుకోలేదు. ఈ యాభై సంవత్సరాలలో ముప్పై ఐదేళ్లకు పైగా పాలించిన కాంగ్రెస్ అధికారానికి అయితే వచ్చింది కాని ఏ ఒక్క ఎన్నికలలోనూ పోలయిన ఓట్లలో సగం కూడా గెలుచుకోలేదు. అంటే అప్పుడు కూడా అధికారంలోకి వచ్చిన వారికి పడిన ఓట్ల కంటే, ఓడిపోయినవారికి పడిన ఓట్లే ఎక్కువ అన్నమాట. కాకపోతే ఆ ఓడిపోయినవారికి పడిన ఓట్లు చీలిపోయి ఉంటాయి. అంటే, మరో మాటల్లో చెపితే, ఆంధ్రప్రదేశ్ రాజకీయాల్లో ఎప్పుడూ ప్రజలు అధికారంలో ఉన్న వారిని గౌరవించలేదు. ప్రతిపక్షాలమని తమకు తాము చెప్పుకున్నవారు కూడా ప్రజల విశ్వాసాన్ని చూరగొనలేకపోయారు. ఆ మేరకు ఒక రాజకీయ శూన్యం ఉంటూ వచ్చింది. ఆ శూన్య స్థితిలో కేవలం అవతలి ఓట్ల చీలికవల్ల ఏదో ఒక పార్టీ అధికార పగ్గాలు చేపట్టిన చరిత్ర మనది. ఆ శూన్యాన్ని గుర్తించి అక్కడ తమ స్థానం ఉన్నదని గుర్తించిన ఎన్.టి. రామారావు కూడ అయిదు సంవత్సరాలలోనే ఆ విశ్వాసాన్ని కోల్పోయారు. ఇరవై ఐదు సంవత్సరాల తర్వాత మళ్లీ చిరంజీవి కోసం ఎదురుచూపులు సాగుతున్నాయంటే మళ్లీ అటువంటి శూన్యం ఉన్నదని అర్థం.

## గుజరాత్ ఎన్నికలు

గుజరాత్‌లో సంఘపరివార్ నాయకుడు, 2002లో జాతిహననంలో వేలాదిమంది ముస్లింలను ఊచకోత కోయించిన పథక రచయిత నరేంద్ర మోడీ తిరిగి అధికారంలోకి రావడం పట్ల చాలమంది ఆశ్చర్యాన్ని వ్యక్తం చేస్తున్నారు. పార్లమెంటరీ రాజకీయాల సంక్లిష్టత అర్థం కాకపోయినా, పార్లమెంటరీ ఎన్నికల ఫలితాలు ప్రజాభిప్రాయానికి నిజమైన సూచికలు అనుకున్నా అటువంటి ఆశ్చర్యం తప్పదు. ఈ ఎన్నికల సందర్భంగా ప్రచార సాధనాలలో ఏ అభిప్రాయాలు వ్యక్తమైనప్పటికీ, సగటు గుజరాత్ ఓటరు ప్రతిస్పందనకు రెండు ప్రధాన ముఖాలున్నాయని గుర్తించవలసి ఉంది. అవి ఒకటి, 1960ల చివరి నుంచీ గుజరాతీ సమాజంలో స్పష్టంగా జరుగుతున్న విభజన, గుజరాతీ సమాజాన్ని మత ప్రాతిపదికపై రెండు శిబిరాలుగా చీల్చడంలో సంఘపరివారం సాధించిన విజయం. రెండు, గుజరాతీ సమాజంలో డబ్బు, పెట్టుబడులు, విదేశీసంబంధాల ప్రాధాన్యత పెరుగుతూ వచ్చి అభివృద్ధి మాయాజాలపు భావజాలం కమ్మివేయడం. అంటే ఇది ఒకవైపు హిందుత్వ రూపంలోని భూస్వామ్యాని కీ, మరొకవైపు అభివృద్ధి రూపంలోని సామ్రాజ్యవాదానికీ కుదిరిన పొత్తు. ఈ పొత్తు నిజానికి ఈ దేశంలో వేల ఏళ్లుగా అధికారం నెరపుతున్న అగ్రవర్ణాలకూ, మూడు శతాబ్దాలకు పైగా ఈ దేశం మీద పట్టుకోసం ప్రయత్నిస్తున్న పెట్టుబడికీ మధ్య ఉన్నది. అంటే మన సమాజంలో పై ఐదు, పది శాతం దళారీలకు, దేశదేశాల సంపన్నులకు మధ్య పొత్తు ఇది. ఆ ఐదు, పది శాతం లబ్ధిదారులు, మిగిలిన తొంబైశాతం ప్రజలనో, లేదా వారిలో అత్యధికులనో భ్రమలలో ముంచి, తమవెంట తీసుకుపోగలగడమే ఇవాళ్టి విషాదం. ఈ విషాదానికి ఆ లబ్ధిదారుల చాణక్య నీతి ఎంత కారణమో, దాన్ని అడ్డుకోలేకపోతున్న ప్రగతిశీల శక్తుల బలహీనత కూడ అంతేకారణం. తమను తాము ప్రగతిశీల శక్తులుగా చెప్పుకునే వారిలో కూడ ఈ హిందుత్వ భావాలు గాని, అభివృద్ధి భావజాలంగాని ఏదో ఒక స్థాయిలో ఉండడమే, వారు ఆ భావజాలం నుంచి బయటపడడానికి చేయవలసినంత పోరాటం చేయకపోవడమే మోడీ వంటి వారి గెలుపుకు కారణం. గుజరాత్ మారణకాండ తర్వాత వెంటనే జరిగిన 2002 ఎన్నికలలో గాని, ప్రస్తుత ఎన్నికలలో గాని మోడీ గెలుపు హిందుత్వ గురించి, అభివృద్ధి గురించి, ప్రజలలో ఆ భావజాలానికి మద్దతు దొరకడం గురించి ఆలోచనలకు పురికొల్పాలి.

## ఛావెజ్ ఓటమి దేనికి సూచన?

సామ్రాజ్యవాద ప్రపంచీకరణ శక్తులు భూగోళాన్నంతా దురాక్రమిస్తున్నప్పుడు, కనీసం చెయ్యి అడ్డం పెట్టడానికి ప్రయత్నిస్తున్న అతి తక్కువమంది దేశాధినేతలలో ఒకరిగా వెనిజ్యులా అధ్యక్షుడు హ్యూగో ఛావెజ్ ప్రపంచ ప్రజల గౌరవాన్ని పొందాడు. అమెరికా పన్నాగాలను ఎదిరిస్తూ తన దేశంలో ప్రజానుకూల ఆర్థిక, రాజకీయ, సామాజిక విధానాలను ప్రవేశపెట్టడానికి ఆయన చేసిన ప్రయత్నాలు అందరి మన్ననలు పొందాయి. గతంలో సోవియట్ యూనియన్, చైనా ప్రతినిధులు కూడ చేయని విధంగా ఐక్య రాజ్యసమితి వేదిక మీది నుంచి అమెరికన్ పాలకులను దుయ్యబట్టిన ఛావెజ్ సాహసం చాలమందిని ఆకర్షించింది. అయితే ఎంత అనుకూల అంశంలోనైనా ఒక ప్రతికూల అంశం ఉండవచ్చుననేందుకు సూచనగా, 1998 నుంచి ఇప్పటికి మూడు ఎన్నికలలోను, మూడు ప్రజాభిప్రాయ సేకరణలలోను అఖండ విజయం సాధించిన ఛావెజ్ డిసెంబర్ 2న జరిగిన ప్రజాభిప్రాయ సేకరణలో ఓటమిని చవిచూశాడు. ఈసారి ఆయనకు వ్యతిరేకంగా వచ్చిన ఓట్లు 51 శాతమే అయినప్పటికీ, ఆయన కోరిన రాజ్యాంగ సవరణలు చాల ఆశ్చర్యకరంగా ఉన్నాయి. అధ్యక్షుడిగా ఒక వ్యక్తి రెండు పదవీకాలాల కంటే ఎక్కువ ఉండగూడదనే నిబంధనను రద్దు చేయాలనే సవరణ వాటిలో ముఖ్యమైనది. అంటే ఛావెజ్ 2012 తర్వాత పోటీ చేయడానికి వీలు లేదు. దాన్ని సవరించడం ద్వారా అధ్యక్షస్థానం నుంచి తాను వైదొలగబోననే సందేశాన్ని ఆయన ఇవ్వదలిచాడు. నిజానికి ఛావెజ్ ఇవాళ ఎంత ప్రజానుకూల విధానాలను అవలంబిస్తున్నప్పటికీ, సోవియట్ పతనం తర్వాత, ప్రపంచవ్యాప్తంగా చాలమంది కమ్యూనిస్టులు కూడా ఆయన నాయకత్వాన్ని అంగీకరిస్తున్నప్పటికీ, ఆయన సైనికుడుగా జీవితం ప్రారంభించాడనీ, సైనిక కుట్ర ద్వారా అధికారంలోకి రావడానికి ప్రయత్నించి, విఫలమై జైలు శిక్ష అనుభవించాడనీ గుర్తుంచుకోవలసి ఉంది. ఎంత ప్రజానుకూల విధానాలను అమలుచేసిన నాయకులైనా అపరిమిత అధికారాన్ని కోరుకుంటే ప్రజలు సహించబోరనడానికి ఛావెజ్ ఓటమి ఒక నిదర్శనం. ◆

# లోపలి పేజీల్లో...

## ఆంధ్రప్రదేశ్‌లో గ్రామీణాభివృద్ధి

*తన వినియోగం, తన అవసరాలు తీరడం, తన సృజనాత్మకత పెరగడం మాత్రమే కాక, తన తోటి వారందరి అవసరాలు తీరడం, తోటి వారందరి సృజనాత్మకత పెరగడం జరగాలని ప్రతి మనిషి కోరుకున్నప్పుడే అది సమాజం అభివృద్ధికి చిహ్నం అవుతుంది. 'ఒక్కరి కోసం అందరు నిలిచి, అందరి కోసం ఒక్కరు నిలిచి' అనే భావన సామాజిక అభివృద్ధికి ఒక మౌలిక షరతు. ఆ షరతు మీద మనుషులందరికీ కనీస అవసరాలైన కూడు, గూడు, గుడ్డ తీరడం, వాటితోపాటు ఆరోగ్య, విద్యా, వైజ్ఞానిక, వినోద అవసరాలు తీరడం, శ్రమ శిక్షగానో, ఇబ్బందికరంగానో కాక, సామాజిక అవసరం కోసం ఆనందంగా చేయడం జరిగే స్థితిని అభివృద్ధి అనాలి.*

### ఫోకస్ : ఆంధ్రప్రదేశ్‌లో గ్రామీణాభివృద్ధి



'వీక్షణం'లో అచ్చవుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు. 'వీక్షణం'ను నిజమైన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.

### రచయితలకు సూచన

ఏ పత్రికయినా తాను అచ్చువేసే రచనలు తనకే ప్రత్యేకంగా ఉండాలని కోరుకుంటుంది. 'వీక్షణం' కూడా అలానే భావిస్తోంది. ఇటీవల కొందరు రచయితలు తమ రచనలను ఒకేసారి అనేక పత్రికలకు పరిశీలన కోసం పంపుతున్నారు. 'వీక్షణం' పరిశీలనలో ఉన్న రచనలు, రాబోయే సంచికలలో అచ్చుకోసం ఎంపిక చేసి పెట్టుకున్న రచనలు ఇతర దినపత్రికలలోనో, వార పత్రికలలోనో వెలువడడం మా దృష్టికి వస్తోంది. ఇతర పత్రికలకు పంపిన రచనలను 'వీక్షణం'కు పంపించగూడదని రచయితలకు విజ్ఞప్తి చేస్తున్నాము.

– సంపాదకులు

### చందాదారులకు విజ్ఞప్తి

ఇటీవల కొంతమంది చందాదారులకు వీక్షణం సక్రమంగా అందడం లేదని ఫిర్యాదులు వస్తున్నాయి. వీక్షణం ప్రతినెల 29వ తేదీన మరుసటి నెల సంచిక పోస్ట్ అవుతుంది. ఏ కారణం చేతనైనా మీకు వీక్షణం మొదటివారంలోపు అందనట్లయితే, వెంటనే ఆ విషయం మాకు తెలపగలరు.

మీ చిరునామా వివరంగా రాయండి. పిన్‌కోడ్ రాయడం మరిచిపోకండి. పత్రిక వచ్చిందా రాలేదా పోస్ట్‌మాన్‌తో నిర్ధారించుకోగలరు.

– సర్క్యులేషన్ మేనేజర్
9949391028







- **జోగినీ వ్యవస్థ** – వకుళాభరణం లలిత – జనచైతన్య వేదిక, ఆంధ్రప్రదేశ్ కమిటీ ప్రచురణ, 279 పేజీలు, 1/8 డెమీ, రు. 75, ప్రతులకు : విశాలాంధ్ర బుక్ హౌస్, ఆబిడ్స్, హైదరాబాద్.
- **దేవదాసీ వ్యవస్థ** – వకుళాభరణం లలిత, మల్కాపల్లి ప్రమీలారెడ్డి – అస్మిత ప్రచురణ, 423 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు: అస్మిత రీసోర్స్ సెంటర్ ఫర్ ఉమెన్, రోడ్ నెం. 6, టీచర్స్ కాలనీ, ఈస్ట్ మారేడ్‌పల్లి, సికింద్రాబాద్. అన్ని ప్రముఖ పుస్తకాల షాపుల్లో
- **యుద్ధోన్మాది అమెరికా** – జోయెల్ ఆండ్రియాస్ – జన విజ్ఞాన వేదిక – లిఖిత ప్రెస్ ప్రచురణ, 72 పేజీలు, 1/4 క్రౌన్, రు. 100, ప్రతులకు : జనవిజ్ఞాన వేదిక, ఇంటి నెం. 8-1-6, బాలాజీరావు పేట, తెనాలి – 522 202. సెల్ : 94405 03061, లిఖిత, C/o. వై. నిర్మల, హెచ్.ఐ.జి. II, బి-12, ఎఫ్-1, బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ – 500 044. ఫోన్ : 040 – 2766 0000
- **ముర్దీ** – కవిత్వం – అన్వర్ – సృజన లోకం (రైటర్స్ కార్నర్) ప్రచురణ , 108 పేజీలు, 1/8 డెమీ, రు. 10, ప్రతులకు : అన్వర్, 16-10-374, శివనగర్, వరంగల్ – 506 002. సెల్ : 98660 89066, అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో
- **చానళ్ల సందడి – టెక్నాలజీ హడావుడి** – నాగసూరి వేణుగోపాల్ – ఎన్.కె. పబ్లికేషన్స్, 216 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు : ఎన్.కె. పబ్లికేషన్స్, డోర్ నెం. 24-8-1, సమీరా రెసిడెన్సీ, విజయనగరం – 535 001
- **విప్లవోద్యమం కొన్ని సమస్యలు** – రచనలు 1 – కామ్రేడ్ వసంతాడ రామలింగాచారి – కామ్రేడ్ వసంతాడ రామలింగాచారి స్మారక కమిటీ ప్రచురణ, 100 పేజీలు, 1/8 డెమీ, రు. 20, ప్రతులకు : ఎన్. అప్పలాచారి, శేషాద్రిపురం, వయా పొందూరు, శ్రీకాకుళం జిల్లా, అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో
- **వాస్తవికత-భౌతికవాద దృక్పథం** మెటిరీయలిస్ట్ వ్యూ ఆన్ రియాలిటీ – ఓవిషి యాఖో, అనువాదకులు – రావు కృష్ణారావు, డా. పి.ఎస్. ప్రకాశరావు, లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్, 88 పేజీలు, 1/8 డెమీ, రు. 25, ప్రతులకు : లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్, 5-85-4/బి, పండరీపురం, 1వలైన్, గుంటూరు-522 002. ఫోన్ : 9848877596, అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో
- **ఆఫ్ రిలిజన్, గాడెస్ అండ్ ఎన్.జి.ఒ.** జోగిన్ ఉమెన్ రిఫార్మ్ అండ్ డైనమిక్స్ ఆఫ్ సోషల్ ఛేంజ్ ఇన్ సౌత్ ఇండియా – వకుళాభరణం లలిత, కొంపల్లి ఎచ్.ఎస్.ఎస్. సుందర్ – రిసర్చ్ అండ్ రిసోర్స్ సెంటర్, సంస్కార్ ప్రచురణలు, 229 పేజీలు, 1/8 డెమీ, రు. 200, ప్రతులకు : రిసర్చ్ అండ్ రిసోర్స్ సెంటర్, సంస్కార్, కోటయ్య క్యాంప్, వర్ణీ, నిజామాబాద్ – 503 201
- **తెలంగాణ వ్యాసాలు** – వరవరరావు – స్వేచ్ఛా సాహితి ప్రచురణ – 160 పేజీలు, 1/8 డెమీ, రు. 40
- **తెలంగాణ – మాండలిక భాష – కాళోజీ** – వరవరరావు – తెలంగాణ ప్రచురణ – 31 పేజీలు, 1/8 డెమీ, రు. 3

పై రెండు ప్రతులకు : ఎన్. వేణుగోపాల్, జి1 మైత్రీరెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం.3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ – 500 029. అన్ని ప్రముఖ పుస్తకాల షాపుల్లో







# పాఠకుల వీక్షణం

'వీక్షణం'లో వ్యాసాలు బాగుంటున్నాయి. అయితే అవి సాధారణ పాఠకులకు అందుబాటులో, అర్ధమయ్యేటట్టుగా ఉంటున్నాయో లేదో ఆలోచించండి. సామాజిక శాస్త్రాలు చదువుకుని, సమాజం గురించి ఆలోచిస్తున్నవాళ్లకు మాత్రమే అర్ధమయ్యేటట్టుగా ఉంటే పెద్ద ప్రయోజనం ఉండదు. పాఠశాల విద్యతోనో, ఇంటర్మీడియట్ తోనో చదువు ఆపిన సాధారణ పాఠకులు, నిరుద్యోగులు, చిరుద్యోగులు చాలామంది ఉంటారు. 'వీక్షణం'లో అచ్చు అవుతున్న విషయాలు వాళ్లకు తప్పనిసరిగా అందవలసినవే. కనుక వ్యాసాలలో వాడే భాష సులభంగా ఉండాలి. వివరణలు మరింత ఎక్కువ ఉదాహరణలతో అర్ధమయ్యేటట్టుగా ఉండాలి. అవసరమైన విషయాలు అందుబాటులో ఉండే పద్ధతిలో చెప్పాలి. కొన్ని సైద్ధాంతిక విషయాలు చెప్పేటప్పుడు క్లిష్టత తప్పక పోవచ్చు. కాని క్లిష్టతకూ సౌలభ్యానికీ మధ్య సమతూకం పాటించాలి.

**- ఆర్. సత్యనారాయణ**
హైదరాబాద్

'వీక్షణం' చదువుతుంటే ముప్పై ఏళ్ల కింద ఆంధ్రా యూనివర్సిటీలో ఎం.ఎ. చదివినప్పుడు రెగ్యులర్‌గా చదివిన ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ గుర్తుకొస్తోంది. పత్రిక ప్రమాణాలు ఇట్లాగే నిలిపి ఉంచండి. పత్రిక బాగా వృద్ధిలోకి రావాలని ఆకాంక్షిస్తున్నాను.

**- ఎన్. సీతారామరాజు**
హైదరాబాద్

'వీక్షణం' నవంబర్ సంచికలో వచ్చిన 'రెండు కాళ్లమీద మానవ ప్రస్థానం', డిసెంబర్ సంచికలో వచ్చిన 'విశ్వంలో మనిషి స్థానం' వ్యాసాలు చాలా బాగున్నాయి. కొడవటిగంటి రోహిణీ ప్రసాద్ గారికి ధన్యవాదాలు. ఇలాంటి వ్యాసాలు సమాజాన్ని శాస్త్రీయంగా అర్థం చేసుకోవడానికి బాగా ఉపయోగపడతాయి. ఇదే విధంగా సైన్స్, టెక్నాలజీ రంగాలకు సంబంధించిన వ్యాసాలు మరిన్ని ప్రచురించగలరు.

**- మహమ్మద్ రఫీ**
హనుమకొండ

'వీక్షణం'లో వ్యాసాలు సంపాదకులు చదివి అచ్చు వేస్తున్నారో, చదవకుండానే అచ్చువేస్తున్నారో తెలియడం లేదు. ఉదాహరణకు 'ధీరూభాయి లాంటి సామాన్యుడు వ్యాపారంలో కష్టపడి తెలివిగా పెట్టుబడులు పెట్టి ఆయన కాలంలోనే పెద్ద కోటీశ్వరుడు, పెద్ద కంపెనీల యజమాని కాగలిగాడు. అది వారి శ్రమ, వారి అదృష్టం' అని ఒక వ్యాస రచయిత రాశారు (వీక్షణం, డిసెంబర్ సంచిక, పే.15). అది ఎంత అబద్ధమో, ధీరుభాయి చేసిన మోసాలేమిటో వ్యాస రచయితకుగాని, సంపాదకులకు గాని తెలియదను కోవాలా?

**- సి.ఎస్.ఆర్. ప్రసాద్**
గుంటూరు

'వీక్షణం'లో కొన్ని వ్యాసాలు బహుశా ప్రోత్సహించాలనే ఉద్దేశ్యంతో అచ్చవుతున్నట్లు ఉన్నాయి. వ్యాసాలలో కనీస అధ్యయనం, పరిశీలన కొరవడినట్లు కనబడుతోంది. వ్యాసాలు రాసే కొత్తవారు ఎంచుకున్న అంశానికి సంబంధించి గతంలో ఎలా ఉంది, వర్తమానంలో ఎలా ఉంది భవిష్యత్‌తో ఎలా ఉండబోతోందన్న పద్ధతిలో రాస్తే బాగుంటుంది. వ్యాసాలు రాసేవారు తామే మొట్టమొదటి సారిగా ఆ విషయాన్ని కనుగొన్నట్లు రాయడం ఇబ్బందికరం. కొన్ని వ్యాసాలయితే పుస్తకాలలో నుంచి, పేపర్ల నుంచి యథాతథంగా ముక్కలు పేర్చినట్లు ఉంటున్నాయి. అటు భాషలోనూ, ఇటు అంశంపై స్పష్టత ఉండటం లేదు. వ్యాసాలను మరింత పరిశీలించి ఎంపిక చేయగలరు.

**- ఎన్. వెంకటేశ్వర్లు**
నంద్యాల

పబ్లిక్ సర్వీస్ కమిషన్ గ్రూపు పరీక్షలు రాస్తున్న అభ్యర్థులకు 'వీక్షణం'లో వ్యాసాలు చాలా ఉపయోగకరంగా ఉన్నాయి. వచ్చే సంవత్సరం ఈ పరీక్షలు జరిగే వరకూ పత్రికలను ఇదే విధంగా వెలువరించండి.

**- ఎ. శ్రీధర్**
హైదరాబాద్

## అసహజ మరణాలు నమోదు చేద్దాం!

ఆగస్ట్ 2006 నుంచి వీక్షణంలో అసహజ మరణాల సూచి ప్రారంభించాం. మన చుట్టూ అసహజంగా చనిపోతున్న రైతులు, చేనేత కార్మికులు, వరకట్న మరణాలు, రకరకాల ప్రమాదాలలో చనిపోతున్నవారు, వైద్యం అందక, ప్రకృతి వైపరీత్యాలతో మరణిస్తున్నవారు, హత్యలు ఇలా, అనేక సామాజిక రంగాలనుంచి మరణిస్తున్నవారి సంఖ్యనైనా నమోదు చేయడమే ఈ శీర్షిక ఉద్దేశ్యం. ఏయే సామాజిక, రాజకీయార్థిక కారణాలతో చనిపోతున్నారో పరిశోధన చేయాల్సి ఉంది. మేము చేస్తున్న ఈ ప్రయత్నంలో మీరూ పాలుపంచుకోవచ్చు. మీ జిల్లాలో అసహజంగా చనిపోతున్న వారి వివరాలను మాకు పంపండి. దీనికి పారితోషికంగా వీక్షణం ప్రతిని పంపిస్తాం. ఆసక్తి గలవారు వివరాలకై సంప్రదించండి. ఫోన్ నెం. 99891 89250, 99493 91028

**- సంపాదకులు**

## వీక్షణం మీ ముంగిట

'వీక్షణం' పత్రిక ఇప్పుడు మీకు మరింత చేరువలోకి వచ్చింది. రాష్ట్రంలోని అన్ని పట్టణాలలో, టౌన్‌లలోని న్యూస్ స్టాండ్‌లలో అందుబాటులో ఉంది. ఇక ఆలస్యమెందుకు... వెంటనే మీ ప్రతిని తెచ్చుకోండి!

## 'సమాల్' నుంచి 'కాగ్' దాకా

రాష్ట్రంలో వివిధ ప్రాజెక్టలలో చోటుచేసుకుంటున్న అవినీతి సొమ్ములతో వివిధ రంగాలలో ఎనలేని అభివృద్ధిని సాధించవచ్చు. ఈ విషయాన్ని అనేకసార్లు మేధావులు ప్రత్యామ్నాయ బడ్జెట్లు వేసి మరీ చూపారు. హాస్టళ్లలో పసివాళ్లకు చలికి దుప్పట్లు కూడా లేకుండా మన రాష్ట్రంలో 'సంక్షేమం' వర్ధిల్లుతోంది. 2007 మార్చ్ 31తో ముగిసిన ఆర్థిక సంవత్సరానికి గాను కాగ్ నివేదికను ప్రభుత్వం నవంబర్ 20న శాసనసభలో ప్రవేశపెట్టింది. కాంట్రాక్టులు, సాగునీటి ప్రాజెక్టలు, సంక్షేమం, స్కాలర్‌షిప్‌లు, హాస్టళ్లలో వసతులు వంటి అంశాలపై ఇన్నాళ్లుగా వస్తున్న విమర్శలు, ప్రచార సాధనాలలో వస్తున్న కథనాలకు కాగ్ నివేదికతో మరింత సాధికారిత లభించింది. నిధుల దుర్వినియోగం, అంచనాలు, విధానాలలో లోపాలు ఎత్తి చూపింది. ప్రభుత్వాలు ఏవైనా కాగ్ నివేదికలు వస్తూనే ఉన్నాయి. వాటిపై చర్యలు మాత్రం లేవు.

## ఎందెందు వెదికినా...

జలయజ్ఞాలు, ప్రాజెక్టులు, ఫ్లై ఓవర్లు, గ్రామీణాభివృద్ధి, పొదుపు ఇలా అంతటా తానై అప్పులు ఇచ్చి వర్ధిల్లుతున్న ప్రపంచ బ్యాంక్‌కు ఇక పండ్లు, కూరగాయల వ్యాపారంలోకి వద్దామనే ఆలోచన కలిగింది. ఇంకేం, ఆ దిశగా ప్రపంచ బ్యాంక్ అడుగులు వేయడం మొదలు పెట్టింది. ప్రపంచ బ్యాంక్ ఆర్థిక, సాంకేతిక సహకారంతో వివిధ రాష్ట్రాలలో భారీ స్థాయి మార్కెట్లను నెలకొల్పడానికి 'మల్టీ స్టేట్ కాంపిటీటివ్‌నెస్' పేరిట ప్రణాళికలు సిద్ధం చేసింది. ఇందుకోసం ఆరు రాష్ట్రాలను ఎంపిక చేసింది. పంజాబ్, మహారాష్ట్ర, ఒరిస్సా, రాజస్థాన్, ఆంధ్రప్రదేశ్, తమిళనాడులతో ఒక కూటమిని ఏర్పాటు చేసి మార్కెటింగ్ నెట్‌వర్క్‌లను అభివృద్ధి చేయాలని నిర్ణయించింది. ఇప్పటికే రిలయన్స్ ఫ్రెష్, హెరిటేజ్ లతో అతలాకుతలం అవుతున్న చిన్న సన్నకారు రైతులు, చిరు వ్యాపారులు ఇక భవిష్యత్తులో మిగలకుండా చేయడమే ధ్యేయం లాగుంది.

## చెంచు పెంటల్లోకి 'నాగరికత'

స్వేచ్ఛను, ప్రకృతితో సహజీనాన్ని ప్రేమించే చెంచుల జీవితంలోకి 'నాగరికత' చొచ్చుకుపోతోంది. చెంచు పెంటలను తరలించి, నాగరిక ప్రపంచంలోకి తీసుకురావాలని ప్రభుత్వం యోచిస్తోంది. 1875లో బ్రిటిష్ ప్రభుత్వం అప్పటి హైదరాబాద్ రాష్ట్రంలోని ప్రకాశం జిల్లాలో చెంచు పెంటలను తరలించాలని ప్రతిపాదించింది. ఈ ఆలోచన కార్యరూపం దాల్చడానికి ఇరవై సంవత్సరాలు పట్టింది. చెంచులను తరలించడంపై అధ్యయనాలు చేసినవారంతా అలా చేయడం వలన వారి జీవితం అస్తవ్యస్తమౌతుందనీ, మంచిది కాదనీ సూచించారు. గత అనుభవంలో పెద్దచెరువు నుంచి కొట్టాలచెరువుకు తరలించిన చెంచుల లో రెండు వందల మంది కొత్త పరిస్థితులకు ఇమడలేక చనిపోయారు. వారిలో ఎక్కువ మంది పిల్లలు, మహిళలే. ఈ క్రమంలోనే 1934లో వారికి కొన్ని రక్షణలు కల్పిస్తూ జి.ఓ. జారీ అయ్యింది. ఆ జి.ఓ.ను ఇప్పుడు రద్దుచేసి చెంచు పెంటలను 'నాగరిక' జీవన ప్రాంతాలకు తరలించాలని నిర్ణయించడం పై సర్వత్రా విమర్శలు వెల్లువెత్తుతున్నాయి.

## టిడిపి 'రైతు గర్జన'

డా. స్వామినాథన్ కమిషన్ సిఫార్సులను అమలు చేయాలని, వరికి మద్దతుధర రు. 1000 ఇవ్వాలని డిమాండ్ చేస్తూ తెలుగుదేశం పార్టీ ఆధ్వర్యంలో విజయవాడలో నవంబర్ 24న 'రైతు గర్జన' పేరిట బహిరంగ సభ జరిగింది. ఈ సభలో యు.ఎన్.పి.ఎ. కూటమిలోని సమాజ్‌వాది పార్టీ, నేషనల్ కాన్ఫరెన్స్, జార్ఖండ్ వికాస్ మోర్చా, ఇండియన్ నేషనల్ లోక్‌దళ్, అసోం గణపరిషత్ పార్టీల నాయకులు పాల్గొన్నారు. తాను అధికారంలో ఉన్నంత కాలం ఐ.టి., భారీ పరిశ్రమలు అంటూ పరుగెత్తి, ఆంధ్రప్రదేశ్ సి.ఇ.ఓ.గా పేరు తెచ్చుకొని, తొమ్మిదేళ్ల పాలనా కాలంలో వ్యవసాయానికి ఉచ్చులు బిగించి, 'వ్యవసాయం దండగ, పరిశ్రమలే మేలు' అన్న చంద్రబాబునాయుడు ఇప్పుడు మొసలి కన్నీళ్లు కార్చడం రైతాంగం చూస్తూనే ఉన్నారు. ఉద్దేశాలు ఏమైనా రైతుకు మద్దతు ధర సాధించగలిగితే సంతోషమే.

## పెళ్లి చేస్తాం జాగ్రత్త !

మన రాష్ట్రం నిరక్షరాస్యతలోనే కాదు దాన్ని అనుసరించే బాల్య వివాహాల్లోనూ అగ్రస్థానంలో ఉంది. రాష్ట్రంలో వివాహం చేసుకున్న ప్రతి వంద మందిలో యాభై అయిదు మందివి బాల్య వివాహాలే. పట్టణ ప్రాంతాలతో పోలిస్తే గ్రామీణ ప్రాంతాలలోనే ఇవి ఎక్కువగా నమోదు అవుతున్నాయి. బాల్య వివాహాలు ఎక్కువగా ఉన్న రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ 54.7 శాతంతో నాలుగో స్థానంలో ఉంది. జార్ఖండ్ 61.2 శాతంతో మొదటి స్థానంలోను, బీహార్ 60.3 శాతంతో రెండవ స్థానంలోను, రాజస్థాన్ 57.1 శాతంతో మూడవ స్థానంలోను ఉన్నాయని యూనిసెఫ్ రిపోర్ట్ ఆధారంగా తెలుస్తోంది. మాతృ-శిశు మరణాలకు, బాలికలలో రక్తహీనతకు, గృహహింస, లైంగిక వేధింపులు, అత్యాచారాలు, హత్యలకు కూడా బాల్య వివాహాలు కారణం అవుతున్నాయని తెలుస్తోంది. పరోక్షంగా బాలికలు జీవించే హక్కుతోపాటు అన్ని హక్కులు కోల్పోతున్నారు.

## వికలాంగుల మహాగర్జన

వికలాంగులకు ఇస్తున్న పెన్షన్‌ను రు. 200 నుంచి రు. 1500కు పెంచాలనీ, బడ్జెట్ కేటాయింపులను మూడు వందల కోట్ల రూపాయలకు పెంచాలనీ, ఏడు శాతం రిజర్వేషన్‌లు కల్పించాలనీ, ఉద్యోగాల్లో ప్రమోషన్లు కల్పించాలనీ, బ్యాక్‌లాగ్ పోస్టులను భర్తీ చేయాలనే డిమాండ్‌లతో సహా మొత్తం 34 డిమాండ్లతో వికలాంగుల హక్కుల పోరాట సమితి నవంబర్ 26న 'వికలాంగుల మహాగర్జన' తలపెట్టింది. రాష్ట్రంలో యాభై లక్షలకు పై చిలుకు వికలాంగులు ఉన్నారని, వారిలో తొంభై శాతం నిరుపేదలే అని, ఈ సందర్భంగా మంద కృష్ణ మాదిగ అన్నారు. ఈ బహిరంగ సభలో పలు పార్టీలు, ప్రజాసంఘాలు, మేధావులు పాల్గొన్నారు. అనంతరం రాత్రి తొమ్మిది గంటలకు నిజాం కళాశాల సభాస్థలి నుంచి బషీర్‌బాగ్ జగజ్జీవన్‌రాం విగ్రహం వరకు ఊరేగింపుగా బయలుదేరి, పద్దెనిమిది గంటల పాటు నిరవధిక బైఠాయింపు చేపట్టారు. ముఖ్యమంత్రి హామీతో ఈ బైఠాయింపు విరమించినప్పటికీ ఆ తర్వాత కూడ వారి డిమాండ్లు ఏవీ నెరవేరలేదు. ◆

మాల మాదిగలలో ఐక్యత లేకపోవడం, బి.సి.లు సంఘటిత శక్తిగా ఎదగపోవడం, ముస్లింలు నిరాసక్తతతో ఉండడం వెరసి రాబోయే ఎన్నికలలో ఎలాంటి ప్రభావాన్ని వేస్తారో అంచనాకడుతున్నారు **జె. గౌతమ్**

# మూడో ప్రత్యామ్నాయ మబ్బులు

రాష్ట్రంలో 2009 ఎన్నికల రుతువు అప్పుడే మొదలయి మబ్బులు కమ్ముకుంటున్నాయి. అధికార కాంగ్రెస్, ప్రతిపక్ష తెలుగుదేశంపార్టీలకు ప్రత్యామ్నాయంగా మూడో రాజకీయశక్తికోసం అనేక శిబిరాలు పుట్టుకొస్తున్నాయి. ఈ శిబిరాలు ఎక్కడ ప్రారంభమై ఎక్కడ ముగుస్తాయో అంచనావేయడానికి ఇప్పటికిప్పుడు (డిసెంబర్ 21, ఈవ్యాసం రాసేనాటికి) స్పష్టతకు రాలేకపోవచ్చుకానీ మొత్తంగా మూడోశక్తికోసం జరుగుతున్న ప్రయత్నాలను రాజకీయశ్రేణులన్నీ సీరియస్‌గానే పరిగణిస్తున్నాయి. రాష్ట్ర ప్రజల ఆసక్తి మూడో రాజకీయాశయానికి అనుకూలంగాను వున్నట్టు కనిపిస్తోంది.

సామాజిక, ఆర్థిక, రాజకీయ, ప్రాంతీయ కోణాలనుంచి ఆంధ్రరాష్ట్ర రాజకీయాల చరిత్రను సంక్షిప్తంగా పరిశీలిస్తేగానీ నేడు మూడో రాజకీయశక్తి అవసరాన్ని సరిగా అంచనావేయలేం. స్వాతంత్ర్యా నంతరం రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీకి బ్రాహ్మణ, వైశ్యుల తర్వాత శూద్ర వ్యవసాయ కులాలయిన రెడ్లు ప్రధాన నాయకగణంగా, అధికార కేంద్రంగా మారారనేది జగమెరిగిన వాస్తవం. కాంగ్రెస్ పార్టీపేరుతో రెడ్డికులస్తులు తమ జనాభాకు మించి చట్టసభల్లో ప్రాతినిధ్యాన్ని పొందుతుండటమే కాకుండా వ్యవసాయక, పారిశ్రామిక అభివృద్ధి తమకోనమనేన్న రీతిలో ప్రణాళికలు రూపొందించుకుని మరింత భూస్వాములుగా, పెట్టుబడిదారులుగా నిలదొక్కుకున్నారు. ఈశక్తితోనే ఎన్ని ఒడిదుడుకులు ఎదురవ్తున్నా కాంగ్రెస్ పార్టీమొత్తాన్ని తమ కబంధ హస్తాల నుంచి జారనీయకుండా కాంగ్రెస్ గెలుపు రెడ్డికులస్తుల గెలుపుగా భావిస్తూ అధికారాన్ని సాధిస్తూ అనుభవిస్తూ వస్తున్నారు. కాంగ్రెస్‌లో మిగిలినవారిది రెడ్లతర్వాతనే అనేది ఆచరణలో నిగ్గుతేలిన తర్వాత రాష్ట్రంలో మరొక వ్యవసాయక భూస్వామ్యకులమయిన కమ్మలు కాంగ్రెస్‌కు ప్రత్యామ్నాయ రాజకీయాలకోసం ఆలోచించడం మొదలు పెట్టారు.

స్వాతంత్రోద్యమ కాలంనుండే తమకులాభివృద్ధిని కేంద్రంగా చేసుకుని కులసంఘాలను ఏర్పాటుచేసిన చరిత్ర రాష్ట్రంలో రెడ్డి, కమ్మ కులస్తులకు ఉంది. ఆనాటి బ్రాహ్మణ, వైశ్య ఆధిపత్యానికి వ్యతిరేకంగా ఈ రెండుకులాలు కమ్యూనిస్టు పార్టీలను సైతం ఆశ్రయించి రాజకీయ ఉనికిని, గుర్తింపును పొందటంతో కాంగ్రెస్ కేంద్రనాయకత్వం వ్యూహాత్మకంగా రాష్ట్రంలో ప్రధాన నాయకత్వాన్ని రెడ్లకు అప్పగించింది. ఆనాటి నుంచీ కాంగ్రెస్‌లో రెడ్లఆధిపత్యం అప్రతిహతంగా కొనసాగుతూనే వస్తోంది. మరొక వ్యవసాయ కులమయిన కమ్మలు కమ్యూనిస్టు పార్టీల్లో నాడు కీలకంగా ఉన్నా ఆపార్టీ ఆధ్వర్యంలో తమకు సంపూర్ణ అధికారాన్ని తెచ్చిపెడుతుందనే ఆశలు క్రమంగా సన్నగిల్లిపోవడంతో ప్రత్యామ్నాయ మార్గాలను ఆలోచించారు. అన్నివిధాలా పరిస్థితులు అనుకూలించడంతో చివరకు తెలుగుదేశం పార్టీని స్థాపించుకుని అనతికాలంలోనే అధికారంలోకి ఎగబాకారు. కాంగ్రెస్ వెంట ఒక భూస్వామ్యకులం, టిడిపి వెంట మరొక భూస్వామ్యకులం ప్రధాన కేంద్రీకరణగా మారడంతో అవే సామాజిక వర్గాల నాయకత్వంలో వున్న వామపక్ష పార్టీలు వాటికి అనుబంద సంఘాలుగా ఆచరణలో మారిపోయాయి.

ఈ పరిణామాల్లోనుంచి మెజార్టీ దళిత బహుజనులు కమ్యూనిస్టు పార్టీలను వదిలి అధికార, ప్రతిపక్ష పార్టీల చెంతకు చేరాల్సిన స్థితికి నెట్టబడ్డారు. మరో వైపు ప్రత్యామ్నాయ రాజకీయ ఉద్యమం కోసం నక్సలైట్ ఉద్యమాన్ని ఆశ్రయించారు. నక్సలైట్ రాజకీయాలు పార్లమెంటరీ ఎన్నికలను బహిష్కరిస్తుండం, వామపక్షాలు కాంగ్రెస్ తెలుగుదేశం పార్టీల కనుసన్నల్లో నడుస్తుండటం ఆచరణలో జరుగుతున్న మూలంగా ఎన్నికల రంగంలో కాంగ్రెస్, టిడిపిలకు ఎదురు లేకుండాపోయింది. రాష్ట్ర రాజకీయాధికారం రెండు సామాజికవర్గాల గుత్తాధిపత్యంగా మారింది. గ్రామీణ ప్రాంతాల్లో ఆయాకులాల పెత్తనం సామాన్య ప్రజలపై పెరిగి తారాస్థాయికి చేరింది. కారంచేడు, చుండూరు లాంటి నరమేధాలు అందుకు పెద్ద ఉదాహరణలు. చివరకు రాష్ట్ర రాజకీయాల పరిస్థితి ఎలా తయారయిం దంటే అగ్రకులాధిపత్య పార్టీలనే అధికారంలో ఉంచి వారి నుండి సామాన్య ప్రజలకు ఇళ్లస్థలాలు, హక్కులు, రాయితీలు, రిజర్వేషన్లు అడుక్కునే విధంగా వామపక్ష, కొన్ని విప్లవపక్ష పార్టీలు, సంస్థలు ప్రజలమైండ్‌సెట్‌ను తయారుచేశాయి. ఈ దశలో సమస్యల కోసం ప్రజలు ఉద్యమ సంఘాల వద్దకు వస్తున్నా ఎన్నికలప్పుడు కాంగ్రెస్, టిడిపిల వెంటే తిరిగి ఓటు వేయాల్సిన స్థితి తలెత్తింది. కాంగ్రెస్ మీద ఇష్టం లేకపోతే తెలుగుదేశానికి, తెలుగుదేశం మీద ఇష్టం లేకపోతే కాంగ్రెస్‌కు పట్టంకట్టాల్సిన దుస్థితి రాష్ట్ర రాజకీయాల్లో తలెత్తింది. ప్రజలకు మరోగత్యంతరం లేకపోతోంది.

ఇలాంటిస్థితి దశాబ్దంక్రితమే గమనించిన దళిత ఉద్యమశక్తులు ప్రత్యామ్నాయం కోసం ఆలోచిస్తున్న క్రమంలో 1994లో రాష్ట్రంలో బిఎస్‌పి ఆధ్వర్యాన ఒక ప్రయత్నం జరిగినా సరైన ఫలితాలు సాధించలేకపోయింది. ఆనాడు బహుజన రాజకీయశక్తిని కళ్లారా చూసిన కాంగ్రెస్, టిడిపి పార్టీల్లోని అగ్రకులాధిపత్య శక్తులు దళితబహుజనులను ప్రత్యామ్నాయ రాజకీయ నిర్మాణ శక్తిగా మారనీయకుండా అనేక వ్యూహాలుపన్నారు. ఇదే సమయంలో దళితులు ఎస్సీ రిజర్వేషన్‌వర్గీకరణ అంశంపై రెండు శిబిరాలుగా మారడంతో పాటు అధికార, ప్రతిపక్ష పార్టీలను తిరిగి ఆశ్రయించారు. చరిత్ర పునరావృతం అయింది. మధ్యలో అనేక కులప్రజాస్వామిక ఉద్యమాలు తలెత్తాయి. ప్రత్యామ్నాయ రాజకీయ (ఇక్కడ

ప్రత్యామ్నాయరాజకీయాలంటే కాంగ్రెస్, టిడిపి వ్యతిరేకార్థంలో మాత్రమే) ప్రయత్నంకోసం 1999లో మహాజనఫ్రంట్ ఏర్పాటు జరిగి ఎన్నికల్లో పోటీచేసింది. సుమారు 180సీట్లకు పోటీచేసి మూడుశాతం ఓట్లను సాధించింది. ఈ శాతం ఆఎన్నికల్లో పాల్గొన్న సిపిఐ ఓట్లశాతంకంటే ఎక్కువనే విషయాన్ని గమనించదగినది. అయితే ఎన్నికల అనంతరం మహాజనఫ్రంట్‌కూడా నిలకడగా నిలదొక్కుకోలేదు. ఇలా రెండుసార్లు దళితబహుజనుల నాయకత్వంలో రాజకీయప్రయత్నం జరిగి ఆచరణలో శక్తిగా, నిలకడగా నిలవలేకపోయింది. విధిలేక కాంగ్రెస్, టిడిపిలకు ఓట్లువేస్తున్నా మెజారిటీ ప్రజల్లో సామాజికన్యాయం కేంద్రంగా రాజకీయ ప్రత్యామ్నాయం రూపొందాలనే ఆకాంక్షలు బలపడుతూనే ఉన్నాయి.

ఈ దశలో ప్రాంతీయ ఆకాంక్షలకు రాజకీయ రూపంగా తెలంగాణలో టిఆర్ఎస్ ప్రజల ముందుకు వచ్చింది. ప్రత్యేకరాష్ట్ర సాధనతో పాటు కాంగ్రెస్, టిడిపి వ్యతిరేక రాజకీయాలను కూడా తెలంగాణ ప్రజలు టిఆర్ఎస్‌లో చూశారు. అందుకే టిఆర్ఎస్‌కు ఫలితాలు కట్టబెట్టారు. ఒక రకంగా 2004 ఎన్నికల్లో టిఆర్ఎస్ కాంగ్రెస్‌తో పొత్తుపెట్టుకున్నా తెలంగాణవరకు ప్రత్యామ్నాయశక్తి అనుకోవచ్చు. అయితే దానిలో జనాభా దామాషా ప్రాతినిధ్య అంశం, దళితబహుజనుల నాయకత్వ అంశాలు లేవు. అయినా భౌగోళిక తెలంగాణను కూడా తెలంగాణ దళిత బహుజనులు బలపరిచారు. నిరంకుశంగా మారిన టిడిపి పాలనను గద్దెదించారు. టిడిపి రాజకీయ వ్యతిరేకతతో గత ఎన్నికల్లో అనేక సమూహాలు కాంగ్రెస్‌కు (టిఆర్ఎస్‌కు, వామపక్షాలకు) పట్టం కట్టారు. అధికారం సాధించాక మళ్లీ కాంగ్రెస్‌తో, టిఆర్ఎస్‌తో చేదు అనుభవమే తెలంగాణ ప్రజలకు, దళితబహుజనులకు ఎదురు నిలిచింది. ఈ స్థితిలో తెలంగాణ ఏర్పాటును, సామాజిక న్యాయాన్ని ఏకకాలంలో అందించే రాజకీయ శక్తికోసం రాష్ట్రప్రజలు ఎదురు చూస్తున్నారు. కాంగ్రెస్‌ను కాదని మళ్లీ తెలుగుదేశాన్ని గెలిపించడానికి ప్రజలు ఇష్టంగాలేరు.

అయితే వామపక్షాలు భూమిపోరాటాల పేరుతో తమ ఉనికిని మరింత పెంచుకుని ఈ సారి కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా టిడిపిని ఆశ్రయించేందుకు రహస్యంగా పావులుకదుపుతున్నదనే (ముఖ్యంగా సిపిఐఎం) విషయం గమనిస్తున్న ప్రజలు వారి విధానాన్ని తీవ్రంగా నిరసిస్తున్నారు. 'మూడో రాజకీయానికి నీరూలేదు గ్లాసూ లేదంటూ' ఆపార్టీ నాయకుడు బి.వి.రాఘవులు చేసిన వాఖ్యానాలను రాష్ట్రంలో మూడో ప్రత్యామ్నాయం కోరుతున్న శక్తులు పట్టించుకోకుండా తిప్పికొట్టాయి. దాంతో రాఘవులుకూడా నోరుమెదపకుండా మౌనంగా వుండాల్సినస్థితికి నెట్టబడ్డారు. రాష్ట్రంలో కాంగ్రెస్, టిడిపి వ్యతిరేక ప్రత్యామ్నాయాన్ని నిర్మించడానికి వామపక్షాలు సిద్ధంగాలేవని గ్రహించిన దళిత, బహుజనశక్తులు తమశక్తిమేరకు రాజకీయ శూన్యాన్ని భర్తీ చేయడానికి ప్రయత్నిస్తున్నాయి.

ఆర్.పి.ఐ. నాయకుడు బొజ్జాతారకం ఆధ్వర్యంలో మహజన పార్టీతో పాటు మరికొన్ని సంస్థలు పార్టీలు కలిసి ప్రజాఫ్రంట్‌ను ఏర్పాటుచేశాయి. అయితే ఇది బలమైనశక్తిగా ప్రజల్లోకి వెళ్లలేకపోయింది. ఈ దశలో రాష్ట్రంలోని కొన్ని బిసి సంఘాలు మూడో రాజకీయ ప్రయత్నం చుట్టూ అనేక సమావేశాలు నిర్వహించాయి. రాష్ట్ర అధికారాన్ని వెంటనే పట్టుకోవాలంటే తమవల్ల కాదనుకుని కొందరు బిసినాయకులు స్వయంగా చిరంజీవికి స్వాగతం పలికారు. దళితబహుజనులు తమశక్తిమీద ఆధారపడి అగ్రకులాధిపత్య రాజకీయాలకు, వారి విధానాలకు భిన్నంగా జరగాలనుకుంటున్న రాజకీయ ప్రత్యామ్నాయం శక్తివంతమైన ప్రయత్నం పేరుతో, అధికారాన్ని తక్షణమే చేజిక్కించు కోవాలనే ఆశతో సడలింపు దిశగా, సర్దుబాటు దిశగా దారిమళ్లింది.

ఈ చర్చరాష్ట్రంలో జరుగుతున్నక్రమంలోనే ఉత్తరప్రదేశ్‌లో బిఎస్‌పి సర్వజన ఎత్తుగడతో సంపూర్ణ అధికారం సాధించడంతో ఆ ప్రభావం వెంటనే మన రాష్ట్రం మీదపడింది. దీనికి తోడు మాజీ ప్రభుత్వ ప్రధానకార్యదర్శి కాకిమాధవరావు ఆధ్వర్యాన బడుగువర్గాల సాధికారవేదిక ఏర్పడి రెండురోజులపాటు హైదరాబాద్‌లో సభలను నిర్వహించింది. గత యాభైఏళ్లుగా చట్టసభల్లో బడుగులు తమజనాభాకు అనుగుణంగా న్యాయంగా దక్కాల్సిన రాజకీయ ప్రాతినిధ్యాన్ని (ముఖ్యంగా బిసిలు, ముస్లింలు) ఏవిధంగా కోల్పోతూ వచ్చారో లెక్కలతోసహా వేదిక బయటపెట్టింది.

ఈ కాలంలోనే రాష్ట్రంలో నూతనంగా ప్రారంభమయిన 'సూర్య' దినపత్రిక సాధికారవేదిక సమాచారాన్ని మొదటిపేజీ బ్యానర్ వార్తలుగా ప్రచురించడంతో రాష్ట్రంలో రాజకీయ సంచలనానికి తెరలేచింది. గత రెండు దశాబ్దాలుగా అనేక దళితబహుజన, ప్రజాస్వామిక ఉద్యమాలు రగిలించిన కాంగ్రెస్, టిడిపి వ్యతిరేక రాజకీయచైతన్యం కమ్మ, రెడ్డి కులాధిపత్యంగా తిరిగి నలుమూలలా పెల్లుబికింది. 'రాజ్యాధికారంలో సామాజికన్యాయం' అంటూ సూర్యదినపత్రిక రాష్ట్రవ్యాపితంగా జరుపుతున్న సదస్సుల్లో ఎస్.సి., ఎస్.టి. బి.సి.ల ఆవేదన ప్రత్యామ్నాయ రాజకీయ ఆకాంక్ష ఎంత తీవ్రంగా వుందో వ్యక్తమవుతోంది. కాంగ్రెస్‌కు టిడిపి లేదా టిడిపికి కాంగ్రెస్ ఒకదానికొకటి ప్రత్యామ్నాయం కాదని. అవిరెండూ అగ్రకులాధిపత్యాన్ని, ఆర్థికపరంగా గ్లోబలీకరణ దోపిడీ అర్థికవిధానాలను అనుసరిస్తున్నాయని భావిస్తున్న దళితబహుజన రాజకీయశ్రేణులు సామాజికన్యాయం కేంద్రంగా, ప్రజానుకూల విధానాల కేంద్రంగా ప్రత్యామ్నాయంగా రూపొందాలని భావిస్తున్నారు.

ఇదిలా ఉండగా ఉత్తరప్రదేశ్ నమూనాలో ఆంధ్రప్రదేశ్‌లో కూడా అధికారాన్ని పట్టుకుంటామంటూ ప్రముఖ న్యాయవాది ఎస్.రామచంద్రరావు అకస్మాత్తుగా బ్రాహ్మణసంఘం నాయకుడిగా మారి కొందరు మాదిగ, మాల, బిసి, కాపు, వైశ్య నాయకులను (వీరు ఆయన క్లైయింట్‌లు కూడా) ఆహ్వానించి సర్వజన సమ్మేళనం ఏర్పాటు చేసినట్లు ప్రకటించాడు. సర్వజనలేపనంతో ఈ వకీలు ప్రధానస్రవంతి పత్రికల్లో మొదటిపేజీకి దూసుకువచ్చేసాడు. ఆయనచుట్టూ చేరితేనే తమకు చోటు, ఉనికి లభిస్తుందనుకునే కొన్ని కులసంఘాల నాయకులు సర్వజన సమ్మేళనానికి తన్మయం చెందుతున్నామని బేషరతుగా మద్దతు తెలిపేసారు. వెంటనే గాంధీపక్కకు రామచంద్రరావు చేరిపోయి రాష్ట్రమంతా, హైదరాబాద్ నగరం నిండా బ్యానర్లు, పోస్టర్లు వెలిసిపోయాయి. బిఎస్‌పి అధినాయకురాలు మాయావతి ముఖ్య అనుచరుడయిన సతీష్‌చంద్ర మిశ్రా తనతో రోజూ ఫోన్లో సంభాషిస్తున్నాడని తాము అవసరమయితే బిఎస్‌పిలో చేరతామని రామచంద్రరావు మాట్లాడుతూ రాష్ట్ర బిఎస్‌పి నాయకుల సానుకూలతను కూడా సాధించాడు. బిఎస్‌పి నాయకులు, మాలమహానాడు నాయకులు రామచంద్రరావు శిబిరంవద్దకు రావడంతో ఎమ్మార్పీఎస్ నాయకుడు కృష్ణమాదిగ తాము సర్వజన సమ్మేళనానికి దూరమవుతున్నామని, ఎబిసిడిని వ్యతిరేకించేవారితో కలవలేమని చెప్పి బయటపడ్డాడు. వెంటనే కృష్ణమాదిగస్థానాన్ని భర్తీచేయడానికన్నట్టు కృపాకర్‌మాదిగను సర్వజన సమ్మేళనానికి ఆహ్వానించారు. ఎన్నో కులసంఘాలు, పెద్దపెద్ద నాయకులు ఉమ్మడిగా కలిసి నిజాంకాలేజీఆవరణలో చేసిన సర్వజన సమ్మేళన బహిరంగసభ జనంలేని నాయకుల సభగామారి వెలవెల బోయింది. అయితే

సర్వజన సమ్మేళన బహిరంగసభలో రామచంద్ర రావుతోపాటు కులసంఘాల నాయకులంతా బిఎస్‌పిలో చేరతారని నమ్మిన బిఎస్‌పి నాయకులు ఆపార్టీ జాతీయ నాయకులను కూడా ఆహ్వానించాయి. కానీ రామచంద్రరావు నుంచి నిర్దిష్టంగా గ్రీన్‌సిగ్నల్ రాకపోవడంతో బిఎస్‌పి జాతీయనాయకులు సభకు హాజరుకాకుండానే గైరహాజరయ్యారు.

రామచంద్రరావు సర్వజన ప్రయత్నం చేస్తున్నప్పుడే సినీనటుడు చిరంజీవి రాజకీయ అరంగేట్రం ఖాయమైపోయిందనే వార్తలు తెలుగుపత్రికలనిండా అల్లుకుపోయాయి. తెలుగు జర్నలిజంలోనే కొత్తవొరవడికి తెలుగుపత్రికలు శ్రీకారంచుట్టాయి. క్షణాల్లో సర్వేలు నిర్వహించేసి గెలుపువోటములను కూడా తేల్చేశాయి. చివరకు చిరంజీవితో 'కాస్త ఆగండి' అంటూ ప్రకటనను రప్పించుకున్నాయి. ఈ స్థితిలో రామచంద్రరావు మాటమార్చి చిరంజీవి రాగం అందుకున్నాడు. కాపుకుల సంఘాల నాయకులు ఎన్నో ఏళ్ల నుంచి చిరంజీవి రాజకీయాల్లోకి రావాలని కోరుతూ వస్తున్నారు. ఇప్పుడు పరిస్థితి మరింత పరిపక్వమయిందని చిరంజీవి రాజకీయాల్లోకి రావడమంటూ జరిగితే ఇప్పుడే రావాలనీ, బడుగులుకూడా ఆహ్వానిస్తున్నారని కాపుమేధావులు విజ్ఞప్తులు చేస్తున్నారు. ఇదిలావుంటే చిరంజీవి బిఎస్‌పిలోకిరావాలని, వస్తే ముఖ్యమంత్రిని చేసేస్తామని బిఎస్‌పి రాష్ట్రనాయకులు ప్రకటించేశారు. చిరంజీవి తమ్ముడు పవన్‌కళ్యాణ్‌తో రహస్యమంతనాలు జరిపారు. అయితే బిఎస్‌పిపట్ల చిరంజీవి స్పందన ఎలావుందో బయటపడలేదు. చిరంజీవి రాజకీయాల్లోకి రావడమంటూ జరిగితే సొంతపార్టీ పెట్టుకునే వస్తారనేది సర్వత్రా వ్యక్తమవుతున్న అభిప్రాయం.

చిరంజీవి సొంతంగా పార్టీపెడితే ఆపార్టీ తెలంగాణపట్ల, సామాజికన్యాయంపట్ల ఎలాంటి విధానాలను వెల్లడిస్తుంది అనేదానిపై ఆధారపడి ఏయేశక్తులు ఆయనతో వెళతాయో తెలుస్తుంది. చిరంజీవి తెలంగాణకు అనుకూలమైతే టి.ఆర్.ఎస్. పొత్తుకోసం ప్రయత్నించవచ్చనే ఊహాలుఉన్నాయి. మరోవైపు టిఆర్ఎస్(ఎన్) నాయకుడు నరేంద్ర బిఎస్‌పిలో చేరనున్నాడనే వార్తల్లో ఎంత వాస్తవముందో తెలియడంలేదు. కనుక రాష్ట్రంలో బిఎస్‌పి ఎలాంటి వ్యూహాలను అనుసరించి శక్తిని కూడగడుతుందో, చిరంజీవి పార్టీపెడితే ఆయన పార్టీ విధానాలేమిటో దాన్నిబట్టి రాష్ట్ర రాజకీయాల్లో శక్తివంతమైన మూడో ప్రయత్నం ప్రజలముందుకు వస్తుందనిపిస్తుంది. చిరంజీవి పార్టీ పెడితే వామపక్షాలు ఎలావ్యవహరిస్తాయి? పెట్టకపోతే ఎలావ్యవహరిస్తాయి? అనేది కూడా కీలకమవుతుంది. అయితే చిరంజీవి కులపరంగా కాపుకులానికి చెందిన వాడుకావడంతో మరొక అగ్రకులం నాయకత్వంలో రూపొందితే కాంగ్రెస్, టిడిపిలకు ఏవిధంగా భిన్నమైనద వుతుందనే వారూ లేకపోలేదు.

బిఎస్‌పి అనుసరిస్తున్న సర్వజన రాజకీయం కూడా ఇక్కడ ఎంతమేరకు వర్కవుట్ అవుతుందో ఆచరణలో చూడాల్సివుంది. వీటికి బయట అనేక దళిత, బహుజన రాజకీయ ఉద్యమసంస్థలు, పార్టీలు మరికొన్ని వున్నాయి. ఇవన్నీ బిఎస్‌పివద్దకుగానీ, చిరంజీవిపార్టీవద్దకుగానీ వెళతాయా లేక మరోకూటమికోసం ప్రయత్నిస్తాయా అనేదికూడా ఇప్పుడే చెప్పలేనిస్థితివుంది.

ఈ మధ్యలో కె.ఎ.పాల్ ప్రజాశాంతిపార్టీని స్థాపిస్తున్నట్లు ప్రకటనవచ్చింది. ఎస్సీ,ఎస్టీ,బిసి,ముస్లిం,కాపుల ఐక్యత వర్ధిల్లాలని ఆయనకూడా అంటున్నాడు. లోక్‌సత్తా పార్టీ బడుగులకు 100 స్థానాలను మహిళలకు 33శాతం సీట్లను కేటాయిస్తామని ప్రకటించింది.

ఇవన్నీ ఒకకోణమయితే గ్రామీణస్థాయిలో కమ్మ, రెడ్డి, అగ్రకులాల ఆధిపత్యం చెక్కుచెదరకుండానే కొనసాగుతోంది. ఇతర అగ్రకులాలుకూడా ఆధిపత్యంవహిస్తున్నా అవన్నీ రాజకీయంగా కాంగ్రెస్, టిడిపిల చెంతవున్నాయి. గ్రామీణ సమాజంలో 70శాతంగా ఉన్న దళితబహుజన ప్రజలకు నమ్మకమైన, శక్తివంతమైన రాజకీయశక్తి వారిముందు నిర్దిష్టంగా ఆవిష్కరణ జరగలేదనేది వాస్తవం. కేవలం దళిత, బహుజన విద్యావంతుల్లో మాత్రమే ప్రత్యామ్నాయరాజకీయ ప్రయత్నం సుడులుతిరుగుతోంది. సామాన్య ప్రజలు మాత్రం అధికార, ప్రతిపక్ష పార్టీల గుప్పిట్లోనే ఉన్నారు. ఈస్థితిలో చిరంజీవి పార్టీపెడితే గ్రామీణ స్థాయిలో నాయకత్వం వహించగలిగిన భూస్వామ్య కాపుకులం శక్తి మూడో ప్రత్యామ్నాయ రాజకీయాలకు దొరుకుతుంది. దానిచుట్టూ ఎవరెవరు చేరతారనేదానిపై ఆధారపడి ఫలితాలు వుండవచ్చు.

ఎన్నికల రాజకీయాలంటే కోట్లరూపాయలఖర్చుతో కూడిన వ్యవహారం. ప్రజలు తమకు ఓటువేయరని గ్రహించిన అగ్రకులపార్టీల అభ్యర్థులు ఎన్నికల్లో కోట్లుగుమ్మరిస్తున్నారు. ప్రజలుకూడా ఇరువురిదగ్గరా డబ్బులుతీసుకుని ఎవరికో ఒకరికే పట్టంగడుతున్నారు. ప్రత్యామ్నాయ రాజకీయానికి అధికార,ప్రతిపక్షపార్టీస్థాయిలో డబ్బుఅవసరం లేకపోయినా వాటిని ఢీకొనే విధంగా ఉనికిలో ఉండటానికికూడా కోట్లలో డబ్బు అవసరమవుతుంది. అంత ఆర్థికశక్తి దళిత బహుజనశక్తులకు లేదు. కనుకనే చిరంజీవి వైపు కూడా చూస్తున్నారనిపిస్తుంది.

ఒక పక్క తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు అంశం, మరోపక్క బడుగుల జనాభాదామాషా ప్రాతినిధ్య అంశం కలిసి 2009 ఎన్నికల్లో మెజారిటీ ప్రజల ప్రత్యామ్నాయ రాజకీయ ఎజెండా కాబోతుందనే విషయం స్పష్టమవుతోంది. దీన్ని దారిమళ్ళించేందుకు కులతత్వాన్ని తిప్పికొట్టేపేరుతో ప్రధానస్రవంతి పత్రికలు, కొందరు ప్రధానస్రవంతి మేధావులతో ప్రతిదాడికి దిగడం అప్పుడే ప్రారంభించింది. ఒకటి రెండు పెత్తందారీ కులాల గుత్తాధిపత్యాన్ని ప్రశ్నిస్తూ తమకు కుల జనాభా దామాషా ప్రకారం చట్టసభల్లో న్యాయంగా రావాల్సిన ప్రాతినిధ్యాన్ని కోరుతున్నవారి ఆకాంక్షలు మీడియాకు, వామపక్షాలకు, లోక్‌సత్తా లాంటిపార్టీలకు కులతత్వంగా కనిపించడంలో పెద్దగా ఆశ్చర్యంలేదు.

ఈ స్థితిలో దళిత, బహుజన ఉద్యమసంస్థలు, మేధావులు నిజమైన రాజకీయ ప్రత్యామ్నాయాన్ని ప్రజలజీవన అవసరాలుతీర్చే విధానాలతో ముందుకు తీసుకురాగలుగుతారో లేదో ఆచరణలో తేలాల్సి ఉంది. భూమిలేని పేదలకు భూమి, కులవృత్తులు కోల్పోతున్నవారికి ప్రత్యామ్నాయ ఉపాధి, నిరుద్యోగుల ఉద్యోగ అవకాశాలు, విద్య, ఆరోగ్యం, సంక్షేమంలాంటి వాటిపట్ల ప్రజానుకూల విధానాలను స్పష్టంగా ప్రత్యామ్నాయ రాజకీయశక్తుల ఎజెండాగా మార్చడానికి ప్రజాస్వామిక ఉద్యమసంస్థలు, మేధావులుకూడా కృషిచేయాల్సివుంది.

మాల, మాదిగల అనైక్యత, బిసిల్లో సంఘటితశక్తి నిర్మాణం కాకపోవడం, ముస్లింలు ప్రత్యామ్నాయ రాజకీయ ప్రయత్నాల్లో అంతగా కనిపించకపోవడం చూస్తుంటే 2009 ఎన్నికల రాజకీయ ప్రత్యామ్నాయంలో వీరిది నిర్ణయాకపాత్ర అవుతుందా అనేది కూడా ఆలోచించాల్సిన అంశాలు. ఈ స్థితిలో కాంగ్రెస్, టిడిపి వ్యతిరేక రాజకీయశూన్యాన్ని భర్తీచేయడంలో బిఎస్‌పి, లేదా చిరంజీవి పెట్టే పార్టీలు ఎలాంటి నిర్ణయాత్మక పాత్ర పోషిస్తాయో వేచి చూడాల్సి ఉంది. ప్రత్యామ్నాయ మబ్బులు తీవ్రంగా కమ్ముకుంటున్న దృశ్యాలు వాస్తవమేకానీ ఏమబ్బులు ఎక్కడ వర్షిస్తాయో ఆ వర్షం తీవ్రత ఎంతవుంటుందో ఇప్పుడే చెప్పలేం. ◆

పోరాడి సాధించుకున్న అనేక హక్కులు, చట్టాల అమలుకై పోరాటం చేయాల్సి ఉందని, ఆదివాసీ మహిళలు, వారితో కలిసి ప్రజాస్వామ్య శక్తులన్నీ ఉద్యమించాల్సి ఉందని అంటున్నారు **రామారావు దొర**

# ఆదివాసీ మహిళల ఆత్మగౌరవ పోరాటం

భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించి షష్టిపూర్తి సంబరాలు ఘనంగా నిర్వహించుకొన్నాం. స్వాతంత్ర్యం అంటే ఏమిటో తెలియని ఆదివాసులు న్యాయం కోసం నాగరిక ప్రపంచం వైపు పరుగులు తీసిన రోజు ఆగస్ట్ 20. ఆ రోజు విశాఖపట్నం జిల్లా, జి. మాడుగుల మండలం, వాకపల్లి గ్రామంలో గ్రేహౌండ్స్ పోలీసులు చొరబడి పదకొండు మంది ఆదివాసీ మహిళలపై పడి అత్యాచారం చేసి మావోయిస్టు సానుభూతి పరులుగా ముద్రవేశారు.

మన రాష్ట్ర మానవ హక్కుల చరిత్ర, పోలీసుల చరిత్ర తెలిసిన వారెవరూ వాకపల్లి గ్యాంగ్ రేప్ ఘటన చూసి ఆశ్చర్యపోరు. గత చరిత్ర పునరావృతం అయింది. గతంలో ఆదివాసులపై జరిగిన ప్రభుత్వ తప్పిదాలను అంగీకరించిన చరిత్ర ప్రభుత్వానికి లేదు. వేలాది మంది ఆదివాసులు మలేరియాతో మరణించినా అసలు మలేరియా మరణాలే లేవని సాక్షాత్తు రాష్ట్ర ఆరోగ్య శాఖా మంత్రి రోశయ్యగారు ప్రకటించారు. 1993 ప్రాంతంలో జి.కె. వీధి మండలంలో ఆదివాసుల గూడేలను మావోయిస్టు సానుభూతిపరుల నెపంతోనే తగలబెట్టారు. అలాంటిది వాకపల్లి ఘటన సహజమైనదిగా పట్టించుకోనవసరం లేనిదిగా కనిపిస్తుంది. ఇలాంటి సహజ, సాధారణ ఘటనను చూసి ప్రజా సంఘాలు ఇంత ఆందోళన చేయడమేమిటని హోంమంత్రి దగ్గరి నుండి జిల్లా ఎస్.పి. వరకు ఆశ్చర్యపోయారు. ఘటన జరిగిన కొద్ది గంటల్లోనే డి.జి.పి. ఏమీ జరగలేదని తేల్చేసారు. వారు మావోయిస్టు సానుభూతి పరులని బుకాయించారు. ఇరవై సంవత్సరాలుగా ఇలాంటి అకృత్యాలు అనేకం చేసిన అనుభవం ఉంది. ఇలాంటి అకృత్యాల లిస్టులో తాజాది 'వాకపల్లి సామూహిక అత్యాచార' ఘటన. ఇది అంతం కాదు, ఆరంభం కాదు, కొనసాగింపు మాత్రమే. గ్రేహౌండ్స్ వెళ్లిన చోటల్లా ఇలాంటివి అనేకం జరుగుతున్నా బయటి ప్రపంచం దృష్టికి వచ్చింది తక్కువే. ఆదివాసుల ప్రాంతాల్లో ఇది నిత్యకృత్యం. 'ఎవరి అదృష్టమో, ఎవరి దురదృష్టమో' ఈ ఘటన వెంటనే బయట ప్రపంచానికి తెలిసింది.

## ఘటన పూర్వాపరాలు

వాకపల్లి, పూర్తిగా ఆదిమ జాతి (పిటిజి) కోందు గిరిజనులు నివసించే గ్రామం. ఆగస్ట్ 14న జి. మాడుగులలో జరుగు మంగళవారం వారపు సంతకు పోయిన ఆ గ్రామానికి చెందిన ఇద్దరు యువకులు పాంగి సూర్యం, పాంగి ప్రకాశ్ సంతపని ముగించుకొని వాకపల్లి తిరిగి వెళుతుంటే జి.మాడుగుల పోలీసులు ఎత్తుకెళ్లి గ్రేహౌండ్స్ - ప్రత్యేక పోలీసులకు అప్పగించారు. సూర్యం లొంగిపోయిన మావోయిస్టు, ప్రకాశ్ సామాన్య రైతు యువకుడు. అక్కడి నుండి మావోయిస్టుల జాడ చెప్పమని ఏజెన్సీ కొండల్లో తిప్పుతూ ఆగస్ట్ 20న పాంగి ప్రకాశ్‌ను వాకపల్లి గ్రామానికి ఉదయం 4.30 నుండి 5 గంటల ప్రాంతంలో మసక చీకటిలో తీసుకువచ్చారు. అది వర్షాకాలం, పోడుపనులు ముమ్మరంగా ఉంటాయి. ఐదు ఆరు కిలోమీటర్ల దూరంలో కొండలపైకి వెళ్లి పనులు చేయాలి, కాబట్టి పురుషులు ఉదయం 4.30 ప్రాంతం నుండే పనులకు బయలు దేరుతారు. ఆ సమయంలో గ్రేహౌండ్స్ పోలీసులు అనుమానం రాకుండా ఎదురు పడిన రైతులకు లాల్ సలామ్ అని చెప్పుకుంటూ గ్రామం వైపు వెళ్తూ కనిపించారు. రైతులు వారిని ఏమీ పలకరించలేదు. సమీప కొండ ప్రాంతంలో పాంగి ప్రకాశ్‌ను ముసుగుతో నేలపై పడుకోబెట్టి పైకి లేస్తే కాల్చి చంపుతామని బెదిరించారు. ఎవరికి అనుమానం రాకుండా ఉదయం 5.30 గంటలకు గ్రామాన్ని చుట్టుముట్టారు. ఆ సమయంలో పొలిమేర గెడ్డలో స్త్రీలు నీరు తెచ్చుకుంటున్నారు. ఇల్లు వాకిలి శుభ్రం చేసుకునే పనిలో కొందరు, పశువుల పాకల్లో పేడ, గత్తం శుభ్రం చేసే పనిలోను, కాలకృత్యాలు తీర్చుకునే పనిలోను ఉన్నారు. ఈ విధంగా ఎవరి పనుల్లో వారు నిమగ్నమై ఉండగా గ్రామం చుట్టూ పొంచి ఉన్న గ్రేహౌండ్స్ బలగాలు మొదట నీరు తెచ్చుకునే మహిళలపై పడ్డారు. వారిపై తుపాకులు ఎక్కుపెట్టి చంపుతామని బెదిరించి పక్కనే ఉన్న పశువుల దొడ్లలోకి నలుగురిని ఊరు వెనకవైపు మెట్ట గడ్డి దుబ్బుల్లోకి మరో ఇద్దరిని లాక్కెళ్లి అత్యాచారం చేశారు. బాధితుల నుండి ప్రతిఘటన లేకుండా ఉండడానికి ఒకరు తుపాకి ఎక్కుపెట్టగా మిగిలినవారు ఒకరి తరువాత ఒకరు సామూహికంగా అత్యాచారం చేశారు. దీనికి సాక్ష్యంగా పసుపు దొడ్లు, గడ్డి దుబ్బుల్లో పగిలిన గాజులు, నలిగిపోయిన పసుపు తోట, గడ్డి మొక్కలు రెండు నెలల వరకు కూడా సాక్ష్యం చెప్పడానికి సిద్ధంగా ఉన్నా వాటిని భౌతిక సాక్ష్యాలుగా గుర్తించేందుకు ఎవరూ ప్రయత్నించలేదు. కనీసం మానవ హక్కుల కమిషన్ సభ్యురాలు గుమ్మడి సంధ్యారాణిగారు కూడా పరిగణనలోకి తీసుకోలేదు. లొంగిపోయిన మావోయిస్టు సూర్యం భార్య శ్రీదేవి అనారోగ్యంతో ఇంటి ముందుండగా నీ భర్తకు మావోయిస్టులతో సంబంధాలున్నాయని బెదిరిస్తూ ఇంటి ముందు ఒకరు కాపలా ఉండగా మరో ఇద్దరు పోలీసులు లోపలికి లాక్కెళ్లి ఒకరి తర్వాత ఒకరు అత్యాచారం చేశారు. ఈమెకు నెలక్రితమే పాప పుట్టి చనిపోయింది. పాంగి బార్సో నలుగురు పిల్లల తల్లి. ఈమెను కూడా అత్యాచారం చేశారు. మరొకామెను పశువుల పాకలో అత్యాచారం

చేశారు. ఈ విధంగా ఎక్కడ దొరికిన వారినక్కడే బహిరంగంగా సామూహికంగా అత్యాచారం చేశారు. ఈ విధంగా మొత్తం పదకొండు మంది వివాహితులపై అత్యాచారం జరిగింది. మరికొందరిపై అత్యాచారానికి ప్రయత్నించారు. వారు అతి కష్టంగా తప్పించుకున్నారు. కొందరు స్త్రీలు తలుపులు బిగించుకొని తమ మానాలను కాపుదుకున్నారు. ఇంకా ఇళ్లలోని వస్తువులను చిందర వందర చేశారు. కరెంటు వైర్లు లాగేశారు. డ్వాక్రా పుస్తకాలు చించి పారేశారు. ఈ విధంగా ఆరు గంటల నుండి ఎనిమిది గంటల వరకు అరాచకం సృష్టించారు. కొండ ప్రాంతంలో ఉన్న రైతులకు సమాచారం అందించి, విధిలేక స్త్రీలందరూ ఏకమై తిరగబడడంతో ఉదయం ఎనిమిది గంటల ప్రాంతంలో గ్రేహౌండ్స్ పోలీసు బలగాలు గ్రామాన్ని విడిచి వెళ్లాయి.

పాంగి సూర్యంకు గతంలో మావోయిస్టులతో సంబంధం ఉన్నా నాలుగు సంవత్సరాల క్రితం లొంగిపోయి గత సంవత్సరమే వివాహం చేసుకొని సాధారణ జీవితం గడుపుతున్నాడు. ఘటన జరగడానికి వారం రోజుల ముందు గ్రేహౌండ్స్ అదుపులో ఉన్నాడు. ఆ గ్రామం జి.మాడుగుల – బొయితిలి ప్రధాన రహదారికి కనుచూపు మేరలో ఉంటుంది. ఆ ప్రాంతంలో నిరంతరం కూంబింగ్ కూడా జరుగుతుంది. కాబట్టి ఆ గ్రామం మావోయిస్టుల షెల్టర్ కానేరదు. ఈ పరిస్థితులలో గ్రేహౌండ్స్ వాకపల్లి గ్రామస్తులపట్ల, మహిళలపట్ల శత్రుత్వం ఉండవలసిన అవసరంలేదు. గ్రేహౌండ్స్ వాకపల్లిపై పడి ఇంత అరాచకం భయోత్పాతం సృష్టించడానికి కేవలం మావోయిస్టుల ప్రభావమే ప్రధాన కారణం కాదని తేలుతోంది.

గ్రేహౌండ్స్ – ప్రత్యేక పోలీసు బలగాల గత ఇరవై ఒక్క సంవత్సరాల చరిత్ర చూస్తే అంతా అరాచకమే. దీనికి ఎన్నో సాక్ష్యాలు, తార్కాణాలు, పత్రిక వార్తలు, కథనాలు ప్రతినిత్యం చూస్తున్నాం. కాని ఏ ఒక్క సందర్భంలోనూ వారు శిక్షింపబడలేదు. కనీసం నేరస్తులుగా నిలుపబడలేదు. వీరిపై వచ్చిన ఆరోపణలేవి ఆషామాషివి కావు. చాలా తీవ్రమైనవి. ఉదాహరణకు – వ్యక్తులను మాయం చేయడం, బూటకపు ఎన్‌కౌంటర్లు చేయడం, అనుమానితుల పేరిట అక్రమంగా నిర్బంధించి చిత్రహింసలకు గురిచేయటం, మచ్చుకు కొన్ని. వీరి ఆకృత్యాలకు బలి అయినవారు కేవలం విప్లవకారులే కాకుండా లాయర్లు, ఉపాధ్యాయులు, ఆదివాసి మహిళలు, విద్యార్థులు, యువజనులు, హక్కుల కార్యకర్తలు, ఇళ్ల స్థలాలకోసం ధర్నాలు చేసే పేదవారు, దళితులు ఇలా దాదాపు అందరు సామాన్యులే. అలాంటప్పుడు అమానవీయ బలగాలను పాలకులు ఎందుకు ఏర్పాటు చేసుకుంటున్నారు. కొద్దిగా పరిశీలిస్తే రాజ్య యంత్రాంగ వ్యూహంలో భాగంగా కొన్ని ప్రత్యేక లక్ష్యాలు నెరవేర్చుకోవడానికి ఇలాంటి అణచివేత రూపాలను అమలుచేస్తున్నారు. వాటిలో కొన్ని ముఖ్యమైనవి –

1. బతుకు దెరువుకోసం రాజ్యంతో లేదా సహజ వనరులు కొల్లగొట్టే బహుళజాతి సంస్థలకు (అల్యూమినియం రిఫైనరీ, బక్సైట్ తవ్వకాలు, పోలవరం, ఎస్.ఇ.జెడ్.లు) వ్యతిరేకంగా జరిగే పోరాటాలపై, ప్రజలపై అత్యాచారాలు, చిత్రహింసలు, విధ్వంసం, అక్రమ నిర్బంధాల వంటివి ప్రయోగించి ప్రతిఘటనను అణచడం కోసం.

2. ప్రజా సమూహాలు తమ న్యాయమైన హక్కుల కోసం ఉద్యమించినప్పుడు వాటికి చట్టబద్ధంగా పరిష్కరించే, ఎదుర్కొనే ప్రజాస్వామ్య దృక్పథం, సత్తాలేనప్పుడు అలాంటి ఉద్యమాలు తమ అస్తిత్వానికి ప్రమాదమని అప్రజాస్వామిక పద్ధతుల ద్వారానే నోరు నొక్కి భయపెట్టి నాయకత్వాన్ని టెర్రరైజ్ చేసి అణచివేయడం కోసం.

3. హక్కుల కోసం మాట్లాడే మధ్యతరగతి బుద్ధి జీవులైన లాయర్లు, ఉపాధ్యాయులు, రచయితలు, హక్కుల సంఘాల కార్యకర్తల గొంతునొక్కడం, ఇంకా వినకపోతే అణచివేయడం కోసం.

4. ఉద్యమకారులను అంతం చేయడం కోసం. ఇంకా తాము చేయలేని పనులేమైనా ఉంటే ప్రైవేట్ హంతక ముఠాలు ఏర్పరిచి వాటి ద్వారా ఆ పనులు చేయించి తమ బినామీలుగా ఉపయోగించుకోవడం. వాటికి డబ్బు, ఆయుధాలు, చట్ట వ్యతిరేక మద్దతు ఉండేటట్లు చూడడం కోసం మొదలయినవి చాలా ఉన్నాయి.

అంతిమంగా ఈ బలగాలన్నీ న్యాయ వ్యవస్థ పరిధిలోకి రాకుండా అధికార హంతక ముఠాలుగా వ్యవస్థీకృతమై ఉన్న పరిస్థితి ఉంది. ఈ పరిస్థితిని ఎలా ఎదుర్కొవాలో సామాన్య పేద ప్రజల తరఫున మాట్లాడే సామాజిక వాదులు ఆలోచించవలసింది.

## ఘటనానంతర పరిణామాలు

వాకపల్లి ఘటన జరిగిన రోజు స్థానిక ప్రజా ప్రతినిధులు జి.మాడుగుల ఎం.పి.పి. ఎస్.వి. రమణ, పాడేరు ఎం.ఎల్.ఎ. లకే రాజారావు, ప్రింట్-ఎలక్ట్రానిక్ మీడియా బాధ్యతాయుతంగా వ్యవరించి బయటి ప్రపంచానికి వాస్తవాలు తెలియపరిచారు. ముందు తెలిపినట్టుగా హోంమంత్రి, డి.జి.పి., ఎస్.పి. పోటాపోటీగా ఇది మావోయిస్టుల కుట్ర, అత్యాచారమే జరగలేదని ఘటన జరిగిన కొన్ని గంటల్లోనే ఏ విచారణ లేకుండా ప్రకటించారు.

స్థానిక ఎం.ఎల్.ఎ. చొరవతో బాధితులు అదే రోజు సబ్ మెజిస్ట్రేట్ అయిన పాడేరు సబ్‌కలెక్టర్‌కు ఫిర్యాదు చేశారు. ఎఫ్.ఐ.ఆర్. నమోదు చేసి ఐపిసి 376 (II) (జి) కింద పోలీసులపై సామూహిక అత్యాచారం కేసు నమోదు చేశారు. బాధితులు ఆదివాసీ కోందు మహిళలు గనుక ఎస్.సి., ఎస్.టి. అత్యాచారాల నిరోధక చట్టం 1989 సెక్షన్ 3(2)(v) కింద 21 మంది పోలీసుల (గుర్తు తెలియని 21 మంది పోలీసులపై) కేసు నమోదు చేశారు. మహిళలను పరీక్షల నిమిత్తం కె.జి.ఎచ్.కు తరలించమని ఆదేశించారు. ఇక అప్పటి నుండే కేసును నీరు గార్చడానికి పోలీసులు చేయని ప్రయత్నం లేదు. పాడేరులోనే రాత్రి పది గంటల వరకు సాగదీసి కె.జి.ఎచ్.కు తీసుకొని వెళ్లవలసి ఉండగా మార్గమధ్యం నుండి ఎ.ఎస్.పి., పాడేరు డి.ఎస్.పి.లు బలవంతగా అనకాపల్లికి మళ్లించారు. సాధారణంగా ఏ చిన్న జ్వరం వచ్చినా రోగులను పాడేరు నుంచి కె.జి.ఎచ్. విశాఖకు తరలిస్తారు. కాలాతీతం చేయడానికి అనకాపల్లికి దారి మళ్లించారు. ఈ విషయాన్ని గమనించిన బాధితులు జి.మాడుగుల ఎం.పి.పి. ఎస్.వి. రమణ, ప్రజా సంఘాల ప్రతినిధులు ఘర్షణ పడగా తిరిగి కె.జి.ఎచ్.కు తరలించారు. వైద్య నివేదికలు సరిగా రాకుండా ఇరవై నాలుగు గంటలకు పైనే ఆలస్యం చేశారు. మరో వైపు వైద్య రిపోర్టులు సరిగా రావడానికి అత్యాచారం జరిగిన తర్వాత సాక్ష్యం నిమిత్తం అలాగే ఉండాలని బాధితులకేం తెలుసు? ఎవరైనా ఇరవై నాలుగు గంటలు అదే విధంగా ఉండగలరా? ఈ సమయంలో మూత్ర విసర్జన, కడుక్కోవడం వంటివి జరుగుతాయి.

కేవలం మెడికల్ రిపోర్టులే మొత్తం ఘటన జరిగిందనటానికి ప్రామాణికం కాదని దీనిని బట్టే తేలిపోతుంది. ఇలాంటి సందర్భాల్లో జిల్లా కలెక్టర్, ఎస్.పి.లు చట్టాన్ని గౌరవించి వాకపల్లి వెళ్లి విచారించాలి. కాని రాష్ట్ర డి.జి.పి.యే లేదని చెప్పినప్పుడు వెళ్లవలసిన అవసరం లేదనిపించిదేమో, అందుకే వెళ్లలేదు. ఇదంతా ఇలా ఉంటే సాధారణంగా అత్యాచారం కేసుల్లో నాలుగు దశల్లో నిర్ధారణ చెయ్యాలి.

మొదటి దశలో అత్యాచారం జరిగిన ప్రదేశంలో ఏవైనా ఆధారాలు (సీన్ ఆఫ్ అఫెన్స్) దొరుకుతాయేమో చూస్తారు. కాని ఈ కేసులో అత్యాచారం ఆరోపణలు వచ్చిన వెంటనే ఆధారాలు సేకరించే పని ఎవరూ చేయలేదు సరికదా, బాధ్యత గల అధికార్లు నిర్లక్ష్యంగా వ్యవహరించారు. బాధితుల వద్ద, గ్రామస్తుల వద్ద, ఇతర ప్రత్యక్ష సాక్షుల వద్ద వాంగ్మూలాలు తీసుకోవాలి. రెండు నెలల తరువాత హైకోర్టు జిల్లా మెజిస్ట్రేట్ కోర్టును ఆదేశించే వరకు ఆ పని జరగలేదు. నిందితులను వెంటనే అరెస్ట్ చేసి ప్రాసిక్యూట్ చేయాలి. మూడు నెలలు గడిచిపోతున్నా ఏ ఒక్కరినీ అరెస్ట్ చేయలేదు.

రెండో దశలో బాధితుల ఒంటిపైనా, జననాంగాల పైనా గాయాలేమైనా ఉన్నాయా చూస్తారు. వైద్య నివేదికలు సరిగా రావడానికి సాధ్యమైనంత వేగంగా వైద్య పరీక్షలు నిర్వహించాలి. కాని అది ఉద్దేశ్య పూర్వకంగానే కావలసినంత ఆలస్యం చేశారు. కె.జి.ఎచ్‌లో సదరు పరీక్షలు నిర్వహించి ఎలాంటి గాయాలు లేవని నిర్ధారించారు. వాస్తవానికి ఇద్దరు మహిళలపై బూటుకాళ్లతో తొక్కిన గాయాలున్నాయి. కాని గాయాలున్నాయా లేదా అనే దానిపై ఆధారపడి అత్యాచారం జరిగిందా లేదా అని నిర్ధారణకు రాకూడదని సుప్రీంకోర్టు గతంలో పేర్కొంది. ఈ ఘటనలో సాయుధులైన కూంబింగ్ పోలీసులు తుపాకులు గురిపెట్టి భయపెట్టినారని బాధితులు అంటున్నారు. కాబట్టి బాధితుల ప్రతిఘటన లేకుండానే అత్యాచారం చేశారు. గాయాలు ఉండే అవకాశం తక్కువ.

మూడవ దశలో బాధిత మహిళల నుండి సేకరించిన నమూనాలు హైదరాబాద్ పంపారు. కాని ఆ నమూనాల్లో వీర్యకణాలు లేవనే కారణంగా లైంగిక చర్య జరగలేదని నిర్ధారించారు. కాని ఈ ఇరవై నాలుగు గంటలు పోలీసులు ఉద్దేశ్యపూర్వకంగా ఆలస్యం చేయడం జరిగింది. ఈ విషయంలో పూర్తిస్థాయి డి.ఎన్.ఎ పరీక్షలు కూడా జరగలేదు. ఈ పరీక్షలను నిర్వహించిన ఫోరెన్సిక్ విభాగం వారు రాష్ట్ర పోలీసు శాఖ పరిధిలోకే వస్తారు, కాబట్టి ఈ నిర్ధారణను విశ్వసించలేం.

అత్యాచారం చేసినవారు గ్రేహౌండ్స్ బలగాలు, స్థానిక పోలీసులైతే ఒకరు కాకున్న ఒకరైన గుర్తుపట్టగలరు. గ్రేహౌండ్స్ కొత్త ముఖాలు అందరూ ఒకే విధమైన దుస్తులు, ఒడ్డు పొడవు ఉండడం, సంఘటన హఠాత్తుగా జరగటం వల్ల బాధితులు దిగ్భ్రాంతికి లోనై ఉంటారు. కాబట్టి అంత తేలికగా గుర్తుపట్టలేకపోవచ్చు. అయినప్పటికీ వెంటనే గుర్తించే ప్రక్రియ (ఐడెంటిఫికేషన్ పరేడ్) చేపట్టినట్లైతే కొంత వరకు ఫలితం ఉండేది. ఈ కొద్దిపాటి ఫలితం కూడా ఉండకూడదని ఇప్పటి వరకు ఆ పని చేయలేదు. ఇవన్నీ సాక్ష్యాలను ఏమార్చడం కాదా? ఆరోపణలు పోలీసులపైనే కాబట్టి వారు నిష్పాక్షికంగా విచారణ చేస్తారని నమ్మలేం. ఇలాంటి సందర్భంలో పోలీసేతర స్వతంత్ర విచారణకు చర్యలు చేపట్టాలి. ఈ విషయాన్ని నాగిరెడ్డి గారి నివేదికలో కూడా పేర్కొన్నారు.

## పోరాట క్రమం - వాస్తవాలు - విమర్శ

నిజానికి వాకపల్లి ఘటనపై కొన్ని పార్టీలు, మానవ పౌర హక్కుల సంఘాలు, ప్రజా సంఘాలు, కొన్ని స్వచ్ఛంద సంస్థలు, కొంత మంది మానవతా వాదులు వెంటనే రాష్ట్ర వ్యాప్తంగా స్పందించారు. ఆ మేరకు ఉద్యమాన్ని కూడా నిర్మించారు. ఇది గ్రహించిన పోలీసులు పాడేరులో కొనసాగుతున్న ఉద్యమానికి సహకరించిన ఒక్కొక్కరినీ పిలిపించి బెదిరించారు. 15-20 సంవత్సరాల క్రితం ఉద్యమాలు చేసి సాధారణ జీవితాలు గడుపుతున్న వారిని పాతకేసులు తిరగదోడి భయపెట్టారు. స్థానిక ఎం.ఎల్.ఎ. రాజారావును, ఇతర సంఘాల ప్రతినిధులను మావోయిస్టు సానుభూతిపరులని ముద్రవేసి కాల్చి చంపుతామని బెదిరించారు.

పోలీసుల ఎత్తుగడలో భాగంగా సి.పి.ఎం., టి.డి.పి. ఆదివాసి ఐక్యపోరాట సమితి నుండి ఎటువంటి కారణం లేకుండా తప్పుకున్నాయి. అలాగే కొన్ని గిరిజన సంఘాలు అంటీ ముట్టనట్లు వ్యవహరిస్తే, మరికొన్ని సంఘాలు ఘటన దరిదాపుకు కూడా రాలేదు. టి.డి.పి. పోరాట సమితి నుండి వైదొలిగిందంటే ఆశ్చర్యపోవలసింది ఏమీలేదు. కాని పేద ప్రజల కోసమే నిరంతరం పోరాడుతున్నట్లు చెప్పుకునే సి.పి.ఎం. వాకపల్లి ఉద్యమం నుంచి మధ్యలోనే తప్పుకోవడమేమిటి? ఇప్పుడు జరుగుతున్న భూపోరాటాలు, బాక్సైట్, పోలవరం పోరాటాలలో కూడా మధ్యలో తప్పుకోరని గ్యారంటీ ఏమిటి? ఈ విధంగా టి.డి.పి., సి.పి.ఎం., సి.పి.ఐ.లు వాకపల్లి ఉద్యమాన్ని నీరుగార్చాయి.

బాధిత కోందు ఆదివాసులది ఒకవైపు న్యాయం కోసం తపన, మరోకవైపు బలీయమైన వెనుకబాటుతనం. జరిగిన దానికి, జరుగుతున్న దానికి వారి మనసుల్లో బెరుకుతనం, భయం ఆవరించి ఉంది. ఈ భయం అభద్రత - అశక్తతగా మారే ప్రమాదం ఉంది. వాకపల్లి గ్రామస్తులను మీరు న్యాయ విచారణకు పట్టుబట్టినా, పాడేరు వెళ్లి దీక్షలో పాల్గొన్నా జరిగిన దానికన్నా తీవ్రంగా ఒక్కొక్క స్త్రీని ఇరవై మంది కలిసి అత్యాచారం చేస్తాం అని బెదిరించారు. ఒకవైపు ఇలా బెదిరిస్తూనే సెప్టెంబర్ 8న వాకపల్లి సందర్శించిన ఎఎస్‌పి ఆనందరావు పోలీసు బలగాల పహరాలో ఒక్కొక్కరికి ఐదు లక్షల చొప్పున డబ్బులు చూపించి బాధితులకు నయానో భయానో లొంగదీసుకోవడానికి ప్రయత్నించారు.

ఆదివాసుల్లో కోందులు కులకట్టుబాట్లను ఆదివాసీ సంప్రదాయాలను బలంగా విశ్వసించే తెగ. వీరికి బయట ప్రపంచంతో సంబంధాలు తక్కువ. ఏ విషయంలోనైనా అబద్ధాలు చెప్పడం, మభ్యపెట్టడం వీరికి తెలియదు. కోందు మహిళలు నిజాయితీకి మారుపేరనే విషయాన్ని అందరూ ఒప్పుకుంటారు. అందుకే పోలీసులు ఎరచూపిన డబ్బును తిరస్కరించారు. కావాలంటే మా పంటలు అమ్మి మీకే డబ్బులు ఇస్తాం మాకు న్యాయం చేయండి అన్నారు.

తీవ్రమైన వెనుకబాటులో ఉన్న వీరికి ధైర్యం చెప్పి రక్షణ కల్పించవలసిన ప్రభుత్వం వారిని భయపెట్టి, డబ్బు ఆశచూపి లొంగదీసుకోవాలనుకుంటుంది. వారికి సంఘీభావం తెలియజేసే ప్రజా ప్రతినిధులు, సానుభూతిపరులను మావోయిస్టు సానుభూతిపరులుగా చిత్రీకరిస్తుంది. ఈ విధంగా పోలీసు నయానా - భయానా కేసును నీరుగార్చడానికి అనేక జిత్తుల మారి మార్గాలు అనుసరించింది.

ఈ విధంగా ప్రభుత్వం, పోలీసులు, కొన్ని పార్టీలు వాకపల్లి

ఉద్యమాన్ని నీరుగార్చడానికి ఎన్ని ప్రయత్నాలు చేసినా బాధిత మహిళలు ధైర్యంగా నిలబడి మాకు న్యాయం జరగకపోతే ఆత్మ బలిదానానికైనా సిద్ధపడి సెప్టెంబర్ 22 నుండి ఆమరణ దీక్షలు చేపట్టారు. ఏడు రోజుల తరువాత కోర్టును గౌరవించి విచారణకు సహకరించేందుకు తాత్కాలికంగా ఆమరణ దీక్ష వాయిదా వేసుకోవలసి వచ్చింది. ఈలోపు నాగిరెడ్డిగారు (టి.డబ్ల్యూ కమిషనర్) విచారణ నిర్వహించారు.

## నాగిరెడ్డి కమిషన్ గురించి

మొత్తానికి నాగిరెడ్డి గారి నివేదిక 'కర్ర విరగని పాము చావని' చందంగా ఉంది. ప్రభుత్వాన్ని ఇరుకున పెట్టకూడదనే ఉద్దేశ్యంతో నివేదిక తయారు చేసినట్లుంది. చాలా విషయాలు లోతుగా పరిశీలించలేదని స్పష్టమౌతోంది.

1. ఘటనకు సంబంధించి కొన్ని భౌతిక సాక్ష్యాలు ఉన్నట్లు గుర్తిస్తూనే బాధ్యులైన పోలీసులను అరెస్ట్‌కు గాని, గుర్తింపు ప్రక్రియకు గాని సిఫార్సు చేయలేదు.

2. బాధితులపై ఎలాంటి గాయాలు లేవని పేర్కొన్నారు. తుపాకులు చూపి భయపెట్టి అత్యాచారం జరిపిన సందర్భాలలో ప్రతిఘటన ఉండకపోవడానికి అవకాశం ఎక్కువ అప్పుడు గాయాలు ఎలా ఉంటాయి? ఈ విషయాన్ని పరిశీలించలేదు, పరిగణనలోకి తీసుకోలేదు.

3. మెడికల్ రిపోర్టులకు ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చారు. వాస్తవానికి మెడికల్ రిపోర్ట్ సరిగా రాకుండా కాలయాపన చేశారు. ఈ అంశాన్ని సాక్ష్యాన్ని ఏమార్చడంగా చూపించలేదు. ఇలాంటి సందర్భాలలో మెడికల్ రిపోర్ట్‌లను ప్రామాణికంగా తీసుకోకుండా సుప్రీంకోర్టు తీర్పుకు అనుగుణంగా సిఫార్సు ఉండవలసింది. ఆ విధంగా జరగలేదు.

4. ఆదిమ జాతి కోందు గిరిజన మహిళల సంప్రదాయిక నిజాయితీనీ, నిబద్ధతనూ అదే విధంగా గ్రేహౌండ్స్ ప్రత్యేక పోలీసు బలగాల మానవ హక్కుల ఉల్లంఘనల చరిత్రనూ పరిగణనలోనికి తీసుకొని సిఫార్సు చేయవలసి ఉండాల్సింది.

5. నాగిరెడ్డి చిత్తశుద్ధితో చేసిన రెండు సిఫార్సులు జిల్లా ఉన్నత అధికారులైన కలెక్టర్ ఎస్పీలపై చర్యకు సిఫార్సు, ఆదివాసీ ఐక్యపోరాట సమితి డిమాండ్ మేరకు ఎస్.ఆర్. శంకరన్‌తో బహిరంగ న్యాయ విచారణ జరిపించాలని పేర్కొన్నారు.

## హైకోర్టు ఆధ్వర్యంలో సి.ఐ.డి. విచారణ

రాష్ట్ర ప్రభుత్వ పోలీసు ఉన్నతాధికారుల కనుసన్నల్లో పనిచేసే సి.ఐ.డి. అధికారి విచారణ 'మసిపూసి మారేడుకాయ' చేసినట్లు రాష్ట్ర ప్రభుత్వం హైకోర్టుచే పథకం ప్రకారం సి.ఐ.డి. విచారణ నియమింప చేసుకుంది. పోలీసు బాసులు కోరిన విధంగా విచారణ చేసి నివేదిక ఇచ్చారు. ఇక్కడ నేరవిచారణ నేరస్తులైన గ్రేహౌండ్స్‌పై కాకుండా బాధితులైన మహిళలపైన చేశారు. నేర విచారణ ప్రక్రియ అంతా ఏకపక్షంగా ఫార్సుగా జరిగింది. ఏ భౌతిక ఆధారాలనూ, ప్రత్యక్ష సాక్ష్యుల వాంగ్మూలాలనూ పరిగణనలోకి తీసుకోలేదు. ఘటనను కళ్లార చూసిన పది సంవత్సరాల డానియల్ వాంగ్మూలాన్ని పట్టించుకోలేదు. సి.ఐ.డి. అధికారి వాకపల్లి సందర్శించడానికి ఒక రోజు ముందే సంఘటనా స్థలంలోని గాజు ముక్కలను పోలీసు ఉన్నతాధికారులు మార్చేశారు. ఇదంతా పథకం ప్రకారం జరిగింది. నాగిరెడ్డి నివేదికలో ఉపేక్షించిన విషయాలే ఇక్కడ పూర్తిగా ఉపేక్షించారు. చివరికి ఈ నివేదిక ఏమి తేల్చిందంటే ఈ తెలివైన ఆదివాసీ మహిళలు పథకం ప్రకారం నాటకమాడారు. ఆ మేరకు ఘటనాస్థలంలో గాజుముక్కలు నలిగిపోయిన పసుపుదొడ్లను సృష్టించి అమాయకులైన గ్రేహౌండ్స్‌పై అబద్ధపు ఆరోపణలు చేశారని, ఈ సి.ఐ.డి.ని నియమించింది సాంకేతికంగా హైకోర్టుయే కనుక దానిని విశ్వసించి కేసు మూసివేసింది. ఇక జరగబోయేది ఇంకా న్యాయం, ధర్మమని అరచి కేకపెడితే దొంగ సాక్ష్యాలు, గాజుముక్కలు సృష్టించినందుకు బాధిత మహిళలపైనా, వారికి మద్దతు పలికిన వారిపైనా హైకోర్టుతీర్పు సాక్షిగా కేసులు బనాయించడమే.

## హైకోర్టు తీర్పు గురించి

అన్ని నివేదికలు పరిశీలించిన అనంతరం హైకోర్టు అత్యాచారం జరిగిందనిగాని జరగలేదని కాని తేల్చలేదంటే, నేర నిర్ధారణ సరిగా జరగలేదని అర్థం. అలాంటి సందర్భంలో కేసు ఎలా మూసివేస్తారు? నేరారోపణకు గురి అయింది పోలీసులు. హోంమంత్రి నుండి డి.జి.పి. వరకు బహిరంగంగా, దాపరికం లేకుండా పోలీసుల పక్షం వహించారు. మరి వారికింద పనిచేసే సి.ఐ.డి. వారు నిష్పాక్షికంగా విచారణ చేస్తారని కోర్టు ఎలా నమ్మింది? ఈ విషయంలో బాధితులు - ప్రజా సంఘాల వారు ముందే తమ అభ్యంతరాలను, అనుమానాన్ని వ్యక్తం చేశారు. ఈ విషయాన్ని హైకోర్టు ఎందుకు పరిగణనలోకి తీసుకోలేదు? సి.బి.ఐ. చే విచారణ జరిపించాలనే పిటిషన్‌ను ఎందుకు కొట్టివేసింది? ఒకవైపు అత్యాచారం జరగలేదని చెప్పలేమని ఒప్పుకుంటూనే కేసును మూసి వేయడం దుర్మార్గమైన తీర్పు తప్ప మరేమీ కాదు. అతి సామాన్యులకు (ఆదివాసి మహిళలు) కనీస న్యాయ తృణీకరణగా హైకోర్టు చరిత్రలో ఈ తీర్పు నిలిచిపోతుంది. మానవ హక్కుల ఉల్లంఘన రేటింగ్‌లో ఇప్పటి వరకు రాష్ట్ర పోలీసులదే ప్రథమ స్థానం - ఈ తీర్పుతో రాష్ట్ర హైకోర్టు కూడా వారితో జత కలిసింది.

రాజ్యాంగం - చట్టాలు గ్రంథాల్లోనూ, న్యాయ కళాశాలల్లో బోధించడానికి, కోర్టుల్లో వాదించడానికి తప్ప ఇలాంటి సంఘటనల్లో బాధిత ఆదివాసీ మహిళలకు ఏమీ ఉపయోగపడ్డట్టు లేదు. న్యాయ శాస్త్రం కేవలం శాస్త్రంగా, యాంత్రికంగా మిగిలిపోతున్నది. న్యాయ శాస్త్ర అభివృద్ధికి - న్యాయం కోసం తహతహలాడే ఆదివాసీల జీవితాల్లోకి చొరబడడానికి మధ్య అగాధం - వారికి జరుగుతున్న అన్యాయం ప్రతిబింబిస్తుందనే వాస్తవం ఈ ఘటన రుజువు చేస్తోంది. ఆదివాసీల ఆత్మగౌరవానికి చట్టబద్ధతే లేదన్నది వాకపల్లి ఘటన గుర్తు చేస్తోంది.

కమిషన్ల గురించి అంతర్జాతీయ వేదికలపై లెక్కలు చెప్పుకోవడానికి, డాంబికాన్ని, వాగాండబరాన్ని ప్రదర్శించడానికి మొదటి వరసలో ఉండే ఈ కమిషన్లు వాకపల్లి ఆదివాసి మహిళలకు జరిగిన అన్యాయంపై పూర్తి నిర్లక్ష్యాన్ని ప్రదర్శించాయి. దొంగలు పడ్డ ఆరు నెలలకు కుక్కలు మొరిగినట్లు ఘటన జరిగిన మూడు నెలలకు గాని ఎస్.టి. కమిషన్‌కు వాకపల్లి గుర్తురాలేదు. ఇక మానవ - మహిళల హక్కుల కమిషన్‌కు వాకపల్లి అత్యాచారానికి గురియైనవారు మానవులుగా, మహిళలుగా కనిపించలేదేమో అందుకే ఇప్పటి వరకు స్పందించనే లేదు.

(...మిగతా 17వ పేజీలో)

**అభివృద్ధి పేరుతో ప్రపంచ బ్యాంక్ వేస్తున్న పథకాలన్నీ ఇక్కడ అగ్రకులాల ప్రయోజనాల్ని కాపాడడానికే తప్ప దళితులకు జరుగుతున్న మేలేమీ లేదంటున్నారు జె. సుభద్ర**

# దళితుల ప్రయోజనాలను దెబ్బతీస్తున్న ప్రపంచబ్యాంక్

భారతదేశంలోనే ఆంధ్రప్రాంతం ఉద్యమాలకు నిలయంగా చెప్పుకోవచ్చు. కమ్యూనిస్టు ఉద్యమాలకే దిక్సూచిగా ఉన్న తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటం ఈ ప్రాంతంలోనే జరిగింది. దళిత ఉద్యమాలు, ఆదివాసి ఉద్యమాలు, స్త్రీల పోరాటాలు, సారా వ్యతిరేక పోరాటాలు, ప్రాంతీయవాద పోరాటాలు, వామపక్ష ఉద్యమాలు, నక్సల్ పోరాటాలున్న ప్రాంతం ఈ ఆంధ్రప్రదేశ్. స్త్రీలు ఈ అన్నింటిలో ప్రధానంగా ఆర్థిక, సాంఘిక, రాజకీయ లక్ష్యాలకోసం పనిచేయడం జరిగింది. వీటన్నింటిలో స్త్రీలే ప్రత్యేకంగా పోరాడిన ఉద్యమం సారా వ్యతిరేక ఉద్యమం. ఈ ఉద్యమంలో కీలకమైనది సారాను రద్దుచేయడం, స్త్రీలు పొదుపు చేయడం. దీనికి ప్రభుత్వ ప్రోద్బలం కూడా తోడై బలం పుంజుకుంది.

అట్లా పొదుపు చేసిన కోట్లాది రూపాయల్ని 1995లో యునైటెడ్ స్టేట్స్‌లో భాగమైన యు.ఎన్.డి.పి. చేసిన ప్రతిపాదనలతో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఎస్.ఎచ్.జి. (సెల్ఫ్ హెల్ప్ గ్రూప్స్)ని ఏర్పాటు చేసింది. ఈ గ్రూపుల్లో ఇప్పటి దాకా జరిగిన ప్రాక్టీస్ చూస్తే దళిత, ముస్లిం, ఆదివాసీ స్త్రీల భాగస్వామ్యం దాదాపు లేదనే చెప్పవచ్చు. కాస్తో కూస్తో ఉన్న మహిళలే పొదుపు చేయగలరు. లేని వాళ్లు లేదు. అట్లా లేనివాళ్లు దళితులుంటారని వారికి పొదుపుకు ప్రత్యేక పద్ధతులుంటాయని ప్రపంచబ్యాంక్ గుర్తించట్లేదు. గుర్తించి అందుకు అనుగుణమైన ప్రణాళికలు రూపొందించుకోవడం లేదు, మార్చుకోవడం లేదు, కుల అసమానతలు పట్టించుకోవడం లేదు.

అట్లాగే ఈ ఎస్.ఎచ్.జి.లు రోడ్డుకు ఆనుకొని ఉన్న గ్రామాలు, పట్టణాల్లోనే నడుస్తున్నాయి కానీ, మారుమూల గ్రామాల్లో ఇవి పని చేయడం లేదు. అందుకే ఈ ఎస్.ఎచ్.జి.లు మారుమూల ప్రాంతాల్లో ఉండే ఏ స్త్రీలకూ అందుబాటులో లేవనొచ్చు.

తరతరాలుగా వ్యవసాయ రంగంలో కూలీ చేస్తూ బతికిన బిసి, ఎస్.సి. స్త్రీలు ఎస్.ఎచ్.జి.లో ఉన్నా కూడా వారు ఒక్కసారిగా పొదుపు, బిజినెస్, మార్కెట్ స్థాయి వరకు ఎదిగే అవగాహనా తరగతులు పద్ధతులు వారికి కల్పించడం లేదు. ఎస్.ఎచ్.జి.లు అనేవి మహిళా సాధికారిత అని చెప్పుకుంటున్న ప్రపంచ బ్యాంక్ సాధికారిత సాధించడానికి అడ్డం పడుతున్న సాంఘిక కారణాల్ని ఆర్థిక, రాజకీయ, ప్రాంతీయ, మత, కులాల్ని కూడా పరిగణనలోకి తీసుకోవడం లేదు. వీటిని ఎదిరించడానికి ఎస్.ఎచ్.జి.లకు ఎలాంటి అవగాహనలు కూడా లేవు.

ఇంకా ఈ ఎస్.ఎచ్.జి.లు స్త్రీల పొదుపుకే పరిమితం చేయడం వల్ల వారికే బాధ్యత పెరుగుతోంది. కాని అప్పు చేయించడం మగవాళ్ల ఒత్తిడి వల్ల జరిగితే అప్పు తీర్చే బాధ్యత, బరువు స్త్రీల మీదనే పడి వారు ఆత్మహత్యలు చేసుకునే దాకా పరిస్థితులు వెళున్నాయి. ఇవన్నీ ప్రపంచ బ్యాంక్ మాట్లాడ్డం లేదు. కాని ఎస్.ఎచ్.జి.లు ఆంధ్రరాష్ట్ర జెండర్ రెవెల్యూషన్‌గా అంతర్జాతీయ సంస్థల్లో చాటింపు వేసుకుంటోంది.

ప్రపంచీకరణ, ప్రైవేటీకరణలు అమలయ్యే క్రమంలోనే 73వ సవరణ రావడం జరిగింది. ఈ సవరణ వల్ల ఆంధ్రప్రదేశ్‌లో 1994 నుండి దళిత, బహుజన, గిరిజన, స్త్రీలకు స్థానిక సంస్థల్లో రిజర్వేషన్స్ వచ్చి, వారు నాయకత్వంగా ఎదిగి గ్రామ అభివృద్ధిలో భాగమయ్యే అవకాశమొచ్చింది. కాని ప్రపంచ బ్యాంక్ ప్రణాళిక అమలుతో పంచాయితీ రాజ్ వ్యవస్థలో సమాంతర సంఘాల్ని రూపొందించడం జరిగింది. అట్లా విద్యాసంఘాలు, నీటిపారుదల సంఘాలు, వన సంరక్షణ, తల్లుల కమిటీ, ఎస్.ఎచ్.జి.లు, మంచినీటి కమిటీ, నీటివినియోగ సంఘాలు వచ్చినాయి. కాని ప్రస్తుతం ఎస్.ఎచ్.జి.లు, వాటర్ యూజర్స్ అసోసియేషన్స్ మాత్రమే ఏం జేస్తున్నవి. ఈ సమాంతర సంఘాలవల్ల స్థానికంగా ఎన్నికైన దళిత బహుజన గిరిజన స్త్రీల అధికారాల్ని హరింపజేసినయి. ఎందుకంటే 73వ సవరణకు ముందు ఆధిపత్య కులాలే స్థానిక సంస్థల అధికారులుగా ఉండినపుడు గ్రామానికి సంబంధించిన అన్ని వనరుల మీద వారిదే పెత్తనం. కాని ఈనాడు రిజర్వేషన్ల ద్వారా గ్రామాల మీద అధికారం, నాయకత్వం వచ్చినా కూడా గ్రామ వనరుల మీద, ఆ వనరులకు సంబంధించిన మార్కెట్ మీద వీరికి ఎలాంటి నియంత్రణ, నిర్వహణాధికారం లేదు. వనరులున్న పెద్ద కులాల మీద వనరులు లేని కిందికులాలు ఆధిపత్యం నిర్వహించకుండా ఉండడానికే సమాంతర సంఘాలు సహకరిస్తున్నాయి. ఇవి ప్రధానంగా ఆధిపత్య కులాలకు అనుకూలంగానే పని చేస్తూ కింది కులాలను ఇంకా అణచే ప్రయత్నంగానే కనిపిస్తున్నవి.

వాటర్ యూజర్స్ అసోసియేషన్‌లో రూపొందించిన ప్రపంచ బ్యాంక్ ప్రణాళిక ఆంధ్రప్రదేశ్ అంతా ఒకే విధంగా ఉంది. ప్రాంతాల వారీగా ఉన్న భౌగోళిక, ఆర్థిక, రాజకీయ, సామాజిక ఉత్పత్తి పరిస్థితుల్ని, సిస్టమ్‌ని పట్టించుకోవట్లేదు. ఉదాహరణకు - తెలంగాణ ప్రాంతం పూర్తిగా గొలుసుకట్ట చెరువు నిర్మాణాల కింద జరిగే ఇరిగేషన్ వ్యవసాయం. కోస్తాంధ్రలో కాలువ ఇరిగేషన్ సిస్టమ్ ఉంది. వీటి తేడాల్ని పరిగణనలోకి తీసుకోకుండా ఒకే పథకం, పద్ధతి అమలు చేయడం వల్ల తెలంగాణ చెరువులు ఎండిపోయి, ఇరిగేషన్ వ్యవస్థ దెబ్బతిన్నది.

ఇంకా రైతుల్నే, అందులో పెద్ద రైతుల్నే (అంటే భారత దేశ కుల వ్యవస్థ చూస్తే పెద్ద రైతులంటే ఆధిపత్య కులాలే) దృష్టిలో ఉంచుకునే ఈ వాటర్ యూజర్స్ అసోసియేషన్ ఏం జేస్తుంది? ఇక్కడి కుల వ్యవస్థగా ఉన్న ఆర్థిక విధానాల్ని కులాల వారిగా నీళ్ల ఉపయోగం చేసుకునే ప్రయోజనాల్ని పక్కన పెట్టింది. బట్టలుతికే చాకలి వాళ్లని, బర్లని కడిగే మాదిగ, గొల్లల్ని చేపలు పట్టే తెనుగు కులాల నీటి వినియోగ ప్రయోజనాల్ని కాపాడలేకపోయింది. వారికి యూజర్ ఛార్జీలు పెంచడం వల్ల వారు ఆ నీళ్లకు దూరమయ్యారు. అసోసియేషన్‌లో వారికి ఎలాంటి నిర్ణయాధికారం ఉండదు. కొన్ని ప్రాంతాల్లో వారికి సభ్యత్వం కూడా లేదు. మొత్తంగా ఇక్కడ కుల ప్రయోజనాలు కాపాడబడుతున్న వాటికి భిన్నంగా ఈ ప్రపంచ బ్యాంకుల్లేవు. ◆

---

*(15వ పేజీ తరువాయి...)*

### ప్రెస్-మాస్ మీడియా గురించి

సమాజంపై గణనీయ ప్రభావం చూపగల ప్రెస్-మాస్ మీడియా వాకపల్లి ఘటనపై చేయవలసినంత చేయలేదు. మొదట్లో విషయాన్ని సంచలనాత్మకంగా ప్రజంటేషన్ చేసినా, కాలం గడిచే కొద్ది విషయాన్ని పై పైన స్పృశించి యాంత్రికంగా మార్చివేశారు. దీనివలన ప్రజలు తీవ్రమైన ఈ విషయాన్ని తేలికగా తీసుకున్నారు.

అతి సాధారణ విషయాలపై కూడా చర్చావేదికలు నిర్వహించే మీడియా ఈ విషయంపై ఎటువంటి చర్చావేదికలు ఏర్పాటు చేయలేదు. జాతీయంగా ప్రచారం చేయవలసిన ఈ అంశాన్ని చాలావరకు స్థానిక ఎడిషన్‌లకే పరిమితం చేశారు. లెఫ్ట్ - రైట్ జాతీయ మాగజైన్‌లైన ఫ్రంట్‌లైన్, ఇండియా టుడే వంటి పత్రికలు ఏమీ జరగనట్టే, తమ దృష్టికి రానట్టే ప్రవర్తించాయి.

మరో ముఖ్య విషయం ఏమిటంటే వాకపల్లి ఘటన యాదృచ్ఛికం కాదని, పక్కా పథకం ప్రకారం ఉన్నత స్థాయిలో తీసుకున్న విధాన నిర్ణయానికి అనుగుణంగా జరిగిందని గతంలో గ్రేహౌండ్స్ ప్రత్యేక బలగాల పనితీరు పరిశీలిస్తే తేలికగా అర్థం అవుతుంది. ఈ కోణం నుండి మీడియా ఎక్కడా విశ్లేషించలేదు.

### సారాంశం

ఈ విధంగా తీవ్రమైన ఈ ఘటనను చాలా మంది బాధ్యతాయుత పౌరులు పట్టించుకోవలసినంతగా పట్టించుకోలేదు. జాతీయ మీడియా చేయవలసినంత విమర్శ, విశ్లేషణ ప్రచారం చేయలేదు. చట్ట సభలు చర్చించనేలేదు. కమిషన్లు న్యాయంగా విచారించలేదు. ఇంకా కొన్ని స్పందించలేదు. న్యాయవ్యవస్థ న్యాయం చేయలేదు. ఈ విధంగా సమస్యకు పరిష్కారం, బాధితులకు న్యాయం లభించలేదు. ఈ లోపు చాలాకాలం గడిచిపోతుంది. సమస్య పాతబడుతుంది. పాతబడ్డ ఈ సమస్య కొత్త రూపంలో మన ముందుకు తప్పక వస్తుంది. దీనికి బాధ్యులెవరు?

నేరం చేసిన గ్రేహౌండ్స్ ప్రత్యేక బలగాలను నేరస్తులనే అంటున్నాం. కాని జరిగినదానిని చూస్తూ స్పందిచని వారిని ఏమనాలి? ఈ పరిస్థితికి వారిది కూడా బాధ్యత లేదా?

ఈ విషయాన్నంత పరిశీలిస్తున్న బుద్ధిజీవులెవరికైనా ఈ దేశంలో అతి సామాన్యులకు కనీస న్యాయం లభించదని ఈపాటికి అర్థమయ్యే ఉంటుంది. ఇంకా ఇక్కడి ప్రజాస్వామ్యం, చట్టసభలు, కోర్టులు, రాష్ట్ర -జాతీయ హక్కుల కమిషన్‌లు కేవలం వాగాడంబరమని కూడా తెలుసుకుంటారు. చివరిగా నేరమే అధికారమైనట్లు ముక్తాయింపు ఇచ్చుకుంటారు.

ఈ వ్యవస్థలోని ఎంతటి ప్రజాస్వామిక అంగమైనా దాని విధాన నిర్ణయాలకు వ్యతిరేకంగా గట్టిగా నిలబడదనే ఒక వాస్తవం గుర్తించాలి. బయటకు చెప్పని ఈ విధానాలను ప్రశ్నించాలి. ఈ దృక్పథం నుంచే ప్రజలను చైతన్య పరచి ఉద్యమాలను నిర్మించాలి. పోరాడి సాధించిన అనేక హక్కులు, చట్టాలను అమలుపర్చుకునే దిశగా ప్రభుత్వంతో పాటు న్యాయవ్యవస్థతోను న్యాయ పోరాటం చేయాలి. అందుకే వాకపల్లి ఆదివాసీ మహిళల న్యాయ పోరాటాన్ని కొనసాగించాలనీ, దానికి ప్రజాస్వామిక శక్తులన్నీ బాసటగా నిలవాలనీ ఆదివాసీ విముక్తి సంఘటన్ పిలుపునిస్తోంది. ◆

---

**వచ్చే సంచికలలో...**

- ఫోకస్ - ఫిబ్రవరి 2008 : మతోన్మాదం
- ఫోకస్ - మార్చ్ 2008 : ఆంధ్రప్రదేశ్‌లో భూ సంస్కరణలు
- ఎత్తివేసే దిశగా చేనేత రిజర్వేషన్ చట్టాలు - పులుగుజ్జు సురేష్
- మనుషులూ, మాటలూ - కొడవటిగంటి రోహిణీ ప్రసాద్
- ఏ వైరస్‌కు మందేయాలి? - పి. కృష్ణారావు

**బాల్యం గడిచిన తీరుపైనే వ్యక్తి భవిష్యత్తు ఆధారపడి ఉంటుందనీ, దేశ భవిష్యత్తు బాలలపైనే అని అటువంటి బాల్యాన్ని తీర్చిదిద్దే బాధ్యత అందరిదీ అంటున్నారు గుగులోతు దేవోజి, బానోతు సరోజ**

# దేశంలో బాలల పరిస్థితి

ప్రపంచంలోనే మనదేశం అత్యధిక బాలలు కలిగిన దేశం. ఏ దేశ ప్రగతి అయిన అక్కడి మానవ వనరులపై ఆధారపడి ఉంటుంది. అభివృద్ధి ఎజెండాలో బాలల అభివృద్ధికి అత్యధిక ప్రాధాన్యత ఎందుకంటే పునాదులు లేని సౌధాలు కుప్పకూలిపోతాయి. ఇది కేవలం భవనాలకు, సౌధాలకు మాత్రమే వర్తించే సత్యం కాదు. సమాజ నిర్మాణానికి ఈ సత్యం వర్తిస్తుంది. సమాజ నిర్మాణానికి పునాది బాలలు. బాలలుగా బంగారు కాంతులతో విలసిల్లినప్పుడే సమాజం వెలుగు పూలు పూస్తుంది. ఒక వ్యక్తి జీవితంలో బాల్యం ఎంతో ముఖ్యమైన దశ. ఒక వ్యక్తి బాల్యం ఏవిధంగా గడిచింది అనే దాని మీదే ఆధారపడి ఆ వ్యక్తి భావి జీవితం రూపుదిద్దుకుంటుంది. భావి జీవితానికి పునాది ఈ బాల్యదశలోనే ఏర్పడి అభివృద్ధి చెందుతుంది. బాల్యం నిష్కళంకమైనది, తారతమ్యాలు లేనిది, నిస్వార్ధమైనది. ఒక దేశ భవిష్యత్ అయినా, ఒక జాతి భవిష్యత్ అయినా బాలలపైనే ఆధారపడి ఉంటుంది. అందుకే ఐక్యరాజ్య సమితి మాజీ సెక్రటరీ జనరల్ కోఫీ అన్నన్ "పిల్లల పట్ల ప్రపంచం చూపించే ప్రేమానురాగాలు, విశ్వాసాలకు మించిన పవిత్ర అంశం మరొకటి లేదు. పిల్లల హక్కులను పరిరక్షిస్తూ, ఆ హక్కులను గౌరవిస్తూ, వారి సంక్షేమాన్ని రక్షిస్తూ పిల్లల జీవితాలు భయమన్నది ఎరుగక, కొరతన్నది తెలియక శాంతియుతంగా ఎదిగేందుకు నిర్వర్తించే కర్తవ్యాన్ని మించిన కర్తవ్యం మరొకటి లేదు"అని అన్నారు.

ప్రపంచ జనాభా 2001లో 6,137 మిలియన్‌లు ఉన్నట్లు అంచనా కాగా, సంవత్సరానికి 78 మిలియన్‌ల జనాభా పెరుగుతోంది. భారతదేశంలో 20వ శతాబ్ది చివరి 10 సంవత్సరాలలో సంవత్సరానికి 18 మిలియన్ల మంది పెరిగారు. 1999 అక్టోబర్ 12వ తేదీ నాటికి ప్రపంచ జనాభా ఆరు బిలియన్‌లు చేరగా వారిలో సగం మంది 25 ఏళ్లు వయస్సు వారే ఉన్నారు. ఆరు బిలియన్‌ల జనాభాలో ఒక బిలియన్ మంది పదిహేను నుంచి ఇరవై నాలుగు సంవత్సరాల మధ్య వయస్సు కలిగినవారు ఉన్నారు. 2001లో భారతదేశ జనాభా బిలియన్ దాటి, ప్రపంచంలోనే అత్యధిక పిల్లలు గల దేశంగా గుర్తింపు పొందింది. 2001 మార్చ్ 1 నాటికి భారతదేశ జనాభా 1.027 బిలియన్‌లుగా నమోదైనట్లు జనాభా లెక్కల నివేదిక పేర్కొంటుంది. జనాభాలో 0-18 సంవత్సరాల మధ్య వయస్సు కలిగినవారు దాదాపు 400 మిలియన్‌ల మంది ఉంటారని అంచనా. 130 మిలియన్‌ల మంది 0-5 సంవత్సరాల వయస్సు గల పిల్లలు ఉండవచ్చని భావిస్తున్నారు. 1999-2000లో మన దేశంలోని ప్రాథమిక పాఠశాలల్లో బాల బాలికల నిష్పత్తి 85.18: 104.08గా నమోదైంది.

శిశు జనాభా బీహార్‌లో అత్యధికంగా 40.8 శాతం ఉండగా ఆ తర్వాతి స్థానాలలో ఉత్తరప్రదేశ్ (40.1 శాతం), రాజస్థాన్ (32.3 శాతం), మధ్యప్రదేశ్ (38.2 శాతం), అస్సాం (37.6 శాతం) హర్యానా (37.2) నిలిచాయి. బాలికల కంటే బాలుర శాతం కొంత ఎక్కువగా ఉండడం లింగ వివక్షతను సూచిస్తోంది. కేరళలో ఇది ప్రబలంగా కనిపిస్తోంది. అయితే అస్సాం, పశ్చిమ బెంగాల్ విషయంలో ఇందుకు మినహాయింపు ఉంది.

1951లో 18.33గా ఉన్న అక్షరాస్యత, 1981లో 43.57గా ఉండి, 2001 నాటికి 65.38 శాతానికి పెరిగింది. అయినప్పటికీ అరవై సంవత్సరాల స్వాతంత్ర్య భారతావనిలో ఇప్పటికీ వంద శాతం అక్షరాస్యతను సాధించలేకపోయాం. 2001లో 65.38 శాతం

**పట్టిక - 1**

**1998 లెక్కల ప్రకారం ప్రధాన రాష్ట్రాలలో పిల్లల (0-14 లోపు) శాతం**

| రాష్ట్రం | మొత్తం | బాలలు | బాలికలు |
|---|---|---|---|
| ఆంధ్రప్రదేశ్ | 33.1 | 33.6 | 32.7 |
| అస్సాం | 37.6 | 37.3 | 38.0 |
| బీహార్ | 40.8 | 41.3 | 40.2 |
| గుజరాత్ | 32.7 | 33.4 | 32.1 |
| హర్యానా | 36.2 | 36.7 | 35.6 |
| హిమాచల్ ప్రదేశ్ | 31.7 | 33.9 | 29.7 |
| కర్నాటక | 31.4 | 31.8 | 31.0 |
| కేరళ | 27.3 | 29.0 | 25.7 |
| మధ్యప్రదేశ్ | 38.2 | 38.6 | 27.8 |
| మహారాష్ట్ర | 33.3 | 33.8 | 32.8 |
| ఒరిస్సా | 34.2 | 34.7 | 33.7 |
| పంజాబ్ | 31.8 | 32.9 | 30.6 |
| రాజస్థాన్ | 38.3 | 38.8 | 37.7 |
| తమిళనాడు | 28.1 | 28.7 | 27.5 |
| ఉత్తరప్రదేశ్ | 40.1 | 40.6 | 39.7 |
| పశ్చిమబెంగాల్ | 32.8 | 32.7 | 33.0 |

అక్షరాస్యతను సాధించాం అని చెప్పుకుంటున్న మనం ఇంకా 35 శాతం నిరక్షరాస్యులుగా ఉన్న సంగతిని మర్చిపోకూడదు. గోపాల కృష్ణ గోఖలే వంద సంవత్సరాల కింద ప్రారంభించిన 'అందరికీ విద్య' అనే అంశాన్ని మనం ఇప్పటికీ చేరుకోలేకపోయాం. ప్రభుత్వం అందరికీ విద్యను అందించాలనే ఉద్దేశ్యంతో విద్యపై పెద్దమొత్తంలో ఖర్చు పెడుతోంది. పాఠశాల విద్య విషయంలో 2004-05లో 8 కోట్లు ఖర్చు పెట్టిన ప్రభుత్వం, 2007-08 నాటికి ఆ ఖర్చును 23 కోట్లకు పెంచింది. దాదాపుగా మూడు రెట్లు ఎక్కువగా ఖర్చు పెట్టడం జరిగింది. అయినప్పటికీ ఇంకా అనేకులు విద్యను అందుకోలేని స్థితిలోనే ఉంటున్నారు. మన దేశంలో పద్నాలుగు సంవత్సరాల లోపున్న బాలబాలికలలో ఆరు కోట్ల మంది ఇంకా బడికి దూరంగానే ఉన్నారు. అంటే ప్రపంచ వ్యాప్తంగా విద్యకు దూరమైన చిన్నారులలో సుమారు 35 శాతం మంది మన దేశంలోనే ఉన్నారు.

### మధ్యలో బడి మానేసిన పిల్లలు

పేదరికంతో, అమాయకత్వంతో ఎంతో మంది పిల్లలు బడికి దూరంగా ఉంటున్నారు. ప్రభుత్వ బడ్జెట్‌లో ప్రణాళికలలో విద్యపై ఎన్నో కోట్లు ఖర్చుపెడుతున్నప్పటికీ, అరవై సంవత్సరాల భారతావనిలో సంపూర్ణ అక్షరాస్యతను సాధించలేకపోయాం. దేశంలో దాదాపు 1.4 కోట్ల మంది చిన్నారులు బడికి దూరంగా ఉంటున్నారు. కొంతమంది పాఠశాలకు వెళ్లినప్పటికీ మధ్యలోనే మానివేయటం జరుగుతోంది. బాలలందరికీ ఉచిత నిర్బంధ ప్రాథమిక విద్య ఇప్పటికీ స్వప్నంగానే ఉంది. 6-14 సంవత్సరాల వయస్సు పిల్లల్లో నలభై శాతం మంది బడికి వెళ్లటం లేదు. 1-5 తరగతుల మొత్తం నమోదు 94.90 శాతం ఉన్నప్పటికీ (బాలురు 104.08 శాతం, బాలికలు 85.18 శాతం) మధ్యలో బడి మానివేసిన వారు ఎక్కువగానే ఉన్నారు. 1-10వ తరగతులలో 68.28 శాతం మంది మధ్యలో బడి మానివేయగా వారిలో బాలురు 66.58 శాతం, బాలికలు 70.60 శాతం ఉన్నారు. భారతదేశంలో 1960 నుండి 2001 వరకు ప్రాథమిక, మాధ్యమిక, సెంకడరీ విద్యలో ఎంతమంది బడి మానివేసినారో పట్టిక 2లో చూడవచ్చు.

పట్టికను పరిశీలించినట్లైతే వివిధ సంవత్సరాలలో దేశంలో బడి మానేస్తున్న బాలల శాతం తెలుస్తుంది. ఇందులో ప్రాథమిక, మాధ్యమిక, సెకండరీ విద్యకు సంబంధించిన వివరాలు ప్రస్తావించడం జరిగింది. ప్రాథమిక స్థాయిలో 1960-61లో 64.9 శాతం బడిమానివేస్తున్న వారి శాతం ఉంటే అది మాధ్యమిక స్థాయిలో 78.3 శాతం ఉంది. 1990-91లో ప్రాథమిక, మాధ్యమిక, సెంకడరీ స్థాయిలలో బడి మానేస్తున్న వారు వరుసగా 42.6, 60.9, 71.3 శాతంగా ఉంది. అదే 2000-01లో ఈ శాతం ప్రాథమిక స్థాయిలో 40.7 మాధ్యమిక స్థాయిలో 53.7గా సెకండరీ స్థాయిలో 68.58 శాతంగా ఉంది. బడి మానేస్తున్న వారి శాతం ప్రాథమిక స్థాయికంటే మాధ్యమిక స్థాయిలో ఎక్కువగానూ, మాధ్యమిక స్థాయికంటే సెకండరీ స్థాయిలో మరీ ఎక్కువగానూ మానేస్తున్నారు. అందుకే నేటికీ సంపూర్ణ అక్షరాస్యతను సాధించలేకపోతున్నాం.

### బాల కార్మికులు

ప్రమాదకరంగా పరిణమిస్తున్న బాల కార్మిక వ్యవస్థ గురించి కాగితాలపై అంకెలే వాస్తవాలు చెప్పకపోవచ్చు. కాని వీధివీధినా, అడుగడునా వీధిబాలలు దర్శనమిస్తున్నారు. తెల తెల్లవారుతుండగా ఈ నాటికీ మన దేశ జనాభాలో దాదాపు ముప్పై శాతం మంది దారిద్ర్యరేఖ దిగువన ఉన్నట్లు అనధికార అంచనాలు సూచిస్తున్నాయి. వీరందరికీ ప్రతిరోజు రెండు పూటల భోజనం లభించడమే చాలా కష్టం. ఉండటానికి ఇళ్లు, కట్టుకోవడానికి సరియైన బట్టలు లేవు. కడుపేదరికంలో విద్యనే కాదు, బాల్యాన్ని కోల్పోతున్నారు. బాల్య దశలోనే మనో వికాసం జరుగుతుంది. ఒక దేశ భవిష్యత్తు అయినా, ఒక జాతి భవిష్యత్తు అయినా భావితరంగా పిలిచే నేటి బాలలపైనే ఆధారపడి ఉంది.

పద్నాలుగు సంవత్సరాలలోపు వయస్సు కలిగి ఉండి పనిచేసే వారిని బాల కార్మికులుగా గుర్తించడం జరిగింది. అంతర్జాతీయ కార్మిక సంస్థ నివేదిక బాల కార్మికులని ఈ విధంగా నిర్వచించింది – 'ఆరోగ్యానికి, శారీరక, మానసిక ఎదుగుదలకు దూరంగా ప్రమాదకరమైన పరిస్థితులలో స్వల్పవేతనానికి ఎక్కువ గంటలు పనిచేస్తూ బాల్యంలోనే బాధ్యతలు నెత్తికి ఎత్తుకుని, కొన్ని సమయాలలో తమ కుటుంబాలకు దూరంగా తమ భవిష్యత్తుకు బాటలు వేసే

పట్టిక - 1
మధ్యలో బడిమానేసిన పిల్లలు

| | 1960-61 | 1970-71 | 1980-81 | 1990-91 | 1999-00 | 2000-01 |
|---|---|---|---|---|---|---|
| 1 నుండి 5వ తరగతులు | | | | | | |
| బాలురు | 61.7 | 64.5 | 56.2 | 40.1 | 38.7 | 39.7 |
| బాలికలు | 70.9 | 70.9 | 62.5 | 46.0 | 42.3 | 41.9 |
| మొత్తం | 64.9 | 67.0 | 58.7 | 42.6 | 40.3 | 40.7 |
| 1 నుండి 8వ తరగతులు | | | | | | |
| బాలురు | 75.0 | 74.6 | 68.0 | 59.1 | 52.0 | 50.3 |
| బాలికలు | 85.0 | 83.4 | 79.4 | 65.1 | 58.0 | 57.7 |
| మొత్తం | 78.3 | 77.9 | 60.9 | 61.1 | 54.5 | 53.7 |
| 1 నుండి 10వ తరగతులు | | | | | | |
| బాలురు | - | - | 79.89 | 67.5 | 66.6 | 66.4 |
| బాలికలు | - | - | 86.6 | 76.9 | 70.6 | 71.5 |
| మొత్తం | - | - | 82.5 | 71.3 | 68.3 | 68.6 |

మూలం : సెలెక్టెడ్ ఎడ్యుకేషనల్ స్టాటిస్టిక్స్ 2000-01, హెచ్.ఆర్.డి. డిపార్ట్‌మెంట్, భారత ప్రభుత్వం

అర్థవంతమైన విద్యా, శిక్షణావకాశాలను తరచు కోల్పోయే వారు బాల కార్మికులు'. బాల కార్మిక సమస్య దాదాపు అన్ని దేశాలలో ఉంది. భారతదేశంలో మరీ తీవ్రంగా ఉంది. సామాజిక, ఆర్థిక ఒత్తిడుల వల్ల వర్ధమాన దేశాలలో అనేక మంది పిల్లలు కఠినమైన ప్రమాదకరమైన పనులు చేయవలసి వస్తోంది. భారతదేశంలో కూడా పిల్లలను వ్యవసాయ రంగంలో వివిధ రకాల వృత్తుల్లోను, కుటీర, లఘు పరిశ్రమలలోను వినియోగిస్తున్నారు. బాల కార్మిక వ్యవస్థపై అనేక వార్త సంస్థలు సర్వే నిర్వహించటం జరిగింది. ఈ సర్వేలలో అనేక ఆసక్తికరమైన అంశాలు వెలుగులోకి వచ్చాయి. ప్రపంచ దేశాలలో బాల కార్మికులు ఉన్నారు, కాని కొన్ని దేశాలలో మాత్రం ఈ బాల కార్మికులు పడరాని కష్టాలు పడుతున్నారు. ఈ దేశాల పేర్లు వరుస క్రమంలో సుడాన్, ఉగాండా, కాంగో మొదటి మూడు స్థానాలు ఆక్రమించాయి. ఈ మూడు దేశాలలో యుద్ధాల వల్ల లక్ష మంది పిల్లలు అనాథలుగా రూపాంతరం చెందారు. యుద్ధాలు, అలజడులు లేకున్నా మన దేశంలో బాలకార్మికుల సంఖ్య ఎక్కువగానే ఉంది. బాల కార్మికులు ఎక్కువగా ఉన్న దేశాలను వరుసగా చూస్తే మన దేశానిది 6వ స్థానం. 1991 జనాభా లెక్కల ప్రకారం మన దేశంలో 1.12 కోట్ల మంది బాల కార్మికులు ఉన్నారు. ప్రపంచంలోని బాలకార్మికులలో ఇరవై ఐదు శాతం మంది బాలకార్మికులు ఒక్క మనదేశంలోనే ఉన్నారు.

అయితే 2001లో నిర్వహించిన జనాభా లెక్కల ప్రకారం ఐదు నుంచి పద్నాలుగు సంవత్సరాల లోపు వయస్సు కలిగి ఉండి బాల కార్మికులుగా పనిచేస్తున్న వారి సంఖ్య 12.6 మిలియన్లు. బెల్జియం దేశంలోని దేశ జనాభాకంటే మన దేశంలోని బాల కార్మికుల సంఖ్య అధికం. మన దేశంలో బాల కార్మికులు అన్ని రాష్ట్రాలలో ఉన్నారు. అయితే ఉత్తరప్రదేశ్, ఆంధ్రప్రదేశ్, రాజస్థాన్, మధ్యప్రదేశ్, బీహార్ రాష్ట్రాలలో ఎక్కువ మంది బాలకార్మికులు ఉన్నారు. దాదాపు 6.7 మిలియన్ల బాలకార్మికులు ఈ రాష్ట్రాలలోనే ఉన్నారు.

బాల కార్మికుల సంఖ్య గ్రామీణ ప్రాంతాలలో అధికంగా ఉంది. నగరాలు పట్టణాలతో పోలిస్తే 85 శాతం మంది బాలకార్మికులు గ్రామీణ ప్రాంతాలలో పనిచేస్తున్నారు. ఈ బాల కార్మికులలో దాదాపు 80 శాతం మంది వ్యవసాయ రంగంలో పనిచేస్తున్నారు. కొన్ని నగరాలలో పట్టణాలలో బాల కార్మికుల సంఖ్య ఎక్కువగా ఉంది. రత్నాలను పాలిష్ చేసేందుకు జైపూర్‌లో, పలకలను తయారు చేయటానికి మార్కాపూర్ లోనూ, వారణాసిలోని సిల్క్ నేత పరిశ్రమలలోనూ బాల కార్మికులను ఉపయోగిస్తున్నారు. తమిళనాడులోని శివకాశిలో యాభై వేలకు పైగా బాలకార్మికులు బాణాసంచా తయారు చేసే కర్మాగారాలో ప్రమాదకర పరిస్థితులలో పనిచేస్తున్నారు. మన దేశంలో చాలా చోట్ల చట్ట వ్యతిరేకంగా బాల కార్మికులకు తక్కువ వేతనాలు చెల్లించి ప్రతిరోజు పన్నెండు నుంచి పద్నాలుగు గంటలు పనిచేయించడం జరుగుతోంది. కొన్ని సంస్థలలో బాల కార్మికులకు పెద్ద వారికి ఇచ్చే కూలీలో పదోవంతు కూలీ ఇచ్చి ఎక్కువ సమయం పనిచేయిస్తున్నట్లుగా తెలుస్తోంది. పట్టణ కేంద్రాలలో సాధారణంగా మురికివాడలు, బడుగు వర్గాలు నివసించే ప్రాంతాలలో స్వల్పాదాయ కుటుంబాలకు చెందిన వారి పిల్లలు బాల కార్మికులుగా మారటానికి వారి కుటుంబ నేపథ్యం పేదరికాలే ప్రధాన కారణం. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో దాదాపు 16.6 లక్షల మంది బాల కార్మికులు ఉన్నారు. మన రాష్ట్రంలో 1991లో కోటి 67 లక్షల మంది పిల్లలు ఉన్నారు. దేశంలోని మొత్తం బాలకార్మికులలో పద్నాలుగు శాతం మంది ఆంధ్రప్రదేశ్‌లోనే ఉన్నారు. 1991లో ఆంధ్రప్రదేశ్‌లో 21.8 లక్షల మంది బాల కార్మికులు ఉన్నట్లు యూనిసెఫ్ అంచనా వేసింది.

మనదేశంలో ఇళ్లలో పనిచేసే బాలకార్మికుల సంఖ్య పదమూడు లక్షలకు పైగా ఉంటుంది. హైదరాబాద్‌లోనే ఇళ్లలో పనిచేసే బాల కార్మికుల సంఖ్య సుమారు ఒక లక్ష వరకు ఉండవచ్చునని ఒక అంచనా. బాలకార్మికులను ఇళ్లలో పనిచేయటానికి పెట్టుకున్నవారిలో విద్యాధికులైన ఉన్నతాధికారులు, రాజకీయనాయకులు, పారిశ్రామికవేత్తలు ఉన్నారు. పిన్న వయసులో వీరు రకరకాల జబ్బుల బారిన పడుతుంటారు. వీరి సగటు ఆయువు ప్రమాణం కూడా తక్కువే. ఈ బాల కార్మికులలో బడి మధ్యలో మానివేసి ఉన్న వారు కొందరైతే ఎక్కువ శాతం మంది ఉపాధికోసం వచ్చినవారు. ఇళ్లలో పనిచేసే బాల కార్మికుల సంఖ్య కూడా చాలా ఎక్కువగానే ఉంది. వాళ్లు నాలుగు గోడల మధ్య పని చేస్తున్నందుకు వారి జీవితం బయట ప్రపంచానికి చాలా తక్కువగా కనిపిస్తుంది. ఇళ్లలో ప్రధానంగా పాత్రలు తోమించడం, ఇళ్లు కడిగించడం, బట్టలు ఉతికించడం లాంటి పనులు బాల కార్మికులతో చేయిస్తుంటారు. కొందరైతే వంటా, వాళ్ల పిల్లల ఆలనాపాలనా, పచారీ షాపులలోనుంచి సరుకులు తేవడం, నీళ్లు తేవడం వంటి అదనపు బాధ్యతలు కూడా చేయవలసి ఉంటుంది. బాల కార్మికులు ఆరు గంటలకు మించి పనిచేసినందుకు గాను ఎలాంటి అదనపు జీతం చెల్లించడం లేదు. దుకాణాలలో బాల కార్మికులు నెలకు 250 మొదలు 650 రూపాయల వరకు సంపాదిస్తూ ఉండగా, హోటల్లలో పనిచేసే వారు కేవలం 100 నుండి 500 రూపాయలు మాత్రమే సంపాదిస్తున్నారు. ఇళ్లలో పనిచేసే బాల కార్మికులు, హోటల్ కార్మికులు ఆహారపదార్థాలు కూడా పొందుతుంటారు. సంవత్సరంలో ఏదో ఒక పండుగకు ఒకటి లేదా రెండు జతల బట్టలు యజమానులు ఇస్తుంటారు. ఈ రకంగా పసి వయసులోనే బాలలు బడి మానేసి వీధి బాలలుగా, బాల కార్మికులుగా జీవితాన్ని గడుపుతున్నారు.

సుప్రీంకోర్టు 1986 బాల కార్మిక వ్యవస్థ నిషేధ చట్టాన్ని చేసింది. కాని ఇంత వరకూ సరిగా అమలు కాని ఆ చట్టంపై కేంద్ర ప్రభుత్వం దృష్టి సారించింది. ఫలితంగా 2006 అక్టోబర్ 10 నుండి అమలులోకి వచ్చింది. కొంతవరకు సమాజంలో బాల కార్మికులను తగ్గించే ప్రయత్నం జరిగింది. కొంతవరకు ఫలితాలను సాధించింది. జాతీయ సార్వత్రిక విద్యను, సర్వ శిక్షా అభియాన్ తదితర రాష్ట్ర పథకాలు ప్రవేశపెట్టి సామాజిక భాగస్వామ్యంతో నాణ్యమైన, ఉచిత విద్య అందించడం సర్వశిక్షాభియాన్ చారిత్రక నిర్ణయం. 2010 నాటికి పిల్లలందరికీ నాణ్యమైన, ఉచిత విద్య అందించాలన్నది సర్వ శిక్షా అభియాన్ ముఖ్య ఉద్దేశ్యం. మానవతా విలువలతో ముడిపడి ఉన్న చట్టాల విషయంలో సమాజ సహకారం లేనిదే లక్ష్యాలను సాధించడం సాధ్యమయ్యే విషయం కాదు. భావితరాన్ని అందించటానికి ప్రభుత్వాలు, సమాజం పిల్లల పట్ల ప్రత్యేక దృష్టిని సారించాల్సిన అవసరం ఎంతో ఉంది. ◆

**మీడియాలో చొరబడిన విలువల రాహిత్యాన్ని, అనారోగ్య పోటీనీ, ప్రతి సమస్యను సంచలనంగా చూపుతున్న దిగజారుడుని వివరిస్తున్నారు దుర్గం రవీందర్**

# విచక్షణ కోల్పోతున్న ఎలక్ట్రానిక్ మీడియా

ఒక వ్యక్తికి సరిగ్గా నుదుటి మీద బుల్లెట్ గాయం అవుతుంది. ఆ గాయంలోంచి రక్తం ధారగా కారి చివరిగా బుడగలు బుడగలుగా బయటకు వస్తుంది. ఎవరి తుపాకి, ఆ ట్రిగ్గర్ నొక్కిన వేలు ఎవరిది, ఆ భుజం ఎవరిది? అలా కాల్చడం న్యాయమా, అన్యాయమా? ఆ ఉద్యమం ఏమిటి? దాని వెనుక ఉద్దేశ్యాలు ఏమున్నాయి? ఏ కులం వారి లాభం కోసం ఆ బుల్లెట్ పేలింది? ఇవన్నీ వేరే ప్రశ్నలు, అది వేరే చర్చ.

ఆ బుల్లెట్ గాయాన్ని క్లోజప్‌లో డిజిటల్ కెమెరాతో చిత్రీకరించి ఒక న్యూస్ ఛానల్ వారు ప్రసారం చేస్తారు. ఒక్కసారి కాదు పదే పదే ప్రసారం చేస్తారు. ఆ దృశ్యం చూస్తుంటే హృదయం పిడచకడుతుంది. అన్నం సహించదు. అలా వరుసగా ఆరుగురికి బుల్లెట్ గాయాలు అవుతాయి. వారందరి అంతిమ క్షణాల్ని, చివరి మూలుగులను జీవం నుండి నిర్జీవం వైపు, నిష్క్రమణం అవుతున్న కన్నులను, ముఖ కవళికల్ని హృదయ విదారకంగా చిత్రీకరించి వెంటవెంటనే ప్రసారం చేస్తారు. సజీవ దేహం నిర్జీవ శవంగా మారుతున్న వైనాన్ని చిత్రీకరిస్తున్న క్రమంలో ఒక చేయి వచ్చి ఆ దేహం చొక్కాకున్న తిరగబడిన పార్టీ బ్యాడ్జిని సరిచేస్తుంది. కెమెరా లెన్స్‌లకి రాజకీయాలుండవు కాబట్టి ఆ దేహంతోపాటు బ్యాడ్జిని చిత్రీకరించి, టెలికాస్ట్ చేస్తాయి. ఆ దృశ్యాలు ప్రసారం చేసినందుకు ఆ టివి ఛానల్ పేరు నలుగురి నోట నానుతుంది. అమ్మో, అయ్యో ఎంత అన్యాయం జరిగిపోయింది. ఈ ప్రభుత్వం పాడుగాను... రాజ్య హింస నశించిపోను, అని వీర వామపక్షవాదులు రాష్ట్రంలో, దేశంలో గుండెలు బాదుకుంటారు. హైదరాబాద్‌లో, ఢిల్లీలో ధర్నాలు, రిప్రజెంటేషన్లు, నిరసన సభలు, ఊరేగింపులు జరుగుతాయి. మరణించిన వారి మీద వారు ఏ పార్టీ తరఫున ధర్నాకు వచ్చారో వారి జెండా కప్పుతారు. ఆ మృతదేహాలకు ఘనంగా నివాళులు అర్పిస్తారు. మృతుల కుటుంబాలకు ప్రభుత్వం కొన్ని లక్షల ఎక్స్‌గ్రేషియా చెల్లిస్తుంది.

హమ్మయ్య కొంత న్యాయం జరిగింది అని పలువురు తృప్తి చెందుతారు.

* గాయపడి రక్తమోడుతున్న ఆ దురదృష్టవంతులను అంబులెన్స్‌లోకి ఎక్కించి ఆసుపత్రికి తరలిస్తే ఆ ఆరుగురిలో ఒక్కరైనా బతికే అవకాశం ఉంటుంది. కాని ఆ న్యూస్ ఛానల్ కెమెరామెన్ ఆ విషయాన్ని పట్టించుకోకుండా ఆ రక్తవర్ణ దృశ్యాల చిత్రీకరణలో మునిగిపోతాడు. ఆ కెమెరామాన్ ఉద్యోగ ధర్మాన్ని నిర్వహించాడు, కాని సాటి మనిషి చావు బతుకుల్లో ఉన్నప్పుడు ఆదుకోలేకపోయాడు. ఇది అన్యాయం అంటూ మానవతా వాదులు విమర్శిస్తారు. చాలా చక్కటి వార్తా దృశ్యాల్ని చిత్రీకరించావని యాజమాన్యం లేదా ఇన్‌పుట్, అవుట్‌పుట్ ఎడిటర్లు ఆ కెమెరామెన్‌ను అభినందల్లో ముంచెత్తవచ్చు, ఇంక్రిమెంట్ ఇవ్వవచ్చు.

* మెగాస్టార్ కూతురు ఇంట్లో వారికి ఇష్టం లేని పెళ్లి చేసుకొంటుంది. రాజకీయాలో మరొకటిగానో ఆ పెళ్లి సి.డి.ని ఒక ఛానల్ వారికి ఎవరో అందిస్తారు. దాన్ని వాళ్లు తనివి తీర ఆరేడు సార్లు ప్రసారం చేసి తృప్తి పడతారు.

* రాజీవ్ రహదారిపై రెండు వాహనాలు ఢీకొన్న దృశ్యం. రోడ్డుపై బీభత్సం. రక్తం మడుగులు, ఖండిత దేహభాగాలు, ఒక స్త్రీ దేహం అనచ్ఛాదిత తొడలు, ఛాతి. ఆ దృశ్యం పదే పదే ప్రసారం అవుతుంది.

* బెంగుళూరు రహదారిపై లారీ బోల్తా. ఇరవై మంది కూలీల దుర్మరణం. బురద మడుగులో కూరుకుపోయిన మృతదేహాలు. ప్రోక్లెయినర్‌తో తీస్తున్న హృదయవిదారక మృతదేహాల దృశ్యం.

* కిడ్నాప్ అయిన బాలుని తల్లి. ఆమె నోటికి ఆనించి పెట్టిన మైకు. ఉబికి వస్తున్న కన్నీళ్లు. ఏడుపు ఆపుకున్నందుకు బొంగురు పోయిన గొంతు, చివరికి ఆ తల్లి నిబాయించుకోలేక గొల్లుమని ఏడవడం... పక్కనే ఏడుస్తున్న తండ్రి. సినిమా వారి భాషలో అది ఒక పండిన దృశ్యం.

* ఒక మృగం నాలుగేళ్ల పసిపాపను చెరచి, చంపి స్మశానంలో పారేసిన దృశ్యం. క్లోజ్ అప్ షాట్, జూమ్ ఇన్, జూన్ అవుట్ షాట్‌లు.

* ప్రమాదంలో చనిపోయిన ఒక ఇంజనీర్. అతనికి ఇద్దరు భార్యలు. వారు రోదించే దృశ్యం. ఆ తర్వాత అయనకి వచ్చే డబ్బుల కోసం వారి సిగపట్ల దృశ్యం. బంధుమిత్రుల కామెంట్లు.

* ఇంటర్నెట్ సెంటర్‌లో నీలిచిత్రాలు చూసే వైనాన్ని చూపుతూ పనిలో పనిగా ఆ నీలి చిత్రం షాట్‌ను కూడా చిత్రీకరించి ప్రేక్షకులను రంజింప చేయాలని ప్రయత్నించడం.

* ఇంటర్నెట్ సెంటర్‌లలో, ఆ చిన్న చిన్న క్యాబిన్‌లలో ఒక అబ్బాయి అమ్మాయి దూరి కక్కుర్తి పనులు చేయడం... ఇలాంటి పాడు పనులు చేస్తున్నారు అనే వార్తను ప్రసారం చేస్తూ ఆ క్యాబిన్‌లో ఆ అమ్మాయి, అబ్బాయిల అసభ్యకరమైన ప్రవర్తన దృశ్యాలను చూపడం.

ఒక చిత్రం వెయ్యి పదాలకు సమానం అన్నది చైనా సామెత. మరి అన్ని దృశ్యాలను పదే పదే ప్రసారం చేసి బోలెడంత దుఃఖాన్ని దైన్యాన్ని, హృదయవిదారక దృశ్యాలను, అనైతిక అశ్లీల దృశ్యాలను లైన్‌గా మన డ్రాయింగ్ రూంలోకి మోసుకురావడం సబబేనా అన్నది ప్రశ్న.

దీనికి సమాధానం ఎవరు చెబుతారు? టెలివిజన్ కనిపెట్టిన అతన్ని అడుగుదామా? లేదా మన సమాచార, ప్రసార శాఖ మంత్రిని అడుగుదామా? లేదా ప్రధాన మంత్రి, ముఖ్యమంత్రులను నిలదీద్దామా? ఛానల్ యజమానులను నిలదీద్దామా?

వార్తల పేరుతో అనైతిక దృశ్యాలను, చూడగూడని దృశ్యాలను మన ఇండ్లలోకి ప్రసారం చేస్తున్న వైనం గురించే ఈ చర్చ. మొత్తంగా 'టెలివిజన్ ప్రభావం ఇంటిల్లిపాదిపై ఎలా ఉంటుంది, పిల్లలపై ఎంతగా ఉంటుంది, ముసలివారి మీద ఎంత ఉంటుంది. దీనికి సంబంధించి అనేకానేక శాస్త్రీయ పరిశోధనలు అభివృద్ధి చెందిన దేశాల్లో జరిగాయి. అందరూ ఏక కంఠంతో అది దుష్ప్రభావం కలిగిస్తున్నదని కుండబద్దలు కొట్టి మరీ చెప్పారు. కార్యక్రమాల మధ్య ప్రసారం చేసే ప్రకటనలు పిల్లలపై, గృహిణులపై చూపే ప్రభావం మరీ ఎక్కువగా ఉంటోంది. మొత్తంమీద చెడునే ఎక్కువగా మోసుకువచ్చే వైనాన్ని పలువురు సవివరంగా శాస్త్రీయంగా చెప్పారు. అయినా సరే మన ఇళ్లలో ఫ్లాట్ స్క్రీన్ టీవీలు, పెద్ద ప్లాస్మా టీవీలు వస్తూనే ఉన్నాయి. అవి మరిన్ని చెడు తలంపులను కలిగించే దృశ్యాలను మోసుకు వస్తూనే ఉన్నాయి. కుటుంబాలు కూలి పోతూనే ఉన్నాయి. భార్యభర్తలు విడాకులు తీసుకుంటూనే ఉన్నారు. టీనేజ్ పిల్లలు ఇబ్బంది పడుతూ, తల్లిదండ్రులను ఇబ్బంది పెడుతునే ఉన్నారు. ఎవరం ఏమీ చేయలేని నిస్సహాయ స్థితిలో తమాషాను చూస్తూనే ఉన్నాం.

దీన్ని నియంత్రించే యంత్రాంగం కానీ, వాటిని ప్రసారం చేయకూడదని సూచించే విభాగం గాని ప్రభుత్వం దగ్గర లేదు. మరి ఈ స్థితి ఎన్నినాళ్లు కొనసాగాలి.

పైగొడవ అలా ఉండగా 'స్టింగ్ ఆపరేషన్ల' వ్యవహారం ఈ మధ్య వికృత రూపాన్ని సంతరించుకుంది. కొన్ని ఛానల్స్‌లో పని చేస్తున్న కొందరు విలేకరులు దాదాపుగా బ్లాక్‌మెయిలర్స్‌గా మారినట్లు ఆరోపణలు వస్తున్నాయి. ఇబ్బడిముబ్బడిగా ఛానల్స్‌వచ్చి అనుభవం, శిక్షణ లేని వారిని విలేకరులుగా నియమించడం ద్వారా, వారి కొత్త ఉత్సాహంతో కొంత శృతిమించి ప్రవర్తించడం ద్వారా ఈ చెడ్డపేరు వస్తున్నది. కొన్ని ఛానల్స్ పేరు చెప్పగానే కొందరు అవినీతి అధికారులు, రాజకీయ నాయకులు గజ్జన వణుకుతుంటారు. ప్రపంచాన్ని భయపెట్టే పోలీసులను కూడా వీరు భయపెట్టగలుగుతున్నారు. వారిని అంతగా భయపెట్టే సందర్భాలు నిజంగా ఉంటున్నాయి. ఆ భయాన్ని కొందరు కొద్ది మంది సొమ్ము చేసుకుంటున్నారు. దీంతో అందరికీ చెడ్డ పేరు వస్తున్నది.

ఇటీవల ఢిల్లీలో జరిగిన ఒక కల్పిత స్టింగ్ ఆపరేషన్ ఎంత అభాసు పాలయిందో మనందరికీ తెలుసు.

**బూటకపు స్టింగ్ ఆపరేషన్** - ఢిల్లీలోని సర్వోదయ కన్యా విద్యాలయంలో గణిత శాస్త్ర బోధకురాలిగా పని చేస్తున్న ఉమా ఖురానాను వ్యభిచార సిండికేట్ నడుపుతున్నట్టుగా చిత్రీకరించాలన్న ఉద్దేశ్యంతో 'లైవ్ ఇండియా' కు చెందిన ప్రకాశ్ సింగ్ అనే రిపోర్టర్, స్టింగ్ ఆపరేషన్ నిర్వహించాడు. ఉమా ఖురానా తనను వ్యభిచార కూపంలోకి దింపిందని విద్యార్థిగా నటించి 'స్టింగ్ ఆపరేషన్‌లో వాపోయిన యువతిని అరెస్ట్ చేయడంతో అసలు గుట్టు బయటపడింది. ఆ యువతిపై చీటింగ్, సాక్ష్యాధారాలను తారుమారు చేయడం, నేరపూరిత కుట్ర కేసులను నమోదు చేసిన పోలీసులు, చివరికి ప్రకాశ్ సింగ్‌ను కూడా అదుపులోకి తీసుకున్నారు. ప్రస్తుత, పాత విద్యార్థినులతో ఉమా ఖురానా వ్యభిచార రాకెట్ నడుపుతోందన్న 'స్టింగ్' ఉదంతం టివిలో ప్రసారమైన వెంటనే తుర్క్‌మన్ గేట్ వద్ద ఆగస్ట్ 30న తీవ్ర స్థాయిలో హింసాకాండ చెలరేగింది. ఉమా ఖురానాను సర్వోదయ కన్యా విద్యాలయం నుంచి డిస్మిస్ చేశారు కూడా. ఈ కేసులో అరెస్టయిన వారిలో ప్రకాశ్ సింగ్ నాలుగో నిందితుడు. ఉమా ఖురానా, ఆమె సన్నిహితుడిగా భావిస్తున్న వీరేంద్ర అరోరాలను కూడా అదుపులోకి తీసుకున్నారు. టివి ఛానల్ నిర్వహించిన స్టింగ్ ఆపరేషన్ బూటకమని తేలడంతో ఢిల్లీ ప్రభుత్వానికీ, నగర పోలీసులకూ హైకోర్టు నోటీసులు పంపి, సమాధానం చెప్పాలని ఆదేశించింది. స్టింగ్ ఆపరేషన్ ఓ వ్యక్తిని తప్పుడు ఆరోపణల్లో ఇరికించేందుకు జరిగిన ప్రయత్నమంటూ వచ్చిన వార్తలను ప్రాతిపదికగా తీసుకున్న హైకోర్టు తనంతట తానుగానే ఈ అంశాన్ని చేపట్టి నోటీసులు జారీ చేసింది.(సెప్టెంబర్ తొలివారంలో జరిగిన సంఘటన).

మొదట సర్వోదయ కన్యా గురుకులంలో బాలికలతో ఒక ఉపాధ్యాయురాలు వ్యభిచార రాకెట్ నడుపుతుందనే విషయం పెద్ద ఎత్తున ఆ ఛానల్‌లో ప్రసారం అయ్యింది. దానిపై పత్రికల్లో వార్తలు కూడా వచ్చాయి. అల్లర్లు జరిగాయి. విధ్వంసం జరిగింది. పోలీసులు ఆ టీచరమ్మను అరెస్ట్ చేశారు. అంతా చేశాక అదంతా టివి ఛానల్ సృష్టించిన కృత్రిమ వార్త అని తేలింది.

మొదట వార్త ప్రసారం జరిగినప్పుడు చూసినవారు, పత్రికల్లో వార్త చదివిన వారందరూ ఫాలోఅప్ న్యూస్ చూసే అవకాశమే ఉండదు. అటువంటప్పుడు ఆ వార్తా దృశ్యాలు బూటకమని వారు గమనించే అవకాశం లేదు. అలాంటప్పుడు ఆ బడిలో చదివే బాలికల పట్ల ఆ వార్త విన్న వారికి కలిగే అభిప్రాయం ఎలా ఉంటుంది. ఆ పిల్లలకు పెళ్లిళ్లు అవడం కష్టం కాదా? అలా ఆ బడిపిల్లల పట్ల కలిగే నీచ అభిప్రాయం వల్ల వారికి జరిగిన నష్టాన్ని, పరువును ఎవరూ తిరిగి ఇవ్వగలరు. ఆ దురభిప్రాయం ఆ బడి పిల్లల్ని జీవితాంతం వెంటాడుతుంది కదా?

ఏ బ్లాక్ మెయిల్ బేరం చెడితే ఆ విలేకరి ఆ వార్తను ప్రసారం చేశాడని మనం అనుకోవాలి. దీన్ని ఎవరు ఎలా అదుపు చేయాలి?

తెహెల్కా డాట్‌కామ్ గత కాలపు పెద్ద స్టింగ్ ఆపరేషన్. పాపం పెద్దలెందరో అందులో దొంగలుగా బయటపడ్డారు. కొందరు హీన చరిత్రులయ్యారు. ఆ స్టింగ్ ఆపరేషన్ ఆయుధాల కొనుగోలుకు సంబంధించింది. అందులో బంగారులక్ష్మణ్, జార్జి ఫర్నాండెజ్ లాంటి మహామహులు ఇరుక్కున్నారు. భారతదేశానికి రక్షణ శాఖవారు ఒక అగ్రదేశం నుండి ఆయుధాలు కొననందుకు వారు చేయించిన గొడవఅది.

భారతదేశంలో నాయకులకు, జనాలకు, పలువురికి డబ్బుమీద భక్తి ఎక్కువ. దేశంపై తక్కువగా ఉంటుంది. వారు అతిచౌక ధరకు, సులభంగా అమ్ముడుపోతారు. అలాంటి నాయకుల రంగును బయటపెట్టిన స్టింగ్ ఆపరేషన్ అది. ప్రపంచ దేశ ప్రజల దృష్టిలో భారతదేశ నాయకులు డబ్బుకోసం ఎంత దుర్మార్గానికి ఒడి కట్టగలరో వివరించే వైనం అది.

అలాగే ఆపరేషన్ దుర్యోధన. అత్యుత్తమ రాజకీయ వాదుల అవినీతిని బయటపెట్టిన స్టింగ్ ఆపరేషన్. పార్లమెంట్ సభ్యులు పార్లమెంటులో ప్రశ్న అడిగినందుకు భారీ ముడుపులు, అడగనందుకు

ప్రజలకు మంచినీరు అందించడం ఎప్పుడూ సామాజిక బాధ్యతగానే ఉందనీ, ప్రాథమిక ఆరోగ్య పరిరక్షణలో భాగంగా మంచినీటి సరఫరాకు ప్రభుత్వమే బాధ్యత వహించాలంటున్నారు **డా. కె.రఘురాం రెడ్డి, టి. రాజేష్**

# తాగునీటి ప్రైవేటీకరణ

మనుషులకూ, జీవకోటికీ గాలి తరువాత నీరు అత్యంత ముఖ్యమైనది. పాల ధరలతోపాటు మంచినీటి ధర సమానంగా ఉండటం ఆశ్చర్యకరం. మంచినీటికీ ప్రజల ఆరోగ్యానికీ సంబంధం ఉంది. మనిషి శరీరంలో 70 శాతం నీరు ఉంది. తిండి లేకపోయినా కొన్ని రోజులు జీవించవచ్చు. కానీ నీరులేకపోతే కొన్ని గంటలలోనే మనిషి ప్రాణం పోతుంది. గాలి తరువాత నీటికి అత్యంత ప్రాధాన్యం ఉంది. నీరు సహజ వనరు.

## ప్రపంచ స్థాయిలో చర్చ

నీటి కొరత సమస్యపై 1970 నుండి ప్రపంచ స్థాయిలో చర్చలు ప్రారంభమైనాయి. ప్రపంచ బ్యాంక్ 1992లో డబ్లిన్‌లో ఒక సమావేశం నిర్వహించింది. దానిలో అంశాలు : ఎ) జీవజాతి, మనిషి అభివృద్ధికి పరిశుభ్రమైన నీరు అవసరం; బి) నీటి అభివృద్ధి, నిర్వహణ అనేది వాడకం దారులు, ప్రణాళికావేత్తలు, విధాన నిర్ణేతలు వివిధ స్థాయిలలో కలిసి అందరి భాగస్వామ్యంతో సమన్వయంగా జరగాలి; సి) మంచినీటి నిర్వహణలో మహిళల పాత్ర కీలకమైనది. పంపిణీ, నిర్వహణ, రక్షణకు స్థానికులను భాగస్వాములను చేయడం కీలకమైంది; డి) నీటికి ఆర్థిక విలువ ఇవ్వాలి.

ఈ సూత్రాల ఆధారంగా సమగ్ర రిపోర్టు తయారు చేయాలని నిర్ణయించారు. పాలకులు జీవన్మరణ సమస్యకు దారితీసే నీటి సమస్యపై సరిగా వ్యవహరించడం లేదనే దృష్టితో మూడింటికీ ప్రాధాన్యత ఇవ్వాలని నిర్ణయించారు. ఈ సూత్రాలపై ఆధారపడి 1996 మార్చ్‌లో వరల్డ్ వాటర్ ఫామ్ విస్తృత స్థాయిలో మురాకేష్‌లో జరిగింది. దీనిలో వరల్డ్ వాటర్ విజన్‌ని అభివృద్ధి చేసింది. ముందుగా ఒక కౌన్సిల్ ఏర్పాటు చేశారు. దీనికి చైర్మన్‌గా ఇస్మాయల్ సిరగలైన్ వ్యవహరించారు. వరల్డ్ వాటర్ విజన్ నివేదిక తయారు చేసింది ఈ కౌన్సిలే. ఈ నివేదికను తయారు చేయటంలో అధికార, అనధికార వర్గాలను, సంస్థలను భాగస్వామ్యం చేశారు. చివరికి 2000 మార్చ్ 17 నుండి 22 వరకు హేగ్ నగరంలో జరిగిన ప్రపంచ స్థాయి సమావేశంలో నీటిని సరుకుగా మార్చాలనే ప్రతిపాదన పాలసీని ఆమోదించడం జరిగింది.

ఈ సమావేశానికి మనదేశం నుండి ప్రభుత్వ, స్వచ్ఛంద సంఘాల ప్రతినిధులు హాజరైనారు. నీటి కొరత, పరిశుభ్రత అనే అంశాలు ప్రజలను భయానికి లోను చేసేవిగా ఉన్నాయి., నీటికి ఆర్థిక విలువ ఇవ్వాలి, సరుకుగా మార్చాలి అనే సూత్రీకరణ తరువాత నీరు వ్యాపార వస్తువుగా మార్చటానికి వీలుగా పథక రచన చేయడానికి పాలసీలు చేయడానికి హేగ్ సమావేశంలో చర్చలు సాగాయి.

## తాగునీటి కొరత ఉన్నదా ?

మన అవసరాల్ని ప్రకృతిలో లభించే నీరుతో బేరీజు వేసుకుంటే ఇంకా వెయ్యి సంవత్సరాలు అయినా మంచి నీటికి, సాగునీటికి కొరత లేదని నిర్ద్వందంగా చెప్పవచ్చు. భూగోళంపై ఉన్న నీటిలో 97.3 శాతం ఉప్పునీరు. తాగటానికి పనికిరాదు. మిగిలిన 2.7 శాతంలో 2.08

---

ముదుపులు. ఇలాంటి స్టింగ్ ఆపరేషన్లు కొంత ప్రయోజనాన్ని కలిగించాయి. చేను మొత్తానికి చీడ పట్టినప్పుడు, దాన్ని వదిలించడానికి తీసుకోవాల్సిన సస్య రక్షణ చర్యలు వేరుగా ఉంటాయి. చేను మొత్తాన్ని వదిలి ఒక మొక్కకు, ఆకుకు మందును పిచికారి చేస్తానంటే ఏం ప్రయోజనం ఉంటుంది. అలాంటిదే స్కాంలు, స్టింగ్ ఆపరేషన్లు అని చెప్పి ఇలాంటి వాటిని వద్దనుకోవడం కూడా సబబుకాదు కదా?

టివి ఛానల్ వారికి మంచి చెడు ఆలోచించే అవకాశం ఆ సందర్భంలో ఎక్కువగా ఉంటుంది. ఒక సంఘటన జరగగానే దాన్ని యథాతథంగా ప్రేక్షకులకు చూపించాలనే తొందర్లో వారు విచక్షణను మరిచే అవకాశం ఎక్కువ. పైగా ఛానల్స్ మధ్య పోటీ వాతావరణం ఇలాంటి వాటిని ఆలోచించనీయవు. ఎవరు ఎన్ని ఎక్కువ దృశ్యాలను సేకరిస్తే అంత గొప్ప. అందుకే వారు ఉరుకులు పరుగులు పెడ్తారు.

దీంతో ఎలక్ట్రానిక్ మీడియా కొన్నిసార్లు అనుకోని గొడవలను కొత్తగా సృష్టించే అవకాశం ఉంది. టెలికాస్ట్ జరిగాక దాన్ని సవరించుకునే వీలే ఉండదు. కొన్ని సున్నిత అంశాలుంటాయి. మతానికి, వర్గానికి సంబంధించిన అంశాలుంటాయి. పోస్ట్ మాడర్నిజం ఊపులో కుల వాదానికి కొత్తబలం వచ్చింది. ఇలాంటి సున్నిత అంశాలమీద వార్తలను ప్రసారం చేసినప్పుడు, ప్రజల నుంచి కొన్నిసార్లు హింసాత్మకంగా స్పందన రావచ్చు. వీటిని గురించి ఆలోచించి కొన్ని మార్గదర్శకాలను రూపొందించాల్సిన అవసరం ఉంది.

కెమెరామెన్‌లకు, విలేకరులకు, ఇన్‌పుట్ ఎడిటర్‌లకు వీటి విషయమై సరియైన అవగాహన కల్పించాల్సిన అవసరం ఉంది. దీనికి సంబంధించి ఎవరికి వారుగా కానీ, అన్ని ఛానల్స్‌వారు కలిసికానీ మార్గదర్శకాలను రూపొందించుకోవాల్సి ఉంది. ◆

మంచు రూపంలో ఉంది. మిగతా 0.62 శాతం వాతావరణం చెరువులు, నదులు, వాగులు, భూగర్భ జలాల రూపంలో ఉందని, దానినే మానవజాతి తాగు, సాగు, పరిశ్రమలకు వినియోగించుకోవాలని చెబుతున్నారు. ఈ లెక్కలు చూస్తే జీవరాశి వినియోగానికి అందుబాటులో ఉన్న నీరు అత్యల్పం అనే భావన రాకతప్పదు. మరొక వైపునుండి నీటి లెక్కలు అంచనా తీసుకోవాలి. అలా అయితేనే వాస్తవ జగత్తులోకి రాగలం. ప్రపంచంలో అవసరమైన జలవనరులున్నాయి అని గణాంకాలు తెలుపుతున్నాయి. నీరు లభించే దగ్గర నివాసాలు ఏర్పడ్డాయనేది వాస్తవం. ప్రపంచం మొత్తం ప్రతి సంవత్సరం వాడుకోదగిన నీరు 14 లక్షల టిఎంసిలు అందుబాటులో ఉంది. దీనిలో నేడు ఉపయోగించుకుంటుంది చాలా తక్కువ.

మన రాష్ట్రం వరకు చూస్తే వర్షం ద్వారా ప్రతి సంవత్సరం 8681 టిఎంసిల నీరు లభిస్తుంది. కాని వాడుకోతగినది 3000 టిఎంసిలు గ్యారంటీగా ఉన్నది. అన్ని అవసరాలకు కలిపి 2000 టిఎంసిలు కూడా వాడుకోవడం లేదు. మిగతా నీరు సముద్రంపాలు అవుతోంది. ఈ నీరంతా పరిశుభ్రమైనదే. పారిశ్రామికాభివృద్ధి కారణంగా ఫ్లోరైడ్ కారణంగా ప్రజలకు సహజంగా లభించే నీటి కొరత ఏర్పడింది. ప్రపంచంలో 120 కోట్ల మంది ప్రజలకు, మనదేశంలో రెండు లక్షల గ్రామాలకు మంచినీటి సౌకర్యం లేదు. పెరిగిన పట్టణాల కారణంగా చుట్టూతా ఉన్న గ్రామలలో భూగర్భజలాలు విషతుల్యం అయి, నీరు అందరికీ సప్లయి కాకపోగా అనేక సమస్యలు ఉత్పన్నం అవుతున్నాయి.

## తాగునీటి కొరత ఎవరి సృష్టి?

జనాభా పెరుగుతోంది. మంచినీటికి, సాగునీటికి కొరత ఏర్పడుతోంది అని నేడు ప్రపంచ వ్యాప్తంగా విస్తృతంగా ప్రచారం జరుగుతోంది. దీనిలో కొంత వాస్తవం ఉంది. వర్షాలు తక్కువగా పడే ప్రాంతంలో పరిశ్రమలు భారీస్థాయిలో పెరిగి తాగునీరు కాలుష్యం అయి, ఉప్పునీరు, ఫ్లోరైడ్ నీరు ఉన్న ప్రాంతాలలో మంచి నీటికి ఇబ్బంది ఏర్పడుతున్న విషయం వాస్తవం.

పారిశ్రామికంగా అభివృద్ధి అయిన ప్రాంతాలలో, దేశాలలో మంచి నీటిని అందించడానికి కంపెనీలే బాధ్యత వహించినా క్రమంగా పరిశుభ్రమైన నీరుని అమ్మే విధానం రంగ ప్రవేశం చేసింది. మంచి నీరే వ్యాపార వస్తువుగా మారింది. లాభాలు రుచి మరిగిన కంపెనీలు నీటిని వ్యాపార వస్తువుగా మార్చడానికి, పథక రచనలు చేసుకున్నాయి. కొరత, పరిశుభ్రత అనే రెండుఅంశాలు ప్రజలను తేలికగా దండు కోవడానికి ఆయా కంపెనీలకు అవకాశంగా కనబడినాయి.

## ప్రైవేటీకరణ ఎవరికి మేలు?

మన రాష్ట్రంలో నీటి వ్యాపారం వేగవంతమయింది. మినరల్ వాటర్ పేరిట ప్యాకెట్, బాటిల్, క్యాను వాటర్ సప్లయి పెరిగింది. ఎక్కడయినా కంపెనీలు సరఫరా చేసే నీరు మినరల్ వాటర్ కాదు. కేవలం మంచినీరు మాత్రమే. నీరు ఎప్పుడు కదలికలో ఉండాలి. నిల్వ ఉండకూడదని శాస్త్రజ్ఞులు చెబుతారు. అంటే ప్యాకెట్‌లలో, బాటిల్‌లలో నిల్వ ఉంటుంది. నిల్వనీరు, పంపునీరు బేరీజు వేస్తే పంపునీరు ఆరోగ్యకరమైంది. మద్రాస్‌లో నీటికొరతను ప్రభుత్వం తీర్చలేకపోతోంది. నీటి కొరతను తీర్చడానికి ప్రభుత్వం కృష్ణా నది నుండి తెలుగు గంగ ద్వారా సంవత్సరానికి 15 టిఎంసిల నీరు సరఫరా చేయడానికి వెయ్యి కోట్లు ఖర్చు చేసింది. మన రాష్ట్రంలో హైదరాబాద్ నీటి వ్యాపారానికి కేంద్రం అయింది. ప్రైవేట్ కంపెనీలు మునిసిపల్ నీటినే వారి వ్యాపార సరుకుగా మార్చుకుంటున్నాయి. హైదరాబాద్‌లో మెట్రో వాటర్ బోర్డ్ వెయ్యి లీటర్లు రు. 6 నుంచి 8 వరకు మనిషికి ఒక్కంటికి రోజుకి 120 – 160 లీటర్లు అందిస్తోంది. రోజుకి 145 ఎంజీల నీరు ప్రజలకు అందిస్తోంది. అయితే 200 ఎంజీల నీరు అవసరం ఉంది. కేవలం లీటర్ ప్యూర్ వాటర్ తయారు చేయటానికి రు. 2.40 ఖర్చు అవుతోంది. బాటిల్, పన్ను, రవాణా, కమిషన్ అన్ని కలిపి లీటరుకు బాటిల్ ఖరీదు రు. 3.50 మించదు. అయినా మార్కెట్లో ఒక లీటర్ బాటిల్ రు. 10 నుండి 15 వరకు అమ్ముతున్నారు. ఇదే విధంగా నీటి వ్యాపారం కొనసాగితే ఒక్క మన రాష్ట్రం నుండే సంవత్సరానికి ప్రజల నుండి రు. 4,500 కోట్లు విదేశీ కంపెనీలు దండుకునే అవకాశం ఉంది.

## మంచి నీరు ఎవరు అందించాలి?

మన రాజ్యాంగంలో 'ఆర్టికల్ 21' ప్రకారం ఎవరూ జీవించే హక్కు కోల్పోకూడదని పేర్కొనబడింది. నీరు వస్తువుకాదు, వ్యాపార సరుకు అంతకంటేకాదు. ప్రజలకు మంచినీరు అందుబాటులో ఉంచడం ప్రభుత్వ కనీస బాధ్యత. రాజులు, చక్రవర్తులు, ఫ్యూడలిస్టుల రాజ్యాలలో సహితం ప్రజలకు మంచినీరు అందించడం కనీస బాధ్యతగా భావించే వారు. ప్రజా పరిపాలనలో ప్రజలకు మంచినీరు అందించటంలో స్థానిక సంస్థలు అయిన గ్రామపంచాయితీలు, మునిసిపాలిటీలు, కార్పొరేషన్‌లు బాధ్యత వహించాయి.

నేడు ఆంధ్రప్రదేశ్‌లో ఫ్లోరైడ్ ప్రభావం ఉన్న గ్రామాలు 12,068. ఉప్పునీటి ప్రభావం ఉన్న గ్రామాలు 8,519 ఉన్నట్లు ప్రభుత్వ గణాంకాలు తెలుపుతున్నాయి. వర్షాలు సరిగా కురవపోతే నీటి కొరత 30 నుండి 70 శాతం పెరుగుతుంది. మంచినీరు లభించకపోతే డయేరియా, కలరా, టైఫాయిడ్, కామెర్లు, ట్రికోమా, హకవామెన్సి వస్తాయి. కలుషిత నీటి వలన వచ్చే జబ్బులు ఒకరి నుండి ఒకరికి, పేటలకు, వాడలకు పరిమితం కాకుండా అవి చుట్టూ ఉన్న ప్రజలకు వ్యాపిస్తాయి. ఆర్థిక స్తోమత లేని ప్రజలు నీటిని కొని తాగలేక ఏవి దొరికితే అవి తాగుతారు. జబ్బులకు గురౌతుంటారు. నియంత్రణలో భాగంగా మంచినీటిని అందించటం సామాజిక బాధ్యతగా ప్రభుత్వం గుర్తించి ప్రజల ఆరోగ్యాన్ని, ప్రాణాల్ని కాపాడటం ఆర్టికల్ 21వ, 47లను రాజ్యాంగంలో చేర్చడం ద్వారా రాజ్యాంగకర్తలు ప్రజలకు హామీ కల్పిస్తూ ప్రభుత్వంపై బాధ్యతపెట్టారు.

మన రాష్ట్రంలో హైదరాబాద్, విశాఖ, విజయవాడలతో సహా అన్ని కార్పొరేషన్‌లలో నీటి సప్లయ్ ప్రైవేటీకరణ చేయడానికి రంగం సిద్ధం చేశారు. విద్యుత్ రెగ్యులేటరిలాగా నీటి రెగ్యులేటరిని ఏర్పాటు చేయాలని ప్రభుత్వం పథకం రచించింది. కాని కార్పొరేషన్ ఎన్నికల సమయం కారణంగా వాటి అమలు వాయిదా వేశారు.

మంచినీరు ప్రైవేటీకరణ అయితే లాభం లక్ష్యంగా పెట్టుకొన్న కంపెనీలు ప్రజల ఆరోగ్యానికి బాధ్యత వహించలేవు. ప్రజల ఆరోగ్యాలతో బహుళజాతి సంస్థలు వ్యాపారం చేస్తున్నాయి. ప్రాథమిక ఆరోగ్య పరిరక్షణలో భాగంగా మంచి నీటి సప్లయికి ప్రభుత్వమే పూర్తి బాధ్యత వహించాలి.

◆

గ్రామీణాభివృద్ధి పేరుతో వేల కోట్ల రూపాయల నిధులు వెచ్చించిన తర్వాత కొనసాగుతున్న వాస్తవ పరిస్థితిని చిత్రిస్తున్నారు **వి. హనుమంతరావు**

# వేల కోట్ల రూపాయల గ్రామీణాభివృద్ధి!

పదవ ప్రణాళిక కన్నా ఒకటిన్నర రెట్లు కేటాయింపుతో పదకొండవ ప్రణాళిక కేంద్రం ఆమోదించింది. 36 లక్షల కోట్లు వచ్చే అయిదేళ్లలో ఖర్చు అంటే మాటలా? రోజుకు 20 రూపాయల ఆదాయంతో బతికేవాళ్లు ఈ అంకె చూసి కళ్లు తిరిగి పడిపోతారు. ఆ అంకె కాగితం మీద వెయ్యటం కూడా రాదు. అవును మరి, గత నాలుగేళ్లలో దేశం దూసుకుపోతోంది, వెలిగిపోతోంది. (వెలిగిపోతోందన్న బి.జె.పి దీపం ఆరిపోయింది). స్థూల జాతీయాదాయం తొమ్మిది శాతం సాధించాం. విదేశీ మారకం నిల్వలు మేట వేసుకుపోతున్నాయి. దేశంలో మిలియనీర్లు, బిలియనీర్లు, ట్రిలియనీర్లు పుట్టుకొస్తున్నారు. డాలర్‌తో పోలిస్తే రూపాయి విలువ పెరిగిపోతోంది. ప్రణాళికలు ప్రారంభించిన నాటి నుంచి ప్రభుత్వం వెయ్యి మూడు లక్షల కోట్లు ఖర్చు చేసింది. ఇంత సొమ్ము ఖర్చు చేసిన తర్వాత, ఎంతమంది ఎంత మింగేసినా ఎంతో కొంత అభివృద్ధి జరిగే ఉంటుంది. కాదు, జరిగింది. ఇదేవరూ కాదనరు. 'దేశమంటే మట్టి కాదోయ్, దేశమంటే మనుషులోయ్' మహాకవి గురజాడ అన్నట్లు, ఆ మనుషుల జీవితాలు కూడా వెలిగిపోతున్నాయా, ముందుకు దూసుకుపోతున్నాయా అని చూడబోతే నేడు అత్యధిక సామాన్యుల జీవితాల్లో ఎంత వెలుగు కనుపిస్తుందో రెండు, మూడు ఉదాహరణలు పంచుకుంటాను. ఇవి నా ఊహాచిత్రాలు కాదు. విశ్వామిత్ర సృష్టికానే కాదు. 'టైమ్స్ ఆఫ్ ఇండియా' ప్రచురించిన వాస్తవ కథనం ఇది.

అపుడప్పుడు ఆకలి బాధతో మరణించినవారి గురించిన వార్తలు వింటుంటాం. కాని తూర్పు ఉత్తరప్రదేశ్ ఘాజీపుర్ ప్రాంతంలో ముసాహర సెటిల్‌మెంట్‌లో 25 కుటుంబాలు మొత్తం రోజుకు కేవలం రెండు చపాతీలు తిని బతుకు వెళ్లదీస్తున్నారని ఆ తండాను సందర్శించిన పత్రికా విలేకరి ఫ్రైనీ మానెకషా పంపిన కథనం ఇది. అతను వెళ్లే సరికి ఆ కుటుంబాలు పనికివెళ్లిన మగవారి రాక కోసం ఎదురు చూస్తున్నారు. రాజ్‌మున్నా అంటుందికదా "మాకు భూమిలేదు. నా కుటుంబంలో ఉన్న ఎనిమిది మంది రోజు కూలీ పది నుంచి ఇరవై ఐదు రూపాయలు కూలీమీద బతుకుతున్నాం. రోజుకు తలసరి రెండు చపాతీలు తినటమే గగనమైపోతోంది. అందరికీ కలిపి పావుకిలో పప్పు, ఎపుడైనా ఓ కూర". కాస్త దూరం నడిస్తే ఆయాసం వస్తుంది. ఒక కొడుక్కు ఎముకల్లో టి.బి. ఆరోగ్య కార్యకర్త అపుడప్పుడు వస్తాడు. ఇంజక్షన్‌కు పదిరూపాయలు తీసుకుంటాడు. ముఖ్యంగా ఆగస్ట్, సెప్టెంబర్ నెలల్లో వ్యవసాయ పనులు తక్కువగా ఉన్నప్పుడు పని దొరక్క పొయ్యి రెండు రోజుల కొకసారి మాత్రమే అంటిస్తాం. "ముందు మా పిల్లలకు ఆకలితీరుస్తాం. మేం తీర్చలేక పోతే వారు పక్క పొలాల్లోకి వెళ్లి పచ్చి బెండకాయలు తిని రోగాల పాలవుతారు" అంటాడు రాంప్రసాద్ బనవాసి. ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ రూరల్ మేనేజ్‌మెంట్ విద్యార్థి చేసిన సర్వే ప్రకారం ముషాహర తండాలో ఆరు సంవత్సరాల వయసు గల 90 శాతం పిల్లలు పోషకాహారలేమితో కృశించిపోతున్నారు. టి.బి., జ్వరాలు అతి సాధారణం. వర్షాలు వస్తే, బ్లాక్ డెవలప్‌మెంట్ కార్యాలయం లోపల దాచుకొంటాం. ఈ తండాకో చరిత్ర ఉంది. వారంతా గిరిజనులు. అడవుల విస్తరణ పేరుతో బ్రిటిష్ పాలకులు వారిని నిర్వాసితులు చేశారు. అయితే వీరికి నష్టపరిహారంగా చిన్న చిన్న ప్లాట్లు ఇస్తే వాటిని భూస్వాములు కాజేశారు. రాంప్రసాద్ ఒక ఆసక్తికరమైన విషయం చెప్పాడు. ఎలుకలు నెలలో కన్నాలు పెట్టి, తెచ్చుకొన్న గింజలు దాచుకొంటాయి. ఈ తండావాసులు, ఆ కన్నాలను తవ్వి ఆ గింజలను తెచ్చుకొని వండుకొని తింటారు. అయితే వారిని గిరిజనులుగా గుర్తించకపోవడంతో వారికి గిరిజనులకిచ్చే సహాయం అందదు. వ్యవసాయంలో యంత్రాలు ప్రవేశ పెట్టడంతో ఉపాధి అవకాశాలు సన్నగిల్లాయి. వారికి పేదరికపు రేఖ కింద నివసించే వారికిచ్చే రేషన్ కార్డులు లభించవు. వీరి పిల్లలు ప్రభుత్వ పాఠశాలకు వెళితే, వారిని దూరంగా కూర్చోబెడతారు. వారికి ఓటు హక్కులేమిటో తెలియవు. రాజకీయ పార్టీల నాయకులను పిలిస్తే, వారందరికీ భూమి ఇప్పించాల్సిందేనని నమ్మబలుకుతారు. కాని దళితుల్లో దళితులైన వీరికి ఆ సహాయం ఎప్పుడు అందుతుందో తెలియదు. గమనించాల్సిన విషయం ఏమంటే ఆ రాష్ట్ర ముఖ్యమంత్రి దళిత కులానికి చెందినవారే. ఇది గ్రామీణుల జీవిత గాథ. గ్రామీణాభివృద్ధి పేరితో వేల కోట్లు ఖర్చు చూపిస్తారు. అయినా వారిలా నికృష్టపు జీవితానిన అరవై సంవత్సరాల తర్వాత, పది ప్రణాళికల తర్వాత గడపాల్సిన అవసరం ఎందుకు వస్తుందో పాలకులు సెలవిస్తారా?

## సిల్క్ చీరలు, చీకటి బతుకులు

వారణాసి సిల్క్ చీరలకు ప్రసిద్ధి. ధనవంతుల ఇళ్లల్లో, వివాహాలకు

### గ్రామీణాభివృద్ధి

2001 జనాభా లెక్కల ప్రకారం ప్రతి అయిదు కుటుంబాల్లో రెండు కుటుంబాలు ఒకే ఒక గదిలో నివాసముంటున్నాయి. పశ్చిమ బెంగాల్, ఆంధ్రప్రదేశ్‌ల్లోనేకాక ధనవంతమైన గుజరాత్, మహారాష్ట్రల లో కూడా సంసారాలు ఇరుక్కొని సర్దుకుపోయే స్థితిలో ఉన్నాయి. దేశంలో పదికోట్ల ఇళ్లల్లోనే విద్యుద్దీపాలున్నాయి. (2001 జనాభా 101 కోట్లు) ఆంధ్రప్రదేశ్‌లో 46 శాతం కుటుంబాలు ఒక ఒక గదిలో నివసిస్తున్నారని, 67 శాతం ఇళ్లలోనే కరెంటు ఉందని, 19 శాతం ఇళ్లల్లోనే గ్యాస్ బండలున్నాయని తేలింది. దేశంలో ఇంకా 830 లక్షల కుటుంబాలకు వాహనం సైకిలే. రాష్ట్రంలో ప్రతి మూడు కుటుంబాల్లో ఒక్కరే సైకిల్ ఉపయోగిస్తున్నారు. రైతు కుటుంబాల్లో సగటున తలసరి ఆదాయంలో 55 శాతం ఆహారం కోసమే ఖర్చు చేయాల్సి వస్తోందని నేషనల్ సాంపిల్‌సర్వే లెక్కలు తెలియజేస్తున్నాయి. అస్సాం, జార్ఖండ్, బీహార్, పశ్చిమబెంగాల్, సిక్కిం రాష్ట్రాల్లో ఈ శాతం 60 పైనే ఉంది.

### మానవాభివృద్ధి

ఐక్యరాజ్య సమితి తాజా మానవాభివృద్ధి నివేదిక ప్రకారం మనదేశం 12వ స్థాయిలో ఉంది. పరిస్థితి ఇలా ఉంటే 2020 నాటికి మనదేశం ఎంతో ఎత్తుకు ఎదిగిపోతుందని ఊహాగానాలు చేస్తోంది. ప్రపంచంలో అట్టడుగున ఉన్న యాభై దేశాల్లో భారతదేశం ఉంది. అదే నివేదిక తెలిపే విషయం ఏమంటే దేశం అభివృద్ధిని తలసరి ఆదాయంతో మాత్రమే కాక విద్యపై, సగటు ఆయుః ప్రమాణాం ఆరోగ్య పారిశుధ్య సదుపాయాలు, ప్రసూతికి ఏర్పాట్లు, శిశుమరణాల సంఖ్య లాంటి విషయాలన్నీ గమనంలోకి తీసుకొని ఒక దేశస్థానాన్ని నిర్ణయించటం జరుగుతోంది. అలా చూస్తే మనకన్నా చిన్నది, ఆర్థికంగా బలహీనమైన శ్రీలంకలో మనకన్నా మంచి స్థాయిలో మానవాభివృద్ధి జరిగింది. మనదేశంలో పుట్టిన ప్రతీ వెయ్యిమంది బిడ్డల్లో ఏడాది మించకుండానే 67 మంది చనిపోతున్నారు. 93 మంది అయిదేళ్లు రాకుండానే మరణిస్తున్నారు. దీనికి ఒక కారణం 2004 నివేదికలో పేర్కొన్నట్లు స్థూల జాతీయాదాయంలో అతి తక్కువ శాతమే ప్రజల ఆరోగ్యానికి ఖర్చు చేస్తున్నాం. ఇంకో ఘోరమైన విషయమేమంటే ఈ నివేదికలో ఎంచుకొన్న 195 దేశాల్లో నాలుగు దేశాలు మాత్రమే మనకన్నా తక్కువ శాతం ఆరోగ్యం కోసం వెచ్చిస్తున్నాయి. మన పాలకులకు గురువులైన ప్రపంచ బ్యాంకు నివేదిక ప్రకారమే (2003) దేశంలోని పేదల జనాభాలో సగం మంది కేవలం నాలుగు రాష్ట్రాల్లోనే ఉన్నారు. ఇవన్నీ దేశం మొత్తానికి లెక్కలు. 70 శాతం ప్రజలు గ్రామీణ ప్రాంతాల్లో నివసిస్తున్నారు కాబట్టి ఈ గణాంకాలన్నీ గ్రామీణ ప్రాంతానికీ వర్తిస్తాయి.

భారతదేశం దీపం వెలిగిపోతుందా? కొడి గట్టుకపోతుందా?

వారణాసి వెళ్లి చీరలను కొంటారు. దశాబ్దాల తరబడి నేత కార్మికులు ఈ వృత్తి మీద పట్టు సంపాదించారు. బజార్డిహాలో, వారణాసి కాలనీలో లక్ష మంది ఈ చీరల నేతమీద జీవితం గడుపుతున్నారు. స్త్రీలు ఎంతగానో ఆరాటం చూపే బనారస్ సిల్కు చీరలు నేసేవారి జీవితాలు ఎలా గడుపుతారో వారికి తెలియదు. ఇవాళ వీరందరి జీవితాలు రోడ్డున పడ్డాయి. చైనా నుంచి సిల్కు దారం, సిల్కు వస్త్రాల దిగుమతితో వారి మగ్గాలు మూలపడ్డాయి. నాజూకుగా చీరలు నేసే వారి చేతుల్లో చాలా మంది రిక్షాలు లాగుతున్నారు. ఆ చేతుల్తో తోపుడు బళ్లమీద కూరగాయలమ్ముతున్నారు, రాళ్లు కొడుతున్నారు. అక్కడక్కడా అడుక్కుంటున్నారు. ఒకపుడు పవర్‌లూమ్స్ ప్రవేశపెట్టడంతో, కర్రతో చేసే సంప్రదాయ మగ్గాల మీద నేసే చేనేత కార్మికులు నిరుద్యోగు లయ్యారు. ఇప్పుడు చైనా సిల్క్ దిగుమతులతో, దేశంలో సిల్క్ పరిశ్రమ దెబ్బతింది. వారణాసి నుంచి చేనేత కార్మికులు సూరత్‌కు నిర్వాసితులుగా వెళ్లి, అక్కడ తయారయ్యే డూప్లికేట్ సిల్క్‌శారి పరిశ్రమలో చేరి పొట్ట పోసుకోవాల్సి వచ్చింది. అక్కడ వారణాసి నుంచి చేనేత కార్మికులు వలస పోవటంతో వారి స్థానంలో గ్రామాల నుంచి నైపుణ్యం కొరవడిన చేనేత కార్మికులు వారి స్థానాలు ఆక్రమించటంతో, బనారస్ సిల్క్ శారిల నాణ్యత దెబ్బతినే పరిస్థితి ఏర్పడింది. సంప్రదాయ మగ్గాలు మూత పడ్డాయి. ఆ మగ్గాలకు పనిలేక వాటిని విరగ్గొటి కట్టెలుగా ఉపయోగిస్తు న్నామని కార్మికుడు ప్రవీణ్ అంటున్నాడు. రోజుకు రు. 150 నుంచి రు. 200 వరకు సంపాదించే మహమ్మద్ సబ్బాన్ ఇప్పుడు యాభై రూపాయలు గడించటం కష్టమైపోతోంది. 'ఇదివరకు మేం మా శారీలను నేరుగా దుకాణదారులకు అమ్మే వాళ్లం. ఇప్పుడు మధ్య దళారీలు ప్రవేశించారు. వారు చీరలు తీసుకొని వెళ్తారు. డబ్బుకోసం నెలల తరబడి వేచి ఉండాల్సి వస్తోందంటారు. దిక్కు తోచక ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. లాలాపురాలో పనిచేసే అరవై ఏళ్ల కాశీం అయిదు నెలలుగా పని దొరక్క ఇంట్లో ఉన్న చెంబు, తపాళా అమ్మేసుకుని జీవితం వెళ్లదీస్తూ ఆకలితో పిల్లలు తల్లడిల్లిడం చూచి భరించలేక పోయాడు. ఒకరోజు ఉదయం అతని శవం దగ్గరలో ఉన్న నూతిలో తేలింది. భారతదేశం వెలిగిపోతోంది, కాని ఆ వెలుగు చేనేత కార్మికుల గృహాల్లో కనుపించటం లేదు.

### ఒరిస్సా కార్మికులు, ఆంధ్ర దోపిడీదార్లు

పేదరికం, ఆకలి, బాల బాలికల అమ్మకాలు. కరువు – వాటి మారుపేరే ఒరిస్సాలోని బొలంగీర్ ప్రాంతం – ఇక్కడ ప్రధాన పరిశ్రమ వలస. వలసపోయేది చుట్టు పక్క రాష్ట్రాలు, ప్రధానంగా ఆంధ్రప్రదేశ్. ఇక్కడ అంటే హైదరాబాద్, కరీంనగర్, ఆదిలాబాద్, విశాఖ, విజయనగరం పట్టణాల్లో, వారు చేసే పని ఇటుక బట్టీల్లో. ఈ బట్టీల్లో బాల కార్మికులు నిషిద్ధంకాదు. వారి శ్రమశక్తి కారుచవుక. అందుకే బొలంగీర్‌లో మధ్యదళారీలు పిల్లలను వారి తల్లిదండ్రులకు తెలియకుండా పై పట్టణాలకు తరలిస్తారు. కటిక పేదరికం పెద్దల్ని కూడా ఈ ప్రాంతాల్లో పని చేయటానికి దారి చూపుతుంది. 48 ఏళ్ల వయస్సు గల గిరిజాదేవ్ భర్త ఇలాగే వలసపోయి ఆంధ్రలో చనిపోయాడు. అందుచేత తన కొడుకును ఆ ప్రాంతానికి పంపించనని చెప్పినా, మధ్యదళారీ అతన్ని తీసుకొనిపోయారు. పోలీసులు ఈ మానవ ప్రవాహానికి అడ్డుకట్టవేసి, మధ్య దళారీలను అరెస్ట్ చేస్తున్నారు, కేసులు పెడుతున్నారు. అయినా

**తొంభైల తరువాత అటు బోధనలోనూ, ఇటు పరిశోధనలోనూ గ్రామీణ భారతానికి, గ్రామీణాభివృద్ధికి సంబంధించిన అంశాలు అప్రధానం అయిపోయాయని అంటున్నారు ఎన్. పురేంద్ర ప్రసాద్**

# అప్రధానమవుతున్న గ్రామీణాభివృద్ధి

'అభివృద్ధి', 'సామాజికాభివృద్ధి', 'గ్రామీణాభివృద్ధి', 'సమగ్రాభివృద్ధి' అనే మాటలను స్వాతంత్ర్యానంతర భారతదేశంలో విరివిగా వాడటం జరుగుతోంది. మూడో ప్రపంచ దేశాలలో అభివృద్ధి అనే మాటకే ఒక ప్రత్యేకమైన అర్థం ఉంటుంది. అది ప్రధానంగా 'బయటి నుంచి జోక్యం' అనే భావాన్ని ఉద్దేశిస్తుంది. సామాజిక మార్పును రూపకల్పన చేసేటప్పుడు భారత రాజ్యానికి ఉన్న మౌలిక అభిప్రాయాలలో ఒకటి పెట్టుబడిదారీ సమాజానికి అభివృద్ధి జోక్యాల ద్వారా సామాజిక న్యాయాన్ని అందించడం స్వభావరీత్యానే సాధ్యం కాదని. పాశ్చాత్య అభివృద్ధి నమూనాలను అందుకోవాలనే నెహ్రూ దృక్పథం ఉండిన భారత రాజ్యం పంచవర్షిక ప్రణాళికల ద్వారా ఎన్నో అభివృద్ధి కార్యక్రమాలను రూపొందించింది. ఈ కార్యక్రమాలు రూపొందండంలో కొన్ని ముందుగానే ఏర్పరుచుకున్న అభిప్రాయాలు ఉన్నాయి. గ్రామీణ సమాజాలు భిన్నమైనవని, వాటికి తమ సొంత అభివృద్ధి అవసరాలు ఏవో వ్యక్తీకరించే సామర్థ్యం లేదని, అందువల్ల బయటినుంచి అందిన అభివృద్ధిని నిష్క్రియాపరంగా అందుకుంటాయని ఆ అభిప్రాయాలు. భారతదేశంలో గ్రామీణాభివృద్ధి గురించి భారత ప్రభుత్వం రూపొందించిన పథకాలన్నిటికి నేపథ్యంలో ఉన్న స్థూల చిత్రం ఇది.

మొదటి మూడుపంచవర్ష ప్రణాళికల కాలంలో వ్యవసాయాభివృద్ధి గురించి భారత ప్రభుత్వం తీసుకున్న వైఖరి రెండు లక్ష్యాల సాధనతో కూడి ఉండింది. వ్యవసాయాభివృద్ధిలో అత్యధిక పెరుగుదల సాధించాలనే ఆర్థిక లక్ష్యం, ఉద్దేశం విపరీతంగా సాగుతున్న పారిశ్రామికీకరణకు మద్దతు ఇవ్వడం మాత్రమే. ఇక దాని సామాజిక లక్ష్యం గ్రామీణ జీవితంలోని అసమానతలను తగ్గించడం. అందువల్ల అప్పుడు తయారైన కార్యక్రమా లలో అత్యధిక భాగం దేశవ్యాప్తంగా ఒక ప్రత్యేక సమూహాన్ని ఎంచుకొని వారిని ఉద్దేశించి సాగింది. అంటే పేదరికాన్ని, నిరాదరణను, అంచులకు నెట్టబడటానికి కొలవడానికి పెద్ద ఎత్తున సర్వేలు

---

ప్రవాహం సాగుతూనే ఉంది. పేదరికం ఒత్తిడి అలాంటిది. శీతాకాలం రావటంతో ఈ ప్రవాహం ప్రారంభమవుతుంది. సన్నకారు రైతులు తమ భూముల్లో పండించేదీ అంతంత మాత్రమే. వ్యవసాయకూలీలకు పని లభించదు. కాగా ఉపాధి దొరికేచోటుకు పరుగులు తీయటం తప్పటం లేదు. మధ్య దళారీల చేతుల్లో చిక్కుకోవటం తప్పటం లేదు. అపుడప్పుడు పెళ్లిళ్లు పండుగల సందర్భంలో ఈ మధ్య దళారీల వద్దనుంచే అప్పు తీసుకోవటం, ఆ అప్పును సకాలంలో తీర్చలేకపోవటంతో ఆ అవకాశాన్ని దొరకపుచ్చుకొని వారిని ఆంధ్రలో ఇటుకబట్టీలకు తీసుకొని పోవటం జరుగుతోంది. బెల్పాడసాము మాలతీ మాఝు అంటున్నారు. "12 వేల రూపాయల అప్పు నా బిడ్డ వివాహానికి నువాఖాయ్ పండుగకు తీసుకోవాల్సి వచ్చింది. ఎనిమిది నెలలు ఇటుక బట్టీలలో పని చేస్తే నా రుణం తీరిపోతుందని మధ్య దళారీ చెప్పాడు. నాకు మరో మార్గంలేక అంగీకరించవల్సి వచ్చింది". నువాఖాయ్ పండుగ చేసుకోకపోతే పొలంలో పంటపండదని వారి మూఢ విశ్వాసం. 12ఏళ్ల బాలుడు గీతామల్లిక్ చెప్పాడు 'నా తల్లిదండ్రులు 18 వేల రూపాయల అప్పు తీసుకున్నారు. అది చెల్లించలేకపోతే నన్ను, మా నాన్నను ఆంధ్రలో పనికి తీసుకొని పోయాడు. ఏడో క్లాస్‌లో ఉన్నాను. చదువు మానేసి వెళ్లాల్సి వచ్చింది.

ఇటుక బట్టీల వద్ద పనులున్నాయని తమంతట తామే ఈ బట్టీల యజమానుల వద్దకు నేరుగా వెళ్లి బేరమాడుకొని నాలుగు డబ్బులు సంపాదించుకోవడానికి వీల్లేదు. మధ్య దళారీలు నేరుగా వెళ్లనివ్వరు. ఇంత అవస్థ పడి పనిచేసి నాలుగు డబ్బులు వెనకేసుకొని గ్రామానికి తిరిగి వస్తే వారికి పెద్దగా ఒరిగిందేమీ లేదు. చేసిన అప్పు తీర్చడానికే సరిపోతోంది. పైగా శ్రమ దోపిడీకి గురికావటం వల్ల ఆరోగ్యం దెబ్బతింటోంది. మందులు, డాక్టర్ల వద్దకు వెళ్లడానికి డబ్బులేక మళ్లీ మధ్య దళారీ దగ్గరికి పోవాల్సిందే. ఈ రకంగా వారు మధ్య దళారీల కట్టుబానిసులగా మారిపోయారు.

ఇలాంటి వారికి నూరు రోజుల పని గ్యారంటీ పథకం ఎంతవరకు ఉపయోగపడుతుంది? పథకం మంచిదేకాని ఆచరణ? బొలంగిర్‌లో ఈ పథకం కింద 1,86,250 కుటుంబాలు తమ పేర్లు నమోదు చేసుకొంటే 1,83,449 జాబ్ కార్డులిచ్చారు. కాని పని లభించింది కేవలం 33,274 కుటుంబాలకే. రు. 23 కోట్లు ఈ పథకం అమలుకు కేటాయిస్తే పేదలకు ముట్టింది రు. 25 లక్షలు (2007-08) మాత్రమే. 1474 ప్రాజెక్టు పనులు మాత్రమే చేపట్టినా 238 పనులు మాత్రమే పూర్తి అయ్యాయి. వెయ్యి కోట్ల రూపాయలు ప్రణాళికల పేరుతో ఖర్చు చేయగా ఇది గ్రామీణ ప్రాంతాల్లో ఉన్న వాస్తవ పరిస్థితి. భారతదేశం వెలిగిపోతోంది. ◆

అవసరమైయ్యాయి. సామాజిక శాస్త్రాల లోపల ఈ గ్రామీణాభివృద్ధికి అవసరమైన విద్యాపర మైన అంశాలను అందించడానికి చాలా మంది అర్థశాస్త్రవేత్తలే ముందుకు వచ్చారు. ప్రణాళికా సంఘం ద్వారాను, అంకెలతోనూ, అంచనాలతోనూ వ్యవహరించగల నేర్పుతోనూ అర్థ శాస్త్రవేత్తలు అగ్రభాగాన నిలిచారు.

మరొక పక్క 1950లలో, 60లలో సామాజిక శాస్త్రవేత్తలు చాలా మంది విస్తృతంగా గ్రామీణ అధ్యయనాలు జరిపారు. గ్రామీణాభివృద్ధి చర్చలలో తమదైన స్థానాన్ని రూపొందించుకున్నారు. నిశితమైన సామాజిక శాస్త్ర పరిశీలనమీద ఆధారపడి ఎన్నో నివేదికలు అచ్చయ్యాయి. నిజానికి ఈ రంగంలో పరిశోధన ఎంత సుప్రసిద్ధమైన దంటే ఎంతో మంది పరిశోధకులు వారు పరిశోధించిన గ్రామాల పేర్లతో ప్రఖ్యాతమయ్యారు. ఎం.ఎన్. శ్రీనివాస్ - రాంపుర, ఎస్.సి. దూబే - శామీర్‌పేట్, అంద్రీబెటిల్ - శ్రీపురం, ఈశ్వరన్ - శివపూర్ అనేవి విడదీయరాని ప్రసిద్ధ జంటలైపోయాయి. స్వాతంత్ర్యానంతర భారత దేశం ఒక జాతి రాజ్యంగా తన సొంత అస్తిత్వాన్ని అభివృద్ధి చేసుకోవడానికి ప్రయత్నిస్తున్న సమయంలో ఈ గ్రామ పరిశోధనలు చాలా ప్రాముఖ్యతను సంతరించుకున్నాయి. ఈ గ్రామీణ అధ్యయనాల ద్వారా సామాజిక శాస్త్రవేత్తలు చేసిన ప్రముఖమైన దోహదం ఏమంటే స్వాతంత్ర్యోత్తర తొలి సంవత్సరాలలో సామాజిక జీవనం ఏ రకంగా నిర్మాణం అయి ఉన్నదో ఈ అధ్యయనాలు సుసంపన్నమైన వాస్తవిక వివరాలను అందించాయి. సమకాలీన భారత సామాజిక చరిత్రకు ఈ అధ్యయనాలు విలువైన వనరులుగా పనికొచ్చాయి. అసలు ఒక కొత్త సంవిధానం ముందుకు వచ్చింది. ఏ సమాజం గురించి పరిశోధకుడు అధ్యయనం చేస్తున్నారో ఆ సమాజంలో గణనీయమైన కాలం గడపవలసిన అవసరం వచ్చింది. స్థానిక భాషలు నేర్చుకోవలసి వచ్చింది. ఆ సమాజాల సామాజిక, సాంస్కృతిక నేపథ్యాన్ని అర్థం చేసుకోవలసి వచ్చింది. ఆ సమాజాలతో సహానుభూతి పొందవలసి వచ్చింది. అలా చేసినప్పుడు మాత్రమే తాము అధ్యయనం చేస్తున్న స్థానిక సమాజాల ప్రాపంచిక దృక్పథాన్ని వీలైనంత వస్తుగతంగా వ్యక్తీకరించడం సాధ్యమౌతుందనే అభిప్రాయం కలిగింది. ఆ రకంగా సామాజిక శాస్త్రాల లోపలే ఈ అధ్యయనాల లోపలే గ్రామీణాభివృద్ధికి ఉండగల విభిన్న దృక్పథాల గురించి చర్చ, సంభాషణ సాగాయి.

గ్రామీణ భారతానికి సంబంధించిన ఈ సైద్ధాంతిక వాస్తవ సమాచార చర్చలు దేశ వ్యాప్తంగా అన్ని విశ్వవిద్యాలయాలలో అన్ని సామాజిక శాస్త్ర శాఖలలోనూ ఇటు బోధనలోనూ, అటు పరిశోధనలోనూ ప్రతిఫలించాయి. దేశ జనాభాలో అత్యధిక భాగం వ్యవసాయ రంగం మీద ఆధారపడి ఉన్నారనే వాస్తవం వల్ల 1970లలోనూ, 80 లలోనూ సామాజిక శాస్త్రాల దృష్టి గ్రామీణ సమాజాలను, వ్యవసాయ సమాజాల స్వభావాన్ని, లక్షణాలను, ఉత్పత్తి విధానాన్ని, రైతుల నిర్వచనాన్ని, ఒక వర్గంగా రైతాంగాన్ని, సామాజిక పరివర్తన కార్యక్రమాలలో వర్గానికి, కులానికి ఉన్న పాత్రను, భూసంస్కరణలు, వ్యవసాయ విప్లవాన్ని, విభిన్న సామాజిక ఆర్థిక బృందాల మీద, ప్రాంతాల మీద, వ్యవసాయ విప్లవ ప్రభావాన్ని అర్థం చేసుకోవడం పై ఉండింది. మూడో ప్రపంచ దేశాలలో అశేష ప్రజలు వ్యవసాయం మీదనే ప్రత్యక్షంగా ఆధారపడి ఉండడంతో వ్యవసాయ సంబంధాలలో కొనసాగుతున్న నిర్మాణాలను అర్థం చేసుకోవడం, వాటిని మార్చడానికి మార్గాలను, సాధనాలను అన్వేషించడం సామాజిక శాస్త్రాలలో అత్యంత ముఖ్యమైన కర్తవ్యంగా గుర్తించడం జరిగింది.

మన దేశంలో విశ్వవిద్యాలయాలల్లో, సామాజిక శాస్త్ర శాఖలలో, అటు బోధనలోనూ, ఇటు పరిశోధనలోనూ 1990 తర్వాత గ్రామీణ భారతానికి, గ్రామీణాభివృద్ధికి సంబంధించిన అంశాలు 'ప్రధానాంశం' కాకుండా పోయాయి. ఈ పరిణామాలను విశ్లేషించడానికి ఒక పద్ధతి విశాల సామాజిక సమస్యలు విశ్వవిద్యాలయ వ్యవస్థలలో ఎట్లా ప్రతిఫలించాయి చూడడం. ఇక్కడ ఎన్నో అంశాలు చర్చించ వలసి ఉన్నప్పటికీ, ఒకటి రెండు విషయాలు మాత్రం లేవనెత్తవలసి ఉంది.

సామాజిక శాస్త్ర శాఖలలో ఇటీవల ఒక వాదన ఏమంటే, గ్రామాలు చాలా మార్పులకు గురయ్యాయని, భారతీయ సమాజం ప్రధానంగా గ్రామీణ సమాజం అని వివరించే మేధో సంప్రదాయం గానీ, ప్రచలిత భావాలు గానీ ఇప్పుడు సముచితం కావని ఆ వాదన చెబుతుంది. ప్రస్తుతం 'గ్రామీణ' అన బడేది ఏమీ లేదని చెప్పడానికి ఈ వాదన చాలా తీవ్రంగా ప్రయత్నిస్తోంది. భూస్వాములకు, భూమి లేని నిరుపేదలకు మధ్య ఉండిన వర్గ విభజన దాదాపుగా లేకుండా పోయిందని, గ్రామీణ భారతదేశంలో సంఘటిత రాజకీయ ఉద్యమం ఏదీ లేదని, గత దశాబ్దంలో గ్రామీణ ప్రాంతంలో వ్యవసాయేతర రంగం విపరీతంగా పెరిగిందని (ఈ అభిప్రాయం సందేహాస్పదం), అభివృద్ధి మీద దృష్టి గల రాజ్యం ప్రజలను క్రమక్రమంగా అన్ని రకాల నిరసన, ప్రతిఘటన ఉద్యమాల నుంచి దూరం చేసిందని, ఈ వాదన సాక్ష్యాలుగా చూపుతుంది. విశ్వవిద్యాలయాలలో గ్రామీణ భారతదేశం గురించి బోధన గానీ, పరిశోధనగానీ ఇంకా అనవసరం అనే వాదనను ఈ సాక్ష్యాలు బహుశా బలపరుస్తాయి. ఒక రకంగా చూస్తే ఇది పాశ్చాత్య సమాజాల అభిప్రాయం. అక్కడ పట్టణ సమాజమే ప్రధాన స్రవంతి సమాజమని, భారత సమాజం కూడా ఆ దశకు చేరిందని వీళ్లు వాదిస్తున్నారు. ఈ వాదనలను చాలా జాగ్రత్తగా పరిశీలించవలసి ఉంది. ఎందువలన అంటే భవిష్యత్తులో సామాజిక శాస్త్ర పరిశోధన మీద ఈ వాదనలు తీవ్రమైన ప్రభావాన్ని కలగజేస్తాయి.

వ్యవసాయం 'ప్రతిఫలం అందని వృత్తి' అయిపోయిందని భారత రాజ్యం బహిరంగంగానే నిస్సందేహంగా ప్రకటిస్తున్నట్టు కనబడుతున్నది. (స్వామినాథన్ కమిటీ నివేదిక 2006) అందువల్లనే ఆర్థిక రాజకీయ విధానాలలో రైతాంగానికి అనుకూలమైన విధానాలను భారత ప్రభుత్వం తీసుకోవడం లేదు. వ్యవసాయ రంగంలో పెద్ద ఎత్తున సంక్షోభం ఉండగా రైతాంగంలో నిరాశ నిస్పృహలు, సామాజిక ఉద్రిక్తతలు పెరుగుతుండగా, నిరుద్యోగం పెరుగుతుండగా, గ్రామీణ పట్టణ ప్రాంతాల మధ్య అసమానతలు విస్తరిస్తు ఉండగా, విశ్వవిద్యాలయాల లోపల బయట కూడా ఈ అన్ని సమస్యల గురించి 1970లలో, 80లలో ఆలోచించిన దాని కన్న మరింత లోతుగా తీవ్రంగా ఆలోచించవలసి ఉంది. ◆

**సరుకుల మీద దృష్టి ఉన్న పథకాలే వస్తున్నా గాని గ్రామీణ మానవ సంబంధాల అభివృద్ధి కాదుగదా గ్రామీణ ఉత్పత్తి సాధనాల అభివృద్ధి కూడా వెనకపట్టు పట్టింది అంటున్నారు ఎన్. వేణుగోపాల్**

# గ్రామీణాభివృద్ధి అంటే ఏమిటి?

భారత జాతీయోద్యమానికి నాయకత్వం వహించిన వారిలో ఎక్కువ మంది పట్టణ మధ్యతరగతి విద్యావంతుల వర్గం నుంచి వచ్చినవారే అయినప్పటికీ భారతదేశం ప్రధానంగా వ్యవసాయ దేశమని గ్రామీణ సమాజమని వారికి గుర్తింపు ఉండింది. భారతదేశం గ్రామాలలోనే నివసిస్తుంది అని చెప్పి గ్రామస్వరాజ్ తన లక్ష్యంగా ప్రకటించిన గాంధీ గాని, ఉత్తరాది గ్రామీణ జీవితం గురించి ఎక్కువగా రాసిన నెహ్రూ గాని స్వాతంత్ర్యానంతర భారతదేశంలో గ్రామాల ప్రాధాన్యతను గుర్తించారు. ఇవాళ్టికీ దేశంలో 70 శాతం జనాభా వ్యవసాయం మీదనే ఆధారపడి గ్రామాలలో నివసిస్తున్నదంటే 1947కు ముందరి స్థితి అర్థం చేసుకోవచ్చు.

అందువల్లనే వలస పాలన ముగిసిపోగానే ఏర్పడిన ప్రభుత్వాలన్నీ గ్రామీణాభివృద్ధి గురించి ఆలోచించడం ప్రారంభించాయి. ఈ అరవై ఏళ్లలో గ్రామీణాభివృద్ధి ప్రభుత్వాల ప్రధాన ప్రకటిత లక్ష్యంగా ఉంటూ ఉన్నది. పంచవర్ష ప్రణాళికలలో వ్యవసాభివృద్ధిగాని, సహకార రంగాల అభివృద్ధి గాని, సామాజికాభివృద్ధి పథకాలు గాని, నీటి పారుదల, గ్రామీణ విద్యుదీకరణ, గ్రామీణ రహదారులు, ప్రాథమిక విద్యా, వైద్య, ఆరోగ్య సౌకర్యాలు వంటి అన్ని పాలనాపరమైన చర్యలు, ఆలోచనలు గ్రామీణాభివృద్ధినే లక్ష్యంగా పెట్టుకున్నాయి. ఆ గ్రామీణాభివృద్ధికి ప్రభుత్వం పెట్టుకున్న లక్ష్యాలు గాని, ప్రమాణాలు గాని, సూచికలు గాని ఆరు దశాబ్దాల తర్వాత కూడా సంపూర్ణంగా నెరవేరలేదు. ఇంతకూ ప్రభుత్వం ప్రకటించిన గ్రామీణాభివృద్ధి లక్ష్యాలతో, ప్రమాణాలతో, సూచికలతో, అసలు తాత్విక దృక్పథంతోనే చాల సమస్యలు ఉన్నాయి.

గ్రామీణాభివృద్ధి గురించి పాలకులు ఆరు దశాబ్దాలకు పైగా మాట్లాడుతున్నప్పటికీ గ్రామీణాభివృద్ధి నిర్వచనం ఏమిటనేది ఇప్పటికీ స్పష్టంగా లేదు. గ్రామీణాభివృద్ధి అనగానే అంకెలలో ఎన్ని కిలోమీటర్ల రహదారులు, ఎన్ని ఎకరాల సాగు, ఎన్ని ఎకరాలకు కొత్తగా నీటి పారుదల సౌకర్యం, ఎన్ని పాఠశాలలు, ఎన్ని ప్రాథమిక వైద్య కేంద్రాలు, ఎంత అక్షరాస్యత వంటి గణాంకాలు ప్రకటించడమే ప్రభుత్వ శాఖలు చేస్తున్నాయి. నిజానికి మానవాభివృద్ధిని సంపూర్ణంగా అంకెలలో, అంకెల ద్వారా గ్రహించగలమా అనేది ప్రధానమైన ప్రశ్న.

ఆ ప్రశ్నను కాసేపు పక్కన పెట్టినా గ్రామీణాభివృద్ధి అనే పద బంధంలో గ్రామం, అభివృద్ధి అనే రెండు మాటలు ఉన్నాయి. ఈ రెండు మాటలను భారత పాలక వర్గాలు ఎలా అర్థం చేసుకున్నాయి, ఎలా నిర్వచిస్తున్నాయి అనేది లోతుగా పరిశీలించవలసి ఉంది.

పాలకుల దృష్టిలో గ్రామం అంటే కొంత మంది మనుషులు ఉండే ఒక ప్రాంతం మాత్రమే. గ్రామానికి ఇటువంటి నిర్వచనం ఇవ్వడం వల్ల ఆ మనుషులకు కాస్త విద్య, కాస్త వైద్యం, కాస్త తాగునీరు, సాగునీరు, కొన్ని వినోద, విజ్ఞాన అవసరాలు తీరిస్తే గ్రామం అభివృద్ధి సాధించినట్టే అనే భావన పాలకులలోనూ, అధికారవర్గంలోనూ ఉంది. గ్రామం అంటే ఒక ప్రాంతంలో కొందరు మనుషులు నివసించడం అన్నంత వరకు సరైనదే కాని, ఆ మనుషులు, ముఖ్యంగా మన సమాజంలో కుల అంతరాల నిచ్చెన మెట్ల వ్యవస్థలో ఉన్నారు. వారిలో కొందరి పట్ల అస్పృశ్యత కూడా అమలవుతున్నది. వారిలో అత్యధిక సంఖ్యాకులకు తమవైన వనరులు లేవు. అందువల్ల జీవనోపాధి కొరకు ఇతరుల మీద ఆధారపడి వారి దయాదాక్షిణ్యాల మీద బతకవలసి వస్తున్నది. ఆ వనరులను హక్కుభుక్తం చేసుకున్నవారు అత్యధిక సంఖ్యాకులకు జీవన అవకాశాలేవీ అందకుండా నిరోధిస్తున్నారు. ఒక్కమాటలో చెప్పాలంటే గ్రామంలో ఉండే సమాజం సంఘర్షణామయంగా ఉంది. ఈ సంఘర్షణను తొలగించకుండా ఆ మనుషుల అభివృద్ధి గురించి మాట్లాడడం అసాధ్యం.

అట్లాగే గ్రామం అన్నప్పుడు ఆ గ్రామంలో నివసించే మనుషుల అవసరాలు తీర్చడానికి ఉపయోగపడే వనరులు చాలా ముఖ్యమైనవి. దేశంలోని వైశాల్యం వల్ల, వైవిధ్యం వల్ల అన్ని గ్రామాలలోను వనరులు సమానంగా గాని, సరిపోయినంతగా గాని లేవు. కనుక గ్రామీణాభివృద్ధి గురించి ఆలోచించేటప్పుడు ఏ గ్రామానికి ఆ గ్రామానికి ఉన్న భూమి ఎంత, ఆ భూమి నాణ్యత ఎటువంటిది, ఆ భూమికి నీటి వనరులు ఎటువంటివి, ఆ భూమిలో పండగల పంటలు ఏమిటి, గరిష్ఠ దిగుబడితోనయినా ఆ గ్రామంలోని ప్రజల అవసరాలను తీర్చడం సాధ్యమౌతుందా, వ్యవసాయంలోని మిగులు ఆదాయాన్ని, వ్యవసాయానికి అవసరం లేని మిగులు మనుషులను ఉపయోగించి వ్యవసాయాధార పరిశ్రమలు పెట్టడం సాధ్యమౌతుందా, గ్రామంలో పని చేయగల శక్తి ఉన్న వారందరికీ ఉద్యోగ కల్పన సాధ్యమౌతుందా, వంటి ప్రశ్నలు వేసుకొని నిర్దిష్టమైన జవాబులు చెప్పుకొని ఆ మేరకు పథక రచన చేయవలసి ఉంటుంది. కాని, ఇప్పటి వరకు గ్రామీణాభివృద్ధి పేరు మీద అమలైన పథకాలన్నీ ఢిల్లీలో తయారై కిందికి వచ్చినవే తప్ప కింద గ్రామంలో వాస్తవ స్థితి ఏమిటో అంచనా కట్టి వాటి ఆధారంగా తయారైనవి కావు. అందువల్ల మొదటి పంచవర్ష ప్రణాళికా కాలంనుంచి కూడా వేల కోట్ల రూపాయలు, లక్షల కోట్ల రూపాయలు అనే ప్రకటనలు, కేటాయింపులు ఢిల్లీలోనో, రాష్ట్ర రాజధానులలోనో జరగడం, ఆ పథకాలకు కింద గ్రామాలకు ఆచరణ యోగ్యత లేకపోవడం, పైనుంచి

కింది దాకా నిర్మాణం అయిన శాఖలకు, అధికారవర్గానికి అవసరమయ్యే ఖర్చులకే ఈ నిధులన్నీ స్వాహా అయిపోవడం జరుగుతూ వచ్చింది.

అందువల్ల ఆరు దశాబ్దాల గ్రామీణాభివృద్ధి అనుభవం తరువాత కొత్తగా ఆలోచించవలసిన అవసరం చాలా ఉంది. రాజకీయార్థికశాస్త్ర పరిభాషలో గ్రామీణాభివృద్ధి గురించి ఆలోచించాలంటే మొదట గ్రామం అనేదాన్ని కొన్ని ఉత్పత్తి శక్తుల, కొన్ని ఉత్పత్తి సంబంధాల సమాహారంగా చూడాలి. ఈ మాటలు కష్టమైన మాటలుగా కనబడవచ్చు గాని, వాటి అర్థం ఏమంటే గ్రామం అనేది ఒక మానవ సమూహం. మానవులు ఏమీ చేసినా, ఏమి మాట్లాడినా, పాడినా, రాసినా మొట్టమొదట తినవలసి ఉంటుంది. అంటే ఉత్పత్తి చేయవలసి ఉంటుంది. ఈ ఉత్పత్తి చేయడానికి కొన్ని సాధనాలను ఉపయోగించ వలసి ఉంటుంది. ఆ సాధనాలలో భూమి, నీరు వంటి సహజ సాధనాలు ఉండవచ్చు, నాగలి, గడ్డపార, ఎరువులు వంటి మానవ శ్రమతో తయారైన సాధనాలు ఉండవచ్చు. ఈ ఉత్పత్తి సాధనాలను ఉపయోగించి ఉత్పత్తిని సాధించే ఉత్పత్తి శక్తులలో మనుషులు కూడా భాగమే. మనుషులు ప్రధానం. అయితే మనుషులు కూడా ఒంటరిగా ఈ ఉత్పత్తిని సాధించలేరు. తప్పనిసరిగా సామూహికంగా, శ్రమవిభజనతో, ఒక్కొక్క రంగంలో నైపుణ్యం సంపాదించి ఈ ఉత్పత్తి సాగిస్తారు. మౌలికంగా, సామూహికంగా మాత్రమే ఉండే ఈ ఉత్పత్తి క్రియలో పాల్గొంటున్న వారి మధ్య సంబంధాలు ఏర్పడతాయి. ఆ ఉత్పత్తి సంబంధాల పునాది పైననే సమాజం నిర్మాణం అవుతుంది. సమాజం వికసిస్తున్న కొద్దీ ప్రత్యక్ష ఉత్పత్తిలో పాల్గొనని ఒక చిన్న సమూహం కూడా ఏర్పడుతుంది కాని, వారిలో వారికి గాని, వారికీ ప్రత్యక్ష ఉత్పత్తిదారులకూ మధ్య గాని ఉండే సంబంధాలను కూడా ఉత్పత్తి సంబంధాలే నిర్ణయిస్తాయి.

ఏ సమాజంలోనైనా సాధారణ దృశ్యం ఇది కాగా, భారత సమాజంలో, ముఖ్యంగా గ్రామీణ సమాజంలో ఈ ఉత్పత్తి సంబంధాలలో కులం పాత్రకూడా ఉంది. గ్రామీణ ప్రాంతాలలో భూమి, నీరు తదితర వనరుల మీద, మొత్తంగా వ్యవసాయం మీద, అంటే ఉత్పత్తి మీద కొన్ని అగ్రవర్ణాల ఆధిపత్యం ఉంది. ఆ అగ్రవర్ణాలు నిజంగా ఉత్పత్తిదారులైన శ్రామిక కులాల శ్రమ శక్తిని దోచుకోవడం మాత్రమే కాక, ఆ కులాలకు చెందిన వ్యక్తులు వనరుల మీద అదుపు సంపాదించకుండా అడ్డుకుంటూ వచ్చారు. ఈ ఉత్పత్తి శక్తులలోని అత్యధిక భాగాన్ని ఇలా వనరుల నుంచి దూరం చేయడంలో మతం కూడా ప్రధాన పాత్ర వహించింది. గ్రామీణ సమాజంలో నెలకొని ఉన్న ఆచార వ్యవహారాలు కూడా ఈ కుల, మత అంతరాలను పెంచిపోషించాయి. కనుక గ్రామీణాభివృద్ధి అన్నప్పుడు ఆ ప్రాంతంలోని ఉత్పత్తి సాధనాల అభివృద్ధి మాత్రమే కాదని, ఉత్పత్తి సంబంధాల అభివృద్ధి కూడా అని గుర్తించాలి.

ఇంతకాలం సాగిన గ్రామీణాభివృద్ధి పథకాలన్నీ కూడా ఉత్పత్తి సాధనాలను సంఖ్యాత్మకంగా పెంచితే, గ్రామీణాభివృద్ధి దానంతట అదే సాగిపోతుందని భావించాయి. కాని, ఆ అభిప్రాయంలో వాస్తవం లేదని, దేశంలో వేలాది గ్రామాల ఉదాహరణలు చూపుతున్నాయి. మన రాష్ట్రం లోనే ప్రఖ్యాతమైన ఉదాహరణ చెప్పాలంటే ప్రకాశం జిల్లా కారంచేడు గ్రామంలో ఉత్పత్తి సాధనాలు అసాధారణంగా అభివృద్ధిచెందాయి. పంటకాల్వలు, వ్యవసాయంలో ట్రాక్టర్లు, కోత యంత్రాలు వంటి పరికరాళు, రైస్‌మిల్లులు వచ్చి వ్యవసాయంలో మిగులు విపరీతంగా వచ్చింది. ఆ మిగులు గ్రామంలోకి వాహనాలను, ఆధునిక రవాణా సౌకర్యాలను, సమాచార సంబంధాలను తీసుకురావడం మాత్రమే కాదు, బయటికి వెళ్లి పట్టణాలలో సినిమా పరిశ్రమలోకి, ఇతర పరిశ్రమలోకి విస్తరించింది. అయినా, 1985లో ఆ గ్రామంలో అస్పృశ్యత అమలు కావడం మాత్రమే కాదు, ప్రశ్నించినందుకు అగ్రవర్ణాల వారు హత్యలు చేశారు. అంటే గ్రామీణాభివృద్ధి అనేది కేవలం ఉత్పత్తి సాధనాల అభివృద్ధి మాత్రమే కాదు, ప్రధానమైన ఉత్పత్తి శక్తిఅయిన మనుషుల ఆలోచనలలో, ఆచరణలలో అభివృద్ధికి, తద్వారా ఉత్పత్తి సంబంధాల అభివృద్ధికి దారి తీయాలి.

అయితే అభివృద్ధి అంటే ఏమిటి అనే ప్రశ్న మిగిలిపోతుంది. ఇంతకాలం సంఖ్యాత్మకంగా ఎక్కువ కావడమే, నిన్నలేని సౌకర్యం ఇవాళ ఉండడమే, నిన్న వాడని వస్తువు ఇవాళ వాడడమే అభివృద్ధి అని సాంప్రదాయిక నిర్వచనం ఉంది. కాని, సంఖ్యలో పెరుగుదల, కొత్త సౌకర్యాలు, కొత్త సరుకుల వాడకం దానికదిగా అభివృద్ధి అని చెప్పడానికి వీలులేదు. గుణాత్మకంగా, మనిషే ప్రధానంగా, మనిషి సృజనాత్మకత ప్రధానంగా, సామూహికత ప్రధానంగా ఉన్నప్పుడు సంఖ్యలో పెరుగుదల, కొత్త సౌకర్యాల అనుభవం, కొత్త సరుకుల అనుభవం మనిషిని ఉన్నతీకరిస్తుంది. తన వినియోగం, తన అవసరాలు తీరడం, తన సృజనాత్మకత పెరగడం మాత్రమే కాక, తన తోటి వారందరి అవసరాలు తీరడం, తోటి వారందరి సృజనాత్మకత పెరగడం జరగాలని ప్రతి మనిషీ కోరుకున్నప్పుడే అది సమాజం అభివృద్ధికి చిహ్నం అవుతుంది. 'ఒక్కరి కోసం అందరు నిలిచి, అందరి కోసం ఒక్కరు నిలిచి' అనే భావన సామాజిక అభివృద్ధికి ఒక మౌలిక షరతు. ఆ షరతు మీద మనుషులందరికీ కనీస అవసరాలైన కూడు, గూడు, గుడ్డ తీరడం, వాటితోపాటు ఆరోగ్య, విద్యా, వైజ్ఞానిక, వినోద అవసరాలు తీరడం, శ్రమ శిక్షగానో, ఇబ్బందికరంగానో కాక, సామాజిక అవసరం కోసం ఆనందంగా చేయడం జరిగే స్థితిని అభివృద్ధి అనాలి.

దేశంలో ఇప్పటివరకు అమలైన డజన్ల కొద్దీ గ్రామీణాభివృద్ధి పథకాలు, గ్రామాల సమస్య ప్రధానంగా పేదరికం, దున్నేవారికి భూమిలేకపోవడం అని సరిగానే గుర్తించాయి. కాని ఆ సమస్యలను తీర్చే పనులను మాత్రం సక్రమంగా చేయలేకపోయాయి. అందువల్ల అనేక దారిద్ర్య నిర్మూలనా పథకాలు, చిన్న, సన్నకారు రైతుల అభివృద్ధి పథకాలు, వ్యవసాయ కార్మికుల అభివృద్ధి పథకాలు, కరువు పీడిత ప్రాంతాల పథకాలు, గ్రామీణ ఉపాధి కల్పనా పథకాలు, పనికి ఆహార పథకాలు, సాగునీటి - తాగునీటి పథకాలు, రహదారుల పథకాలు, విద్యా-వైద్య సదుపాయాల కల్పనా పథకాలు అన్ని కూడా గ్రామీణాభివృద్ధి పథకాలుగా మిగిలిపోయాయి గాని గ్రామీణాభివృద్ధిని సాధించలేకపోయాయి. ఈ నేపథ్యంలో ప్రపంచీకరణ తరువాత అసలు గ్రామీణాభివృద్ధి అనేదే బహుళజాతి సంస్థలకు ముడి సరుకులు సంపాదించి పెట్టే, బహుళజాతి సంస్థల సరుకుల అమ్మకాలకు మార్కెట్ ఇచ్చే ప్రాంతాలుగా మారిపోయి, ఈ రెండు దశాబ్దాలలో 'ప్రధానమంత్రి గ్రామ్ సడక్ యోజన', 'సంపూర్ణ గ్రామీణ రోజ్‌గార్ యోజన', 'స్వర్ణజయంతి గ్రామ్ స్వరోజ్‌గార్ యోజన', 'వాటర్ షెడ్ పథకాలు' వంటి సరుకుల మీద, సరుకుల రవాణామీద, సరుకుల కొనుగోలుకు అవసరమైన ఏర్పాట్ల మీద దృష్టి ఉన్న పథకాలే వచ్చాయి తప్ప గ్రామీణ మానవ సంబంధాల అభివృద్ధి కాదుగదా గ్రామీణ ఉత్పత్తి సాధనాల అభివృద్ధి కూడా వెనకపట్టు పట్టింది. ◆

హైదరాబాద్‌లో డిసెంబర్ 16న 'వ్యవసాయ సంక్షోభం - రైతుల ఆత్మహత్యలు' అన్న అంశంపై పాలగుమ్మి సాయినాథ్ చేసిన ప్రసంగానికి **మాడభూషి శ్రీధర్** ఇచ్చిన వ్యాసరూపం

# రైతుల ఆత్మహత్యలకు కారకులెవరు?

**భూ**సంస్కరణలు జరపకుండా రైతాంగ సమస్యలు తీర్చడానికి ఏం చేసినా అవి కన్నీటి తుడుపు చర్యలే అవుతాయి. రైతాంగ సంక్షోభం మీద పరిశోధనలు, పరిశీలనలు జరపడానికి చాలా కమిటీలు వేశారు. నరేంద్ర జాధవ్ కమిటీ మరొకటి. ఇందులో సబ్ కమిటీలు కూడా ఉంటాయట. ఈ సమస్య మీద కమిటీలు ఎక్కువ, రైతులు తక్కువ అయ్యేట్టు ఉంది.

నవంబర్ 27, 2007న యుఎన్ మానవ అభివృద్ధి సూచిక (హ్యూమన్ డెవలప్‌మెంట్ ఇండెక్స్) లో ర్యాంకింగ్‌లు ప్రకటించింది. బిలియనీర్లు (100 కోట్ల డాలర్లు మించిన ఆస్తి గలవారు) ఎక్కువ మంది ఉన్న దేశాల్లో భారత్ స్థానం నాలుగోది అని ఆ రిపోర్ట్ చెప్తున్నది. అమెరికాలో అత్యధికంగా బిలియనీర్లుంటే జర్మనీలో 55, రష్యాలో 53 భారత్‌లో 40 మంది ఉన్నారట. మరోవైపు, నిరక్షరాస్యత, శిశు మరణాలవంటి దారుణమైన పరిస్థితులలో భారత్ స్థానం 177 దేశాలలో 128. అంటే అట్టడుగు 50 దేశాల్లో భారత్ నిలబడింది. మనమీద ఉన్న దేశాలేవో తెలుసా? ఎల్ సాల్వడార్, నికరాగువా, బొలీవియా, గ్వాటమాలా, గబాన్, బొట్సవానా, ఆసియాలో వియత్నాం, నిరంతర హింసాజ్వాలల్లో రగులుతున్న పాలస్తీనా కూడా మనదేశంపైనే ఉంది. ఇంకా దళితుల జీవన స్థితిని ప్రత్యేకంగా లెక్కిస్తే మన ర్యాంక్ అట్టడుగు 25 దేశాల్లో పడిపోయేది. గతసారి మన ర్యాంక్ 126 ఇప్పుడు దిగజారి 128కి వచ్చిందంటే అంతగా దిగజారుదేమీలేదని, పోయినసారి తొందరలో తుది అంకెలు ఇవ్వలేకపోయామని ప్రభుత్వం వివరణ ఇచ్చింది. అంటే తుది అంకెలు వచ్చి ఉంటే మన ర్యాంక్ పోయినసారే 128 ఉండేదన్నమాట.

అక్టోబర్ 2007లో ప్రపంచ ఆకలి సూచికను ప్రకటించారు. అందులో మన దేశానికి 94వ ర్యాంక్ వచ్చింది. మన కన్న ఇథియోపియా ముందుందంటే మనం ఆకలిని సరిగా ఎదిరించలేకపోయామన్నమాట. ప్రతి వెయ్యి సజీవ శిశువుల్లో 97 మంది భారత్‌లో మరణిస్తున్నారు. ఛాద్ అనే చిన్న దేశంలో కూడా ఇదే సంఖ్యలో శిశుమరణాలు సంభవిస్తున్నాయి. అభివృద్ధిరేటు అని చెప్పుకుంటున్నాం, నిజానికి క్యాన్సర్‌కు విపరీతమయిన పెరుగుదల రేటు ఉంటుంది. అదీ పెరుగుదలేనా?

పట్టణాల్లో పైనుంచి 20 శాతం, గ్రామాల్లో 15 శాతం మంది కలలో కూడా ఊహించలేని సుఖాలు అనుభవిస్తున్నారు. గ్రామాల్లో కిందినుంచి 20 శాతం మంది కలలో కూడా ఊహించలేని కష్టాలు అనుభవిస్తున్నారు.

2007 అక్టోబర్ 8న టైమ్స్ ఆఫ్ ఇండియా భారత్‌లో 10 మంది సంపన్నులు మూడ్నెల్లలో సంపాదించిన సొమ్ము వివరాలు ఆశ్చర్యకరంగా ప్రచురించింది. జూలై, ఆగస్ట్, సెప్టెంబర్‌లో ముకేష్ అంబానీ నిమిషానికి 45 లక్షల రూపాయలు సంపాదించారట. అంటే అరగంటలో 12 కోట్లు సంపాదించారు. మహారాష్ట్రలో వ్యవసాయ పనులు చేసేవారి రోజు కూలీ నలభై సంవత్సరాలలో నలభై రూపాయలకు పెరగలేదు. ప్రతి అరగంటకు మహారాష్ట్రలో ఒక రైతు ఆత్మహత్య చేసుకుంటున్నాడు. 1995-2007 మధ్య 36 వేల మంది రైతులు ఆత్మహత్య చేసుకున్నారు. ఏ రాష్ట్రంలోనూ ఇంతమంది రైతులు ఆత్మహత్య చేసుకోలేదు. 1997 నుంచి 2006 వరకు ఆంధ్రప్రదేశ్‌లో 19,800 మంది రైతులు ప్రాణం తీసుకున్నారు. 2004 తరువాత ఆత్మహత్యలు తగ్గాయి. దానికి కారణం రాష్ట్ర ప్రభుత్వం రైతాంగం కోసం కొన్ని నిజంగా మంచి పనులు చేసింది. కాని ఆ తరువాత ఆత్మహత్యలు పెరిగాయి. 1997లో 1,097 ఆంధ్ర రైతులు, 2000 లో 1,526, 2003లో 1,800, 2004లో 2,666 మంది ఆత్మహత్యలు చేసుకున్నారు. ఇవన్నీ జాతీయ క్రైం రికార్డ్స్ బ్యూరో ఇచ్చిన అంకెలు. మనదేశంలో లక్షా యాభై వేల మంది రైతులు 1997-2005 మధ్యకాలంలో ఆత్మహత్య చేసుకున్నారంటూ వ్యవసాయ శాఖ మంత్రి శరద్‌పవార్ (మహారాష్ట్రలో ఆయనను క్రికెట్ మంత్రి అంటారు) కూడా ఈ అంకెలను ధృవీకరించారు. ఆంధ్రలో ఆ తరువాత ఆత్మహత్యలు 117 పెరిగాయి. మహారాష్ట్రలో 525 ఆత్మహత్యలు పెరిగాయి. ఇదివరకు దేశంలో జరిగిన అన్ని ఆత్మహత్యల్లో రైతుల ఆత్మహత్యలు 25 శాతం ఉంటే, ఇప్పుడు రైతు చావుల శాతం 50కి చేరింది. అంటే ఈ దేశంలో నిరాశ భారాన్ని ఎక్కువగా బక్క రైతులే భరిస్తున్నారన్నమాట. మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్, కర్నాటక, మధ్యప్రదేశ్ (ఛత్తీస్‌ఘడ్‌తోసహా)లలో తీవ్రమయిన సంక్షోభం ఉంది. మూడింట రెండు వంతుల ఆత్మహత్యలు (64 శాతం) ఈ నాలుగు పెద్ద రాష్ట్రాల్లోనే జరిగాయి. కేరళలో కూడా ఆత్మహత్యలు పెరుగుతున్నాయి. ఈ రాష్ట్రాల్లో కనిపించే ఉమ్మడి కారణం ఏమంటే వాణిజ్య పంటలు వేయడమే. మనం ఇంకా రైతులు వాణిజ్య పంటలు వేయాలనే ప్రోత్సహిస్తున్నాం. ఈ నాలుగు రాష్ట్రాల్లో రైతులు కానివారి ఆత్మహత్యలు 23 శాతం పెరిగితే, రైతుల్లో 52 శాతం పెరిగింది.

మరోకారణం రుణభారం. మంత్రి చిదంబరం గారు రైతులు షావుకార్లవంటి ప్రైవేట్ వడ్డీ వ్యాపారుల దగ్గర అప్పులు చేయవద్దని సలహా ఇచ్చారు. కాని గ్రామీణ ప్రాంతాల్లో మొత్తం 4500 బ్యాంకులు మూసి వేశారు. 1997-2000లో ఆత్మహత్యలు సగటున ఏడాదికి 15,300 అయితే 2001 తరువాత ఆ సగటు 17 వేలకు పెరిగింది. ఆంధ్రప్రదేశ్‌లో రైతుల ఆత్మహత్యల సగటు పెరుగుదల దారుణంగా 127 శాతం ఉంది. మహారాష్ట్రలో 105 శాతం. మిగతా రాష్ట్రాల కన్న ఆంధ్రప్రదేశ్‌లో 70 శాతం ఎక్కువైతే, మహారాష్ట్రలో 100 శాతం ఎక్కువగా ఆత్మహత్యల పెరుగుదల రేటు ఉంది. ఈ కాలంలోనే వ్యవసాయ ఉత్పత్తులపై క్వాలిటేటివ్ పరిమితులను ప్రభుత్వం తొలిగించింది. పది లక్షల టన్నుల గోధుమలు చైనానుంచి దిగుమతి అవుతాయని భయపెట్టారు. రైతులు తక్కువ ధరకు భయపడి అమ్ముకున్నారు. తరువాత చైనా నుంచి ఒక్క గింజ కూడా రాలేదు. ధాన్యం రైతుల చేతుల్లోంచి వర్తకుల చేతులలోకి వెళ్లిన తరువాత ధర పెరిగింది. 1991 జనాభా లెక్కల ప్రకారం 111 మిలియన్ల రైతులు దేశంలో ఉంటే 2001 నాటికి వారి సంఖ్య 103 మిలియన్లకు తగ్గింది. అంటే 80 లక్షల మంది రైతులు వ్యవసాయాన్ని వదిలేసారన్నమాట.

విదర్భ ఆరు జిల్లాల్లో పదహారు వేల మంది రైతులు ఆత్మహత్య చేసుకున్నారు. అయితే నిజంగా ఆత్మహత్య చేసుకున్న రైతులు రెండు వేలే అని అధికారిక లెక్కలు తయారు చేసారు. వారి లెక్క ఈ విధంగా ఉంటుంది. ముందు రైతుల ఆత్మహత్యలు ఒక పట్టికలో వేస్తారు. తరువాత పట్టికలో రైతు బంధువుల ఆత్మహత్యలు వేరుచేస్తారు. (అంటే రైతు బంధువులు రైతులు కాదన్నమాట). తరువాత పరిశోధించిన ఆత్మహత్యలు పట్టికలో ఇంకో వరస. ఆ తరువాత రైతులవి కావని తేల్చినవి. ఇక చివరి కాలం మరీ విచిత్రమైంది. నేను నా జీవితంలో ఇటువంటి లెక్క చూడలేదు. అది అర్హులైన రైతుల ఆత్మహత్యలట. అంటే నష్టపరిహారానికి అర్హులైన వారని భావం. చివరికి నష్టపరిహారం ఇచ్చింది. 2000 మందికే కనుక ఆత్మహత్యల సంఖ్య అధికారికంగా 16వేల నుంచి రెండువేలకు పడిపోయింది. పత్రికలు కూడా ఈ అధికార లెక్కల నిజాయితీని ప్రశంసిస్తాయి.

లక్షా యాభై వేల మంది రైతులు ఈ దేశంలో ఆత్మహత్య చేసుకున్నారని ఒక కేంద్ర మంత్రి చేసిన అధికారిక ప్రకటనకు మన మీడియా ఇచ్చిన రిపోర్టింగ్ స్థలం ఎంత? సింగిల్ కాలం నాలుగైదు అంగుళాల పొడువు కూడా లేదు. (కటింగ్ చూపిస్తూ) ఈ భూగోళంలోనే ఇన్ని ఆత్మహత్యలు ఇదివరకు జరిగి ఉండవు. అయినా అది పత్రికలకు చిన్న వార్త. మూడు సంవత్సరాలు సరైన వర్షపాతం ఉన్నా, చెరువులు, జలాశయాలు నిండినా రైతులు ఎందుకు ఎక్కువమంది చనిపోతున్నారు? మరోవైపు ఆంధ్రప్రదేశ్‌లో అభివృద్ధిరేటు 7.6 శాతానికి పెరిగిందంటు న్నారు. రైతుల ఆత్మహత్యలు ఆంధ్రప్రదేశ్‌లో రాబోయే పదేళ్లలో రెట్టింపు అయ్యే అవకాశం ఉంది. మహారాష్ట్రలో అయితే ఏడేళ్లలోనే.

విదర్భ జిల్లాల్లో ప్రతి ఇంటికీ వెళ్లి పది వేల మంది దర్యాప్తు జరిపారు. 17 లక్షల ఇళ్లకు వెళ్లి ఆరా తీసారు. అతి పెద్ద సర్వే చేసి నివేదిక ఇచ్చారు. 70 లక్షల మంది రైతులు నిరాశలో ఉన్నారని వారిలో 20 లక్షల మంది తీవ్రమయిన నిస్పృలో ఉన్నారని తేల్చారు. మహారాష్ట్ర ప్రభుత్వ వెబ్‌సైట్‌లో ఆ నివేదిక ఉంది, కాని అసెంబ్లీలో దాన్ని చర్చించరు. ప్రభుత్వం ఈ ఆత్మహత్యలకు కారణం తాగుడు అని చెప్పింది. అలా అయితే ఈ దేశంలో సగం జనాభా ఖతం అయిపోవాలి. నష్టపరిహారం కోసం ఆత్మహత్య చేసుకుంటున్నారని మరో వాదం. ఇంత కన్న దారుణమయిన క్రూరమయిన వాదం మరొకటి లేదు. 1998-2004లో నష్టపరిహారం ఇవ్వలేదు. ఆ కాలంలోనే అత్యధిక ఆత్మహత్యలు జరిగాయి. ఇంకొక కారణం పిచ్చని కూడా అన్నారు. నిరాశ చెందడం పిచ్చే కదా మరి. ఇక చివరగా టివి పత్రికల్లో రాయడం వల్ల అది చూసి ఆత్మహత్యలు చేసుకున్నారని సర్కార్ వారు చెప్పడం మరో వింత. లక్షా యాభై వేలమంది ఆత్మహత్యలు చేసుకున్నారని వార్త రాస్తే ఆ చిన్న వార్త చదివి మరికొందరు రైతులు ఆత్మహత్య చేసుకున్నారనడం వింత. దేశం మొత్తం మీద ఆత్మహత్యల రేటు 15 నుంచి 16 శాతానికి పెరిగిందని, దీనికి అంత ఆందోళన ఎందుకని మరొక వాదం. మరి ఆంధ్రప్రదేశ్‌లో 127 శాతం పెరిగింది దానికి ఆందోళన చెందాలా వద్దా?

సామాజిక వ్యత్యాసాలు విపరీతంగా పెరిగిపోవడం ఈ ఆత్మహత్యలకు తొలి కారణం. జనాభా పెరుగుదల రేటుకన్న ఆహార ధాన్యాల ఉత్పత్తి రేటు తగ్గిపోవడం ద్వారా వ్యవసాయ సంక్షోభం ఏర్పడడం మరో కారణం. అయినా మనం గోధుమలు ఎగుమతి చేసాం. ఈ ప్రభుత్వమే కాదు, ఎన్.డి.ఎ. హయాంలో కూడా గోధుమలు ఎగుమతి చేసింది. దారిద్ర్యరేఖ కన్న దిగువవారికి ఇచ్చే ధరకు ఇరవై లక్షల టన్నుల గోధుమలు యూరప్‌కు పంపింది. అక్కడ పశువులకు గ్రాసం కోసం వారు ఇంత తక్కువ ధరకు కొన్నారు? . అంటే భారత దేశ పేద ప్రజలకు 'యూరప్‌లో ఆవులకు గేదెలకు సబ్సిడీ ఇస్తారన్నమాట. జావెండియర్‌ను ఒక టివి ఛానల్ ఇంటర్వ్యూ చేస్తూ భారత దేశ రైతుల కల ఏంటి అని అడిగితే ఆయన 'యూరప్‌లో ఆవుగా పుట్టడమే భారత రైతుల కల' అని జవాబిచ్చారు. రోజూ గేదెల కోసం అక్కడ మూడు డాలర్ల సబ్సిడీ అంటే 150 రూపాయల సబ్సిడీ ఇస్తారు. జాతీయ గ్రామీణ ఉపాధి హామీ పథకం కింద మన కూలీకి కనీసం 60 రూపాయలు దొరకకపోవచ్చు. మనం ఎంత దారుణమయిన స్థితిలో ఉన్నా, కూలీ ఎంత తక్కువ వచ్చినా జాతీయ గ్రామీణ ఉపాధి పథకం చాలా గొప్పది అని నా అభిప్రాయం. ఈ దేశానికి ఇది చాలా అవసరం. దేశ జనాభా పెరుగుదల రేటు 1.67 ఉంటే గ్రామాల్లో ఉపాధి రేటు 0.67 ఉంది.

ఇదివరకు మహారాష్ట్రలో చుట్టుపక్కల జిల్లాల నుంచి ముంబైకి వలసవచ్చిన కూలీలు జౌళి కర్మాగారాల్లో బట్టల మిల్లుల్లో, ఇతర ఫ్యాక్టరీల్లో పనిచేసేవారు. కాని ఇప్పుడు ఆ ఫ్యాక్టరీలేవీ లేవు. అక్కడ ఆకాశహర్మ్యాలు కడుతున్నారు. ఒక చదరపు అడుగు అక్కడ 48 వేల రూపాయలకు అమ్ముకుంటున్నారు. ఇది అమెరికా న్యూయార్క్ మాన్‌హటన్ కన్న ఎక్కువ రేటు. టోక్యోతో సమానం. జార్ఖండ్ నుంచి వచ్చిన రెండు లక్షలమంది ఆదివాసీ యువతులు ఢిల్లీలో ఇంటి పని మనుషులుగా పని చేస్తున్నారు. ఎంతో అవసరం ఉంటే తప్ప సొంత ఊరు వదలని ఆదివాసీ యువతులు ఇళ్లలో పనిచేస్తూ, లైంగిక వేధింపులకు గురవుతున్నారు. పరిస్థితి ఎంత దారుణంగా ఉందో గ్రామాల్లో ఉపాధి కొరత ఎంత ఘోరంగా ఉందో దీన్ని బట్టి తెలుసుకోవచ్చు.

గ్రామాల్లో బ్యాంకులు మూతపడడంతో పాటు, ఉన్న బ్యాంకులు

ఇచ్చే రుణాల శాతం పడిపోయిన తరువాత పల్లెల్లో రైతుల రుణభారం రెట్టింపు అయ్యింది. 26 శాతం నుంచి 2001 లో రుణభారం 48 శాతానికి పెరిగింది. ఆంధ్రప్రదేశ్‌లో మరీ ఎక్కువయింది. వ్యవసాయ పెట్టుబడుల ధరలు విపరీతంగా పెరిగాయి. పురుగు మందుల ధరలు నాలుగు వందల శాతం పెరిగాయి. విత్తనాలు కిలో 7 రూపాయలు ఉండేవి. కాని 450 గ్రాముల మోన్‌సాంటో విత్తనాల ధర 950 రూపాయలు. ఇదివరకు ఏటేటా విత్తనాలు కొనే పనిలేదు. ఇప్పుడు ప్రతిసారీ కొనాల్సిందే. ఎందుకంటే అది విత్తన కంపెనీల హక్కుకు సంబంధించిన అంశం. 1991లో ఎకరం పండించడానికి 2500 రూపాయలు ఖర్చయ్యేది. 2007లో 13,500 రూపాయలు ఖర్చు అవుతున్నది. కేరళలో ఒక ఎకరం వరి పండించడానికి ఎనిమిది వేలు ఖర్చయ్యేది. కాని ఎకరం వెనీలా పెంచడానికి లక్షా యాభై వేల రూపాయల ఖర్చు అవుతున్నది. శ్రీలంక వంటి పొరుగు దేశాలతో ఇష్టం వచ్చినట్టుగా భారత్ ఎడాపెడా ఫ్రీ ట్రేడ్ అగ్రిమెంట్లు కుదుర్చుకుంది. దిగుమతి పరిమితులు లేవు. అమెరికా కూడా తమ దేశపు వ్యవసాయ దారులను రక్షించుకోవడానికి దిగుమతి ఆంక్షలు విధించింది. సబ్సిడీలు ఇస్తోంది. మనం అన్ని రకాల సబ్సిడీలను ఉపసంహరించుకుంటున్నాం.

మహారాష్ట్ర పార్లమెంట్ ఎన్నికల్లో బిజెపి, శివసేన గెలిచిన తరువాత కొద్ది నెలలకే అసెంబ్లీ ఎన్నికలు వచ్చాయి. కాంగ్రెస్ వారు పత్తి మద్దతు ధరను 2200 నుంచి 2700 రూపాయలకు పెంచుతామని చేసిన ఒకే ఒక వాగ్దానంతో ఎన్నికల్లో గెలిచి అధికారం చేపట్టారు. కాని విలాస్‌రావ్ దేశ్‌ముఖ్ ముఖ్యమంత్రి అయిన తరువాత ఆ విషయం వదిలేసి పత్తి మద్దతు ధరను 2200 నుంచి 500లు తగ్గించి 1700 చేశారు. ఆత్మహత్యలు మూడురెట్లు పెరిగాయి. రైతాంగ సంక్షోభం ప్రకృతి వైపరిత్యం కాదు. మంత్రులే మన తెగులు తప్ప పంటలకు సోకింది తెగులు కాదు.

గ్రామాల్లో కొత్త రుణదాతలు పుట్టుకొచ్చారు. వారు వ్యవసాయ పెట్టుబడులకు సంబంధించిన డీలర్లు. విత్తనాలు, ఎరువులు, పురుగు మందులు ఇతర వ్యవసాయ అవసరాలకు రుణాలుగా ఇచ్చి ఎక్కువ వడ్డీ గుంజుతున్నారు. రాబోయే రోజుల్లో ఈ డీలర్లే ఎం.ఎల్.ఎ.లు అయినా ఆశ్చర్యం లేదు. వీరే కాక రైతులకు ఉపాధ్యాయులు సైతం రుణాలిస్తున్నారు. ఆలుమగలు టీచర్లుగా పనిచేస్తుంటే వచ్చే జీతం 35 వేలు దాకా ఉంటోంది. పల్లెటూర్లో అయిదు వేలతో జీవితం హాయిగా సాగుతుంది. మిగిలిన డబ్బును వడ్డీలకు తిప్పుతున్నారు. ప్రెసిడెంట్ మెడల్ పొందిన ఉత్తమ టీచర్ ఒకాయన అకోలాలో వడ్డీ వ్యాపారిగా ఎదిగాడంటే పరిస్థితి ఏ విధంగా ఉందో తెలుస్తుంది. ఇదంతా బహుళజాతి సంస్థలకు వ్యవసాయాన్ని ధారాదత్తం చేయడానికి సాగుతున్న కుట్ర. 20వ శతాబ్దంలో అమెరికా తీవ్ర సంక్షోభంలోకి కూరుకు పోయింది. 6 మిలియన్ల వ్యవసాయ కమతాలు ఉండేవి. అవి ఇప్పుడు రెండు శాతం కన్న తక్కువైనాయి. అమెరికాలో 2.1 మిలియన్ల (21 లక్షల) ఖైదీలు జైల్లో ఉంటే రైతుల సంఖ్య ఏడు లక్షలే.

ఆస్ట్రేలియా వీట్ బోర్డ్ నుంచి మనం గోధుమలు దిగుమతి చేసుకున్నాం. పంజాబ్‌తో సహా అనేక ఆసియా దేశాల నుంచి ఆస్ట్రేలియా వీట్ బోర్డ్ గోధుమలు కొనుక్కుంది. అంటే తిరిగి మన పంజాబ్ గోధుమలే మనకు అమ్మినా అమ్మి ఉండవచ్చు. మన ఎగుమతి, దిగుమతులు అంత దారుణంగా ఉన్నాయన్నమాట. తక్కువ ధరకు అమ్మి అవే గోధుమలు ఎక్కువ ధరకు కొనడం మన విధానం.

మన వ్యవసాయ విధానం కూడా ఇప్పుడు ఖరీదైన మాడల్‌గా మారింది. విపరీతమయిన నీరు అవసరం, పురుగుమందు విపరీతంగా చల్లుతాం. ఎరువులు కూడా తీవ్రంగా కురిపిస్తాం. పురుగుమందు చల్లడం వల్ల కూడా జనం చనిపోతున్నారు. చివరకు ఆత్మహత్యలకు కూడా పురుగు మందులే వాడుతున్నారు. ఆంధ్రప్రదేశ్ పురుగుమందు వాడడంలో అగ్రస్థానంలో ఉంది. జాతీయ సగటు కన్న 2.5 టన్నులు ఇక్కడ ఎక్కువ వాడుతున్నారు.

పేదలకు అవసరమయిన రంగాలనుంచి కూడా ప్రభుత్వం ఉపసంహరించుకోవడం సంక్షేమ నిధులను తీవ్రంగా తగ్గించడం అసలు కారణాలు. 1991లో జిడిపిలో 14 శాతం గ్రామాల పెట్టుబడులకు నిధులు కేటాయిస్తే, 2005లో 5.9 శాతానికి తగ్గిపోయింది. 30 వేల కోట్ల రూపాయలు తక్కువ చేసారు. వీటితోపాటు కార్పొరేట్ల ఆర్థిక బలాన్ని పెంచిపోషించడం మరో కారణం. పెద్ద పెద్ద కార్పొరేట్లకు భూమి, పవర్, పన్నులు ఇతరత్రా అనేక సబ్సిడీలు ఇస్తున్నది. రైతుకు అయిదు వందల రూపాయల మద్దతు ధర ఇవ్వరు కానీ ఇన్ఫోసిస్ వంటి సంస్థలకు వందల కోట్ల సబ్సిడీలు గుమ్మరిస్తున్నారు.

నీటిని కూడా ప్రైవేటీకరిస్తున్నారు. ఛత్తీస్‌గఢ్‌లో 23 కిలోమీటర్ల శివనాథ్ నదిని ప్రైవేటీకరించారు. అన్నీ ప్రైవేటీకరించే ధోరణిలో తాజా ఉదాహరణ – ముంబై రైల్వే స్టేషన్‌లలో బూట్లు పాలిష్ చేసుకునేవారి స్థలాన్ని కూడా ప్రైవేటీకరించడమే.

ఒక అమెరికా కాలమిస్టు పాల్ క్రగ్మన్ అమెరికాలో వ్యత్యాసాల అగాధాన్ని వివరిస్తూ కార్పొరేట్ జీతాలను ఉదహరించారు. పెద్ద కంపెనీలో సి.ఇ.ఓ. జీతానికి అక్కడే కింది స్థాయి కూలీకి జీతాల్లో 1000-1 తేడా ఉందన్నారు. అదే అంకెను మనం ఇక్కడి పరిస్థితులకు అన్వయిస్తే సి.ఇ.ఓ.కు రైతుకూలీకి మధ్య 32000-1, సి.ఇ.ఓ.కు రైతు మహిళా కూలీకి 35000-1 తేడా ఉందని తెలుతోంది.

ప్రైవేటీకరణమీద పోరాటం, ప్రపంచీకరణ మీద ఉద్యమం ఎక్కడో జరగవు. ఇక్కడే స్థానికంగా జరుగుతాయి. జరుగుతున్నాయి కూడా. ఉరుగ్వేలో 30 లక్షల మంది ప్రజలు రెఫరెండంలో నీటిని ఎన్నటికీ ప్రైవేటీకరించకూడదని ఘంటాపథంగా చెప్పారు. పట్టణ ప్రజలకు ఇంటి స్థలాల కోసం గ్రామాల్లో భూమి హక్కు కోసం సాగుతున్న ఉద్యమాలు అభినందనీయం. పవర్ కోసం ఆంధ్రప్రదేశ్‌లో జరిగిన పోరాటం, ప్రపంచవ్యాప్తంగా అనేక దేశాల్లో జరుగుతున్న ఉద్యమాలు, తారుమారైన ఎన్నికల ఫలితాలు గ్లోబలైజేషన్ మీద లోకల్ పోరాటాలకు ఉదాహరణలు.

ఆంధ్రప్రదేశ్‌లో గ్రామీణ ప్రజల జీవితాల గురించి, సమస్యల గురించి జర్నలిస్టులు అద్భుతంగా వార్తలు, పరిశోధనలు రాస్తున్నారు. నేను వారి నుంచి నేర్చుకున్నాను. విదర్భలో కూడా స్థానిక జర్నలిస్టులు అద్భుతంగా రాస్తున్నారు. పేద ప్రజల కోసం పనిచేసిన తెలుగు పాత్రికేయుడికి ప్రతి ఏటా ఇరవై ఐదు వేల రూపాయల నగదు బహుమతి ఇవ్వదలచుకున్నానని ఈ సభా ముఖంగా పాలగుమ్మి సాయినాథ్ ప్రకటించారు. ◆

చెంచుల జీవితంపై చేపట్టిన అధ్యయనం వారి నిజ జీవిత స్థితిగతుల వివరణగానూ, వాటిమీద ఆధారపడి సాగే అన్వేషణగానూ ముందుకు సాగుతుందంటూ చెంచుల జీవన స్థితిగుతుల్ని మన ముందుంచుతున్నారు **పాణి**

# చెంచుల జీవన స్థితిగతులు సామాజిక మూలాల అన్వేషణ

ఆంధ్రప్రదేశ్‌లోని ఆదివాసుల్లో చెంచులు ఒక ఆదిమతెగ. నల్లమల అడవులకు పరిమితమైన చెంచులది విలక్షణ జీవనవిధానం. ఇవ్వాల్టికీ ఆహారసేకరణ, వేట ప్రధాన జీవన మార్గాలుగా ఉన్న చెంచుల సామాజిక మూలాల అన్వేషణే ఈ అధ్యయనం.

వలస పాలన కాలంలో ప్రారంభమైన సామాజిక శాస్త్ర, మానవశాస్త్ర పరిశోధనలు భారతదేశంలోని ఆదివాసుల గురించి అనేక విషయాలను వెలుగులోకి తెచ్చాయి. అవి ఈ దేశ సామాజిక, చారిత్రకదశలను అర్థం చేసుకోవడానికీ గొప్పగా ఉపయోగపడ్డాయి. హైమన్‌డార్ఫ్, వెన్నెలకంటి రాఘవయ్య లాంటి వాళ్లు చెంచుల గురించి, చెంచుల నుండి విడిపోయి సొంత అస్తిత్వంలోకి వచ్చిన యానాదుల గురించి మొదటిసారిగా సామాజిక పరిశీలనలు అందించారు. ఆ తర్వాత చెంచుల గురించి సాగిన అధ్యయనాలకు వారి నిర్ధారణలు ప్రాతిపదికలవుతూ వచ్చాయి. ఈ అవగాహనల కొనసాగింపుగా చెంచుల సామాజిక మూలాల గురించి యింకొన్ని కొత్త ఆలోచనలేమైనా చేయవచ్చునా అనే ప్రయత్నమే యిది.

ఈ అధ్యయనం చెంచుల నిజజీవిత స్థితిగతుల వివరణగా, వాటిమీద ఆధారపడి సాగే అన్వేషణగా ముందుకు సాగుతుంది. ఒకరకంగా చెప్పాలంటే రెండు మార్గాలుగా సాగుతూ, ఒకదాని నుండి మరొకటి లోతయిన పరిశీలనలకు చేరుకోవాలనే ఉద్దేశ్యం. ఆదిమతెగల జీవితంలోని నిగూఢతను ఛేదించి, సాకల్యంగా అర్థంచేసుకోవడం అయ్యేపనికాదు. భౌతిక జీవిత వాస్తవికతగా వ్యక్తంగాని ఆవరణ ఆదివాసుల్లో ఎక్కువగా ఉంటుంది. సామాజికశాస్త్ర పరికరాలతో అర్థంచేసుకున్న దాని గురించి ఏ మీమాంస లేకపోతే అనవసరమైన ఆలోచనా చట్రాలకు బలైపోయే ప్రమాదం ఏర్పడుతుంది. అందువల్ల చెంచుల జీవన వాస్తవికతను సూచించే ఆర్థిక, నైతిక, సాంస్కృతిక అంశాలను వివరించుకుంటూ పోవడం, వాటికి చారిత్రక, సామాజిక మూలాల్లో ఎన్నెన్ని కారణాలు, అవకాశాలు ఉండగలవో అన్వేషణ సాగించడం అవసరం. ఈ ప్రయత్నానికి ఇప్పటికే జరిగిన పరిశోధనలను, వెలువడిన సాహిత్యాన్ని ప్రస్తావనలుగా, ఉటంకింపులుగా స్వీకరించడం కంటే ప్రేరణగా భావించడమే ఉచితం. ఈదృష్ట్యా కలిగిన అవగాహనల నుండి, చెంచుల జీవిత వాస్తవికత నుండి, ఉదాహరణ పూర్వకంగా రెండు మూడు గూడేల క్షేత్ర పరిశీలనల నుండి సాగే ఈ అన్వేషణలో యిప్పటికిప్పుడే సూత్రీకరణలు చేయడం కంటే నికరమైన నిర్ధారణలకు చేరుకోవడానికి ఒకానొక మార్గాన్ని వెతకడమే సబబు అనిపించింది.

సంవిధానంలోనే ఉన్న ఈ పరిమితికి కారణం – ఆలోచనాత్మక సంభాషణలో పాలుపంచుకోవలసిన భిన్న కంఠస్వరాల అవసరాన్ని గుర్తించడమే. నిజానికి ఈ వ్యాసం సంక్షిప్తరూపం మాత్రమే. యిందులో విస్తరించవలసిన భావాలు చాలా ఉన్నాయి. మరీ అత్యవసరం అయిన ఉటంకింపులు, వివరణలు, క్షేత్రనివేదికలు భాగం కావలసి ఉన్నాయి.

## 1. సరళత – సంక్లిష్టత

చెంచుల గురించి ఆలోచిస్తున్నప్పుడు – మానవజీవితంలోని సరళత, సంక్లిష్టత అనే భావనలను ఎలా అర్థం చేసుకోవాలి అనే ప్రశ్న తలెత్తింది. ఈ ప్రశ్నకూ – చెంచుల జీవనమూలాల అన్వేషణకూ నేరుగా సంబంధం లేకపోయినా పరోక్షంగా ఈ ప్రశ్న ఏదో సాయం చేసినట్టయింది. ఆధునిక జీవితం సంక్లిష్టమనీ, సంకీర్ణమనీ అంటుంటాం. యిది వాస్తవమే అయినా, తరచూ వ్యక్తరూపాల ఆధారంగా అలవోకగా ఈ నుడికారం చెలామణిలోకి వస్తుంది. ఆధునిక జీవితంలోని వేగం, విపరీత ప్రభావాలు చూపే అనేక అంశాల గజిబిజి అల్లిక, వాటి మధ్య తలెత్తే అసంబద్ధత వగైరాలను 'సంక్లిష్టత' ప్రతిబింబిస్తూ ఉంటుంది. దీన్ని ఉత్పత్తి వైపు నుండి చూడాలి. జీవితంలో కనిపించే సంక్లిష్టతకు కారణం ఉత్పత్తి విధానమే. ఆదివాసీ సమాజంలో ఉత్పత్తి గురించి ప్రజలకు తెలుస్తుంది. ఉత్పత్తిలో మిగులు ఏర్పడే క్రమంలో దానిమీద ఒక వర్గానికి అధికారం దొరకడం వల్ల, దానికి సంబంధించిన భావజాలం వ్యాపించడం వల్ల ఉత్పత్తి గురించి గతంలోవలె స్పష్టత ఉండదు. దానికి తోడు మార్కెట్ నిర్వహించే పాత్రవల్ల సంక్లిష్టత ఏర్పడుతుంది. ఉత్పత్తిలో మిగులు, దానిమీద అధికారం సంపాదించుకొనే సామాజిక వర్గం మారే క్రమంలో గత వ్యవస్థలతో తెగతెంపులు జరిగి చరిత్ర పురోగమిస్తూ వచ్చింది. అట్లా గతంతో తెగతెంపులు చేసుకొని ఆధునికత మానవజాతిని కొత్తయుగ స్వభావంలోకి నడిపించింది.

మానవ సమాజంలో ఈ తెగతెంపులు జరగని సముదాయాలు

కూడా ఉన్నాయి. ఆదిమ దశ నుండి జీవనయానాన్ని ప్రారంభించి, అనేక దశలను దాటుకుంటూ, అనుభవ జ్ఞానంలోని సంఘర్షణ ద్వారా నాగరికదశలోకి ఎదిగిన సమాజం ఒకపక్క, దీనికి భిన్నమైన సమాజం యింకోపక్క ఉన్నాయి. ఆదిమదశ నుండి అనేక మార్గాల ద్వారా సాగిన ప్రయాణమే ఈ తేడాకు ముఖ్యకారణం. ఆదివాసీ తెగల జీవన స్థితిగతుల గురించి అనేక పరిశోధనలు జరిగాక, ఒక్కో తెగకున్న సామాజిక ఆర్థిక సాంస్కృతిక ప్రత్యేకతల రీత్యా కొన్నిటిని 'ప్రిమిటివ్‌ట్రైబ్స్'గా గుర్తించారు. చిన్నచిన్న పోలికలు తప్ప మిగతా ఆదివాసులకంటే వీరి చారిత్రక ప్రయాణం విభిన్నమైనది. నల్లమలలోని చెంచులను యిలాంటి విభిన్నమైన తెగగా చెప్పుకోవచ్చు.

మామూలుగా ఆదివాసుల జీవితం సరళమైందనే అవగాహన ఉన్నది. ఆహారసేకరణ, వేట జీవనోపాధిగా ఉన్న చెంచుల జీవితం పైకి చూడ్డానికి చాలా సరళంగా కనిపిస్తుంది. దగ్గరిగా చూచేకొద్దీ సరళత వెనుక సంక్లిష్టత దాగి ఉన్నదా అనిపిస్తుంది. ఆధునికత వల్ల ప్రవేశించిన సంక్లిష్టతకూ దీనికీ పోలికలేకపోయినా, ఇవ్వాల్టి వాళ్ల జీవన సంస్కృతిలో, చరిత్ర సంబంధమైన విషయాల్లో చప్పున సాధారణీకరణకు లొంగని ప్రత్యేకతలు, వైవిధ్యాలు, వ్యక్తీకరణలు ఉన్నాయి. జీవితంలోని సరళతను వివరించినంతగా సంక్లిష్టతను వివరించలేమనే అభిప్రాయం ఉన్నది. ఉత్పత్తిలో, ఉత్పత్తి సంబంధాల్లోని సంక్లిష్టతను ఛేదించినపుడు జీవితంలోని సంక్లిష్టత అర్థమవుతుంది. ఆధునిక దృష్టితో చూసినపుడు ఆహారసేకరణ, వేట జీవనోపాధిగా ఉన్న తెగలది చాలా సరళమైన జీవితం అనుకుంటాం. కాని చెంచుల జీవితంలో వివరించడానికి వీలుగాని సరళత ఉన్నది కావచ్చు. సరళతను వివరించడంలో ఉండే సంక్లిష్టత అది. అంటే సరళత, సంక్లిష్టతలకు ఇప్పటిదాకా నిర్ధారితమైన నిర్వచనాలను సైతం తరచి చూసుకోవలసి ఉంటుంది.

దీన్నే ఇంకో వైపు నుండి చూడవచ్చు.

చెంచులది ఆదిమ సహజత్వం. మిగులు ఏర్పడే క్రమంలోని మార్మికత వాళ్లను ఆవరించలేదు. అంటే వర్గసమాజంలోని వ్యవస్థలు, భావజాలాలు చెంచు గూడాల్లోకి చేరకపోవడం వల్ల లేదా చెంచు సమాజమే ఆ దశకు మారకపోవడంవల్ల ఆదిమ సహజత్వం మిగిలి ఉన్నది. సాధారణీకరణకు లొంగని ప్రత్యేకతలు, వైవిధ్యాలు కూడా ఈ సహజత్వంలో భాగం కావచ్చు. ఈ దృష్టికోణంలో అవతలివైపు నుండి చూస్తే సహజత్వానికి బయటి వ్యవస్థల ప్రభావాలు తోడుకావడం వల్ల సరళమా, సంక్లిష్టమా అని తేల్చుకోలేని, వివరించలేని స్థితి వచ్చి ఉండవచ్చు. సరళత - సంక్లిష్టత అనే భావన చెంచుల జీవితపు పొరల్లో అన్వేషణ సాగించడానికి, వాటి ప్రత్యేకతల మీద కేంద్రీకరించడానికి పురికొలుపుతుంది.

## 2. భౌగోళికం

రాష్ట్రంలో తక్కువ జనాభాగల ఆదివాసుల్లో చెంచుతెగ ఒకటి. అయిదుజిల్లాల కిందికి వచ్చే విశాల అటవీ ప్రాంతంలో కృష్ణానదికి ఇరువైపుల అక్కడక్కడ చెంచుగూడాలు, పెంటలు ఉన్నాయి. జీవన ప్రమాణాల్లో, ఆచారవ్యవహారాల్లో ఒక గూడానికి మరో గూడానికి మధ్య, ఒక జిల్లాకు మరోజిల్లాకు మధ్య తేడాలున్నాయి. రోడ్డు రవాణా సౌకర్యాలు ఉన్న గూడాలు ఒకలా ఉంటే, లోతట్టు గూడాలు మరోలా ఉన్నాయి. కొన్ని చోట్ల వ్యవసాయంలోకి వచ్చి, బైటి సమాజంతో ఏదో ఒకస్థాయి సంబంధాల్లో ఉంటే - లోతట్టు ప్రాంతంలో జీవిస్తున్న వాళ్ళకు యిప్పటికీ ఆహారసేకరణ, వేట జీవన మార్గాలుగా ఉన్నాయి. ఇవి బైటికి కనిపించే తేడాలు. ఇలాంటివి ఏ సముదాయం లోనైనా ఉండేవే. ముఖ్యంగా 'నాగరిక' సమాజపు సాన్నిత్యం, ప్రభావం, చొరబాటును బట్టి ఈ తేడాలు వస్తుంటాయి. ఇవేగాక చెంచులు తెగగా రూపొందే క్రమంలో సంక్రమించిన వ్యవస్థల్లో, వాటి లక్షణాల్లో, అవి తెగ సభ్యులను నిలిపి ఉంచుకొనే సామర్థ్యంలో సహితం తేడాలు కనిపిస్తాయి.

చెంచులు నల్లమల అటవీప్రాంతంలో మాత్రమే కనిపిస్తారు. అట్లాగే నల్లమలలో చెంచులు తప్ప యింకో ఆదివాసీ తెగ ఉన్నట్టు చరిత్రలో కూడా ఆధారాలు లేవు. సుగాలీలు ఉన్నా - (వీళ్ళ గురించి హైమన్‌డార్ఫ్ రచనల్లో, చరిత్ర సంబంధమైన నివేదికల్లో ఉంటుంది.) వీళ్లు బైటి ప్రాంతాల నుండి వచ్చిన వారే. చెంచులతో పోల్చుకుంటే సమీపకాలంలోనే సుగాలీలు నల్లమలకు వచ్చి ఉండవచ్చు. చెంచుల జీవన మూలాల అన్వేషణలో నల్లమల భౌగోళిక, నైసర్గిక అంశాలను కూడా పరిగణలోకి తీసుకోవాలి.

నల్లమలలో మరే యితర తెగ లేకపోవడం వల్ల, చెంచులు ఎత్తయిన కొండలు, లోయల మధ్య ఆవాసాలను ఏర్పాటు చేసుకోవడం వల్ల సుదీర్ఘకాలంపాటు మరో జీవన విధానంతో సంపర్కానికి అవకాశం కలగలేదు. నల్లమలలో వ్యవసాయయోగ్యమైన భూములు తక్కువనే చెప్పాలి. అటవీ పరిసర ప్రాంతాల్లో క్రమంగా గ్రామాలు రూపొందినట్టు, సాగుభూములు తయారయినట్టు ఆధారాలున్నాయి. అటవీ సరిహద్దు గ్రామాలు కొన్ని నూరు, నూటయాభై ఏళ్ల కిందటివే అనడానికి ఆధారాలు దొరుకుతాయి. కొంచెం దూరంగా ఉన్న పల్లెల్లోవలె పురాతనమైన బురుజులు, దేవాలయాలు ఈపల్లెల్లో కనిపించవు. అడవి క్రమంగా తరిగిపోయి మానవ ఆవాసాలు ఏర్పడే క్రమంలో ఈ గ్రామాలు ఏర్పడి ఉండవచ్చు. ఈ గ్రామాల ప్రభావం చెంచుల మీద ఎంత వరకు ఉన్నదో చూడాలి. ఎందుకంటే కాలక్రమంలో చెంచులు అటవీ ఫలసాయాన్ని అమ్ముకోవడానికి కొండదిగి ఊళ్లోకి రావడం అలవాటయింది. అంతకు పూర్వం అడవులకే పరిమితమైనవాళ్లలో ఇది మార్పులకు దారితీసింది. అసలు చారిత్రకంగా చూస్తే - నల్లమలలోని శ్రీశైలం, త్రిపురాంతకం, మహానంది, అహోబిలం, యాగంటి లాంటి శైవ, వైష్ణవ దేవస్థానాలకు ప్రాధాన్యత ఉన్నది. బయటి ప్రాంతాల నుండి రాకపోకలు జరిగాయి. నల్లమలకు ఒకవైపు కృష్ణ, తుంగభద్ర నదుల సంగమ ప్రాంతం ఉంటే మరోవైపు అత్యంత పురాతనమైన నాగార్జునుని విశ్వవిద్యాలయం ఉన్నది. జైనం, బౌద్ధం స్థావరాలు సాంస్కృతిక కూడళ్లుగా కొనసాగాయి. చుట్టూ ఇవన్నీ ఉంటే లోతట్టు అడవిలో ఎత్తైన కొండలమీద, లోయల్లో చెంచుల ఆవాసం. చెంచు ప్రాంతాల నుండే పేటన్నిటి మధ్య రాకపోకల అవకాశం ఉన్నది. త్రిపురాంతకంలో కాకతీయుల శాసనాలు లభ్యం కావడాన్ని బట్టి ఆకాలంలో నల్లమలకు బయటి సమాజంతో ఉన్న సంబంధాలు కొంచెం ఊహించవచ్చు. అయితే కాకతీయుల తరువాత నల్లమలమీద ప్రభావం చూపగల స్థాయిలో రాచప్రభుత్వాల విస్తరణ లేనట్టే. శ్రీకృష్ణదేవరాయలు, శివాజీ శ్రీశైలం దర్శించడం మినహా.

ఇంకా క్షుణ్ణంగా పరిశీలిస్తే ఇలాంటి ప్రభావాలు, సంబంధాలు మరికొన్ని కనిపించవచ్చు. ఇవన్నీ నాగరిక సమాజానికి సంబంధించినవి. లేదా నాగరిక సమాజం వైపు నుండి ప్రభావం చూపగల అంశాలు. చెంచు ఆవాసాల చుట్టూ చాలా వైవిధ్యమైన లక్షణాలు గల స్థావరాలు, కేంద్రాలు చెంచుల జీవన సరళిని ఎలా ప్రభావితం చేయగలిగాయి? ఎంతవరకు చేయగలిగాయి? అని చెంచుల వైపు నుండి చూడవలసి ఉన్నది. ఎందుకంటే ఇన్ని చారిత్రక, భౌగోళిక ప్రభావాలు సాగినా చెంచులు అర్ధసంచార తెగగానే ఉండిపోయారు. 1930ల దాకా స్థిరనివాసంలోకి రాలేదని గత పరిశోధనలు తెలియజేస్తున్నాయి. ఈ సంచారంలో భాగంగానే కొండదిగి ఇప్పటి నెల్లూరు, చిత్తూరు ప్రాంతాలకు తరలిపోయిన చెంచులే యానాదులుగా స్థిరపడ్డారనే వాదనలూ ఉన్నాయి. చెంచులు సంచార, అర్ధసంచార తెగకావడం; మరో తెగతో సంబంధాలు, సంఘర్షణలు లేకపోవడం ఒక భౌగోళిక పరిమితి. దీని వల్ల కూడా అడవిలోవాళ్లకు తమదైన స్వేచ్ఛా జీవనం నడిచింది.

## 3. స్వేచ్ఛా ప్రియత్వం

చెంచులలో స్వేచ్ఛాప్రియత్వం ఎక్కువ. వాళ్లను దగ్గరగా చూసిన గిరిజన సంక్షేమశాఖ అధికారులు దీని గురించి అనేక రకాలుగా వర్ణిస్తారు. చెంచుల ఆవాసాల గురించి, ఆహారసేకరణ పద్ధతుల గురించి, వ్యవసాయంలాంటి ఉత్పాదక శ్రమ రూపాల్లోకి రావడానికి వాళ్ళు ప్రదర్శించే వైముఖ్యం గురించి చెప్పేటప్పుడు తరచూ దీని ప్రస్తావన వస్తుంటుంది. ఆదివాసులందరూ స్వేచ్ఛాప్రియులే అయినా చెంచుల జీవనరీతిలోని మౌలిక అంశాన్ని వాళ్ల 'వ్యక్తిగతస్వేచ్ఛ' అనే భావనలో వెతకడం జరుగుతుంది. గూడాలలో యిండ్లపొందిక దగ్గరి నుండి దానికి ఆధారాలు కనిపిస్తాయి. ఒక గూడెంలో ముప్పై గుడిసెలు ఉంటే, అన్నీ ఒకే చోట గుంపుగా కనిపించడం అరుదు. అక్కడక్కడ మూడునాలుగు గుడిసెలు విసిరేసినట్టు ఉంటాయి. ఐటిడిఎ వాళ్ళు పక్కాయిండ్లు కట్టిచ్చినా అట్లాగే కట్టించవలసి వచ్చింది. రెండుమూడు గుడిసెలు మాత్రమే ఉండే ఆవాసాలు కూడా ఉన్నాయి. వీటిని పెంటలని అంటారు. పెంటల్లో ఒకేఒక్క కుటుంబం ఉండటం కూడా నల్లమలలో గమనిస్తాం. ఒక్కోసారి పెంట తాత్కాలిక ఆవాసమే అవుతుంది. చెంచుల్లో వ్యక్తిగతస్వేచ్ఛ, స్వాతంత్ర్యం అనే భావనలు బలంగా కనిపిస్తాయని, తాము ఒక ప్రాంతానికి పరిమితమని అనుకోరని చెప్తూ హెమన్‌డార్ఫ్ చెంచులను అర్ధసంచారతెగ అంటారు. వేట, ఆహారసేకరణదశలో ఆగిపోయిన తెగ కాబట్టి ఇప్పుడున్న గుర్తింపులో స్థిరావాసంలోకి రావడానికి వేల సంవత్సరాలు పట్టి ఉంటుంది. ఆయన క్షేత్రపరిశీలన చేసిన యాభైఅరవై ఏళ్ళ కింద సంచార తెగ లక్షణాలు ప్రబలంగానే ఉండి ఉంటాయనడంలో సందేహం లేదు.

అప్పటి నుండి ఇప్పటిదాకా వాళ్లలో కొనసాగుతూ వచ్చిన సంచార, అర్ధసంచార లక్షణాలే గూడెం పొందికలో కూడా చూడవచ్చు. ఒక గూడెంలో ఏక గోత్రీకులే ఉంటారని చెప్పడానికి లేదు. అసలు ఏకగోత్రీకులు, రక్తసంబంధీకులైన అన్నదమ్ములు పక్కపక్కనే కలిసి ఉండటానికి ఇష్టపడరు. దీనికి తోడు ఆహారసేకరణలో గుంపుప్రమేయం చాలా తక్కువ. ఉడుతలు, తొండలు పట్టడం, అటవీ ఫలసాయాన్ని సేకరించడం మొదలయిన వేట-ఆహారసేకరణ రూపాలు కూడా ఒకరు యిద్దరు కలిసి చేయగలిగేవే. వీటన్నిటికి విధిగా భార్యాభర్తలు కలిసి వెళ్తారు. లేదంటే కుక్క తోడుగా ఉంటుంది. అంతకుమించి గూడెంలో వాళ్లంతా కనీసం కొందరైనా గుంపుగా సాగించే కార్యకలాపం కాదు.

దీనివల్లనే చెంచులు వ్యక్తిమాత్ర ఆలోచనలతో ఉంటారని, ఎవరికివారే గాని వాళ్లలో వాళ్లుకూడా పెద్దగా కలిసి ఉండరనీ అంటారు. ఆవాసాల్లో, దినచర్యల్లో ఈ లక్షణం స్పష్టంగా కనిపిస్తుంది. ఏవైనా గొడవలు జరిగినా, తమ అభీష్టానికి భిన్నంగా ఇతరులు వ్యవహరించినా కోపించి గూడెం వదిలి దూరంగా వెళ్ళిపోయే అలవాటూ ఉన్నది.

పాతికముప్పై ఏళ్ల కింద ప్రభుత్వం సమగ్ర గిరిజన అభివృద్ధి పేరుతో జోక్యం చేసుకోవడానికి పూర్వస్థితికి, ఆ తర్వాత స్థితికి తేడా ఉన్నది. బ్రిటిష్‌కాలం నుండి అనేక అటవీచట్టాలు ఉన్నా, మహబూబ్‌నగర్ ప్రాంతంలోని నల్లమలలో నిజాం అటవీ చట్టాలు అమలయినా, ఐటిడిఎ ఏర్పాటు తర్వాత చెంచుల జీవనరూపాలలో మార్పు మొదలయింది. ఇది ఏరకమైన మార్పు? దాని స్వభావం ఏమిటి? అనేవి లోతయిన చర్చలో తేలేవే అయినా, ఈ మార్పు మాత్రం తప్పక గుర్తించదగింది. అయితే ఈ మార్పులవల్ల చెంచుల సమకాలీన జీవితంలో కనిపించే అనేక తేడాలు, వైవిధ్యాలు రూపసంబంధమైనవనే ఎరుక అవసరం. లేకపోతే చెంచుల సామాజిక మూలాల అన్వేషణలో వీటి ప్రాధాన్యతనూ, పరిమితులనూ ఎలా అంచనావేయాలో, ఎలా పరిగణనలోకి తీసుకోవాలో స్పష్టంకాదు.

ఇంత వివరణ ఎందుకంటే ఐటిడిఎ ద్వారా రాజ్యం నేరుగా చెంచు సమాజంతో సంబంధం పెట్టుకున్నాక వచ్చిన మార్పుల దృష్ట్యా కూడా సామాజిక మూలాల పరిశోధన చేయవచ్చుగాని, ఆ మార్పులు చరిత్ర సంబంధమైన ప్రాధాన్యతను తగ్గించడానికి కారణం కాదు. ఉదాహరణకు రోడ్లకు దగ్గరిగా ఉన్న గూడాల పొందిక లోతట్టు అడవిలో గూడాలకన్నా విభిన్నంగా ఉంటుంది. తగాదాలు పడితే గూడెం వదిలి పోవడం కూడా ఇప్పుడు అరుదుగానే జరుగుతున్నది. ఎందుకంటే గిరిజన సంస్థద్వారా లభించే గుర్తింపు, తద్వారా దొరికే ప్రయోజనం ఈ అలవాటును మార్చివేసింది. దూరంగా వెళ్ళి గుడిసె వేసుకున్న కుటుంబం గిరిజన సంస్థ లెక్కల్లో మాత్రం అ గూడెంలో ఉన్నట్టే. సమూహంతో సంబంధం పట్ల వాళ్ళకు ఉండే అలవాట్లను ఆధునిక వ్యవస్థల వ్యవహారం ప్రభావితం చేసిన మాట వాస్తవమే అయినా వాళ్ళలో నిగూఢంగా ఉన్న అలవాట్లకు చారిత్రకమైన ఆధారాలు బలంగానే ఉన్నాయి. వాటిని విస్మరించడానికి వీల్లేదు. ఈ క్లిష్టత అనేక విషయాల్లో ఎదురువుతూ ఉంటుంది. యిప్పటికీ ఆహారసేకరణ మీద, వేట మీద ఒక తెగ ఆధారపడి ఉండటం అంటే గణం నుండి తెగగా పరివర్తన చెందే దశలోనే పరిణామం ఆగిపోయి ఉంటుంది. విల్లంబులు వాడటం, వాటికి అవసరమైన లోహంతో అంబుమొన తీర్చిదిద్దుకోవడం అలవాటయినా విల్లంబులు ప్రయోగించి పెద్దజంతువులను వేటాడటం యిప్పటికీ తక్కువే.

మామూలుగా చెంచుల విల్లంబుల గురించి మైదానప్రాంత గ్రామాల వాళ్ళు తాగినప్పుడు, ఆవేశకావేశాల మీద కొట్లాడుకున్నప్పుడు పక్కవాళ్ళమీద వెయ్యడానికే వాటిని ఉపయోగిస్తారుగాని, పెద్ద

జంతువులను వేటాడే అలవాటు అంతగా లేదని అంటారు. దుంపలు, గడ్డలు తవ్వడానికి పలుగు వాడినంత ఎక్కువగా కూడా విల్లంబులు వాడరు. రోజువారీ దినచర్యలో చిన్నచిన్న జంతువులను, పక్షులను చేతులద్వారా, వల ద్వారా పడుతూ ఉంటారు.

ఈ కోణంలో చూస్తే అడవిలో ఉత్పత్తి అయిన ఫలసాయాన్ని, ఉడుతలను, తొండలను చేతుల ద్వారా సేకరించే దశకు –విల్లంబులు వాడే వేట దశకు మధ్యలో ఆగిపోయిన తెగకావచ్చు అనిపిస్తుంది. యిది చాలా ప్రాచీన లక్షణం. ఆదిమదశ నుండి అనేక మార్గాల్లో సాగిన అభివృద్ధి చరిత్రలో ఆహారసేకరణకు, వేటకు మధ్య నిలబడిపోయిన తెగ కాలగతి వెంట నడచిన దారి చాలా ప్రత్యేకమైంది. ఆంధ్రప్రదేశ్‌లోని యితర ఆదివాసి తెగలకంటే చెంచుల చారిత్రక ప్రయాణం పూర్తిగా భిన్నమైనదనిపిస్తుం. నిజానికి 'చరిత్ర' అనే మాట చాలా జాగ్రత్తగా ఉపయోగించవలసి ఉంటుంది. ఆహారసేకరణ దశ నుండి మరోదశలోకి పరివర్తన చెందని తెగ వర్తమాన సమాజం పక్కన విస్మృతిలో కొనసాగుతూ ఉన్నప్పుడు చరిత్ర అనే మాట మన సౌకర్యం కోసమే ఉపయోగించి నట్టవుతుంది.

## 4. భాష

ఆంధ్రప్రదేశ్‌లో చెంచులకు, కొండరెడ్లకు తెలుగు మాతృభాష. చెంచుల తెలుగులో ఒకరకమైన యాస ఉంటుంది. అతి పురాతనమైన ఆదిమ తెగకు తెలుగు మాతృభాషకావడం విచిత్రం. మరేదైనా మాతృభాష ఉండి, పరిణామక్రమంలో అది పూర్తిగా దూరమై తెలుగు మాత్రమే మిగిలిందా అనే ప్రశ్న నుండి మైదాన ప్రాంత భాషతో సంపర్కం కలగడానికి అవకాశం ఉండవచ్చుగాని, అదే మాతృభాషగా ఎలా మిగిలిపోయింది, అంతకుముందు ఏ భాష ఉండేది, అనే ఆలోచనలు తలెత్తుతాయి.

తెలుగు భాషతో చెంచుల సంపర్కానికి గల అవకాశాలనూ వెతకవచ్చు. నల్లమలలో మత సంబంధమైన స్థావరాలు ఉన్నాయి. అడవిలో విలువైన మూలికాసంపద ఉన్నట్టు కూడా ఆధారాలున్నాయి. వీటి కోసం మైదాన ప్రాంతాల ప్రజల రాకపోకలు అడవిలో విరివిగానే ఉండేవి. శ్రీశైలం మాన్యువల్‌లో చెంచుల గురించి , మైదాన ప్రాంతాల గురించి ప్రస్తావనలు కనిపిస్తాయి. అట్లా తెలుగు భాషా సంపర్కానికి ఒక కారణాన్ని ఊహించవచ్చు. అయితే అది బలహీనమైనది.

నిజానికి చెంచులు మాట్లాడే తెలుగు చాలా క్లుప్తమయింది. అతి తక్కువ పదాలలో, బలహీనమైన వ్యక్తీకరణలతో మాట్లాడుతూ ఉంటారు. యిది 'నాగరిక' భాషా స్థాయితో , ప్రమాణాలతో పోల్చడం కాదు గాని, చెంచులు తమలో తాము కూడా దీర్ఘసంభాషణలు సాగించరు. తాగినప్పుడు ఉండే ధార కూడా మామూలప్పటి మాటల్లో కనిపించదు. కోపం, అసమ్మతిలాంటి వ్యక్తీకరణల్లో చాలా వరకు మౌనమే ఉంటుంది. ఒక పదంతోనో, చిన్న వాక్యంతోనో సంభాషణలు నడుస్తుంటాయి. బైటి ప్రాంతాల వాళ్ళతో మాట్లాడ్డానికి పెద్దగా ఇష్టపడరు. అవతలివాళ్ళు మాట్లాడేది తెలుగే అయినా సంభాషణలోకి దిగరు. ఇదంతా గమనిస్తే, భాషలో, వ్యక్తీకరణలో పురాతన సంకేత సంస్కృతి ఉన్నదా అనిపిస్తుంది. విస్తృతమైన భాష వినిమయానికి అవసరమైన అంతర్గత సంబంధాలు సహితం లేకపోవడం వల్ల ఆదిమదశలోని సంకేత సంస్కృతి క్లుప్తత రూపంలో కొనసాగుతున్నదను కోవచ్చు. దీన్ని ఇంకోవైపు నుండి – చెంచులు ఇప్పుడున్న తెగరూపాన్ని సంతరించుకొనే క్రమంలో తెలుగు వచ్చిన మరేదైనా తెగ ఈ ప్రాంతానికి వచ్చి చెంచుల్లో సంలీనమైపోవడం వల్ల తెలుగుమాతృభాషగా మిగిలిపోయిందా? లేక అసలు చెంచులు వేరే ప్రాంతం నుండి అనేకానేక ఒత్తిళ్ళల్లో, అనివార్యతలలో ఈ ప్రాంతానికి వచ్చి చేరడం వల్ల తమదైన భాషకు దూరం కావడంతో తెలుగు సంక్రమించిందా? అని ఊహలు కూడా చేయవచ్చుగాని వీటికి కనీసమైన చారిత్రక ఆధారాలు వెదకడం కష్టం. పైగా ఈ రెండింటిలో ఏది జరిగినా చెంచులు సంఘర్షణాత్మక అనుభవానికి లోనై వుండేవారు. అది తప్పక వారి జీవన విధానంలో, ఆలోచనారీతుల్లో వ్యక్తమై వుండేదే. అయితే అంతకముందు చెంచులు ఒక భాష అంటూ ఏదీ లేకుండానే జీవించారా? తెలుగుతో పరిచయం (ప్రభావం కావచ్చు, బలవంతగా రుద్దడం కావచ్చు) కలిగే వరకు భాష లేకుండానే జీవించి ఉంటే– ఆ దశలో సాగిన వాళ్ళ జీవితాన్ని అంచనా వేయడానికి చాలా వెనక్కి వెళ్లాల్సి వస్తుంది. అప్పుడు పైన చెప్పినట్టు చెంచులు మాట్లాడే తెలుగు వ్యక్తీకరణలో సంకేత సంస్కృతి ఉంటుందనడం కంటే వాళ్లదైన ఆదిమ సంకేతాత్మక భాషలోకి తెలుగు పదాలు, వాక్యనిర్మాణం క్రమక్రమంగా వ్యాపించి ఉంటాయని చెప్పడం ఉచితంగా ఉంటుందేమో!

తమదైన మాతృభాష ఏర్పడకుండా సుదీర్ఘకాలం జీవించడం వల్ల, లేదా తమదికాని భాషతోనే ఆ తర్వాత జీవించవలసిరావడం వల్ల చెంచుల భౌతిక, మానసిక ప్రపంచంలో ఏర్పడిన ప్రత్యేకతలు, పరిమితులు ఏమిటో గమనించాలి. సాధారణంగా యిలాంటి జన సముదాయాల పరిశోధనకు మానవ, సామాజిక శాస్త్రవేత్తలు ఆ సముదాయాల భాషా స్వరూపం, విస్తృతితో పాటు, వాళ్లవైన కళా రూపాలను, పౌరాణికాలను పరిగణలోకి తీసుకుంటారు.

## 5. సంస్కృతీ రూపాలు

చెంచు పాటలుగా కొన్ని చలామణిలో ఉన్నాయిగాని, వాటిని తరచిచూస్తే అవి చెంచుల జీవితం నుండి ఉద్భవించినవని నమ్మడం కష్టం. వాళ్ళ సామాజిక, సాంస్కృతిక మూలాల నిమిత్తం వాటిలో కనిపించదు. తమది కాని జీవిత విశేషాల ప్రభావం నుండి జనించిన పాటలుగా చెప్పవచ్చు. ఒకవేళ వాటిని చెంచులే అల్లినా, వాటికి ఇప్పుడు గూడాల్లో చోటు దొరికినా (వాటిని తక్కువ చేయడం కాదు) వాటిలో చెంచుల పరంపరాగతమైన సాంస్కృతిక వారసత్వాన్ని వెతకడం కష్టం.

చెంచులకు తమవైన పాటలు, కళారూపాలు ఉన్నట్టు లేవు. అవి ఉత్పత్తి అయ్యే భౌతిక జీవన పునాది చెంచుల్లో ఏర్పడకపోవడం కారణం కావచ్చు. పెండ్లిళ్ళల్లో, పండగల్లో చిన్న తంతు ముగిశాక పలకలు కొడుతూ గుంపుగా డాన్స్ చేస్తారు. తాగిన మత్తులో సవార్లుగా మొదలై ఒకర్ని ఒకరు అరుచుకుంటూ ఎవరి పద్ధతిలో వాళ్ళు ఆడతారు. చెంచులకున్న కళారూపమిది.

చెంచు పురాణం లేదా చెంచు నాటకం గురించి ముసలివాళ్లకు కూడా తెలియదు. ఏదో సుదూరమైన విషయంగా మాట్లాడతారు. ప్రకాశం జిల్లా బందంబాయి గూడెంలో ఒక ముసలాయన– ఎప్పుడైనా

బైటి నుండి వచ్చి నేర్పిస్తే నాటకం ఆడుతారు అన్నాడు. చెంచు నాటకం గురించే కాదు, అందులోని కథ గురించి కూడా వెనకబడిన గూడాల్లో సైతం తెలియదు. నిజానికి బుడగ జంగాలు, హోలియ దాసరులు రాత్రి మొదలుపెడితే తెల్లారేదాకా చెంచునాటకం ఆడతారు. ప్రదర్శనకు తగినంత మంది పాత్రధారులు లేకపోతే యిద్దరు, ముగ్గురు కలిసి చెంచు పురాణం చెప్తారు.

ఇదంతా దేనికంటే చెంచులకు కళారూపాలుగాని, పౌరాణికాలుకాని లేకపోవడానికి కారణం నిర్దిష్టంగా భాషలో అన్వేషించడం వల్ల ప్రయోజనం ఉండొచ్చు. భాష అంటూ లేని సుదీర్ఘ జీవనంలోని అనుభవాలను ఒక సమూహం తన మనో ప్రపంచంలో ఎట్లా పదిలపరుచుకుంటుంది? వాటిని తిరిగి ఎట్లా వ్యక్తీకరించు కుంటుంది? ఎందుకోసం వ్యక్తీకరించుకుంటుంది?

తరతరాల చెంచుల జీవనంలో భయోత్పాతం సృష్టించే అనుభవాల అంచులదాకా వెళ్ళివచ్చిన ఘటనలు ఎన్నో జరిగి ఉంటాయి. ఆ అనుభవ స్థితి ఎలా ఉండింది? అది వాళ్ళ జ్ఞాపకాల్లో పోగుబడి ఉండదా, దాన్ని తమ తర్వాతి తరాలకు అందించేందుకు మాధ్యమం ఏమిటి అనే ప్రశ్నలు తలెత్తుతాయి.

భాష లేకుండా యివేవీ సాధ్యం కావు. బహుశా జ్ఞాపకాలుగా పోగుబడిన వాటి వినిమయానికీ ఏదో ఒక రూపంలో ఉండే భాష కావాల్సిందే. తెలుగుతో సాంగత్యం కలిగాక తెలుగులోనైనా కళారూపాలు, పౌరాణికాలు రూపొందాలి. అసలు – తెలుగు చెంచుల స్వరపేటికలో ప్రత్యేకంగా పలుకుతుంది, ఇందువల్ల కూడా తెలుగులో చెంచు పాటలుగా ప్రచారమవుతున్న వాటిని సందేహస్పదంగా చూడ్డం నేరమేమీ కాదు.

## 6. ఆధ్యాత్మికత

యిక్కడి నుండి నేరుగా ఆధ్యాత్మికత దగ్గరికి వెళ్ళవచ్చు. చెంచులకు అంకాలమ్మ, గురప్ప, పోతురాజు, మంతనాలమ్మ, నాగమయ్యలాంటి దేవతలున్నారు. ఆడదేవతలు, మగదేవతలు ఉన్నారుగాని ప్రత్యేకంగా ఒక దేవతను లేదా దేవుణ్ణి విధిగా కొలిచే సందర్భం లేదు. దేవతలు, ఆరాధనా రూపాలు ఆదివాసీ సమాజాల్లో ప్రబలస్థానంలో ఉంటాయి. అనుల్లంఘనీయంగా ఉంటాయి. రుతువులతో, కాలాలతో, పాడిపంటలతో, జననమరణాలతో ముడిబడి ఉంటాయి. వాటి చుట్టూ బోలెడు వాఙ్మయం ఉంటుంది.

చెంచుల్లో దేవుడు అనే స్పృహ ఉన్నదిగాని అది నిర్దిష్టమైన అధికారరూపాన్ని సంతరించుకోలేదా అని అనుమానం. హిందూ సమాజం ప్రభావం వల్ల హిందూ పండుగలు చేసే ఆనవాయితీ కూడా చాలా గూడాల్లోకి వచ్చిందిగాని, అంతకముందు తమవైన దేవతలు, ఆరాధన పద్ధతులు, వాటికి సంబంధించిన విధినిషేధాలు, వాటి చుట్టూ పౌరాణికాలు ఉండి ఉండాలి. అవేవీ లేవంటే సహజంగా దేవుడనే భావనలో దేవుడు – మనం అనే సంబంధంలో దాగి ఉండే అధికారం, అభద్రత అనేవి లేకపోవడంవల్ల చెంచు సమాజంలో దేవుడు నిర్వర్తించే 'పని' కూడా లేకుండా పోయింది. జీవితం 'క్రమబద్ధం', 'నియమబద్ధం' కావలసిన అవసరం లేనిదశను యిది సూచిస్తోందనుకోవచ్చు. అది ఎలాంటి క్రమబద్ధీకరణ అనేది వేరే విషయం.

దేవుని విషయంలో ఉండే దృష్టిని బట్టి – అది ఒక భావనగానే ఉన్నదిగాని వ్యవస్థగా మారలేదని చెప్పవచ్చు. వ్యవస్థ అయితే తెగ సామూహిక జీవితంలో అది నిర్వర్తించే పాత్ర ఉంటుంది. సామూహికమైన భయభక్తులు, ఆరాధన పద్ధతులు, వీటికి సంబంధించిన కళా వ్యక్తీకరణలు ఉంటాయి.

చెంచులది ఇవేవీ రూపొందక ముందు ఉండిన మానవదశ కావచ్చు. బహుశా అప్పటికి మరణం (ఎలా ఎదురైనా) అతి సహజమైన విషయంగా ఉండి ఉంటుంది. మరణాన్ని ఎదుర్కొనడం, వాయిదా వేయడం మనిషి సృజనాత్మక జోక్యం చాలా అభివృద్ధి చెందిన దశలోనే సాధ్యమై ఉంటుంది. అదలా ఉన్నా –మరణం గురించి ఆదిమ సమాజం ఏమనుకొని ఉంటుంది? అంతదాకా తమతో ఉన్న వ్యక్తి కడతేరిపోవడం పట్ల ఎలాంటి స్పందనలకు లోనై ఉంటుంది? చనిపోయిన మనిషి జ్ఞాపకాలు ఎలా దాగి వుంటాయి? అనే లోతయిన ప్రశ్నలు ఇవాళ మన సమాజం పక్కనే జీవిస్తున్న చెంచుల విషయాల్లోనూ వేసుకోవచ్చు.

ఈ మధ్యకాలంలో చెంచులు అందుబాటులో ఉండే వైద్యం కొద్దిగా చేయించుకుంటున్నారు. వైద్యం విషయంలో చెంచులకు సంప్రదాయ జ్ఞానం ఏమైనా ఉండేదా? అనే ఉపప్రశ్న కూడా ఎదురవుతుందిగాని అడవిలో దొరికే ఆకులు, మూలికలు, వేళ్ళు విషయంలో వాళ్లు నిష్ణాతులు మాత్రం కాదు. బహుశా ఆ జ్ఞానం పరంపరాగతమైనది. ప్రత్యేకంగా పెద్దలు పిల్లలకు నేర్పిస్తేనే వస్తుంది. ప్రకృతిలోని మార్పులను, చెట్లుచేమల స్వభావాలను గమనించి, శరీరధర్మాలను కూడా ఆకళింపు చేసుకుంటేనే ఈ తరహా వైద్యం రూపొందుతుంది. క్రమబద్ధ వినియోగంలో ఉంటేనే నిలబడుతుంది. చెంచుల జీవితంలో సార్వత్రికంగా అలాంటి వైద్యజ్ఞానం పరంపరా గతంగా ఉన్నదని చెప్పలేం.

మరణం పట్ల చెంచుల్లో ఒకరకమైన నిర్లిప్తమైన ధోరణి కనిపిస్తుంది. బహుశా చనిపోయిన వ్యక్తి జ్ఞాపకాల విషయాలలోనూ ఇట్లే ఉంటారనుకోవచ్చు. మరణాన్ని ఎదిరించలేకపోయినా, ఆ భయం చనిపోయిన వ్యక్తుల ఎడబాటులో తనదైన వ్యక్తీకరణను ఆశ్రయిస్తుంది. చెంచుల్లో అది చాలా పలుచగా ఉంటుంది. చెంచుల్లోని మానవ సంబంధాల అభివృద్ధి స్థాయిని యిది సూచిస్తుందేమో?

చెంచుల్లో అంతర్గతంగా బలమైన సామాజిక సంబంధాలు లేకపోవడం వల్ల ఆ జన సముదాయానికి, వాళ్ళు జీవిస్తున్న భౌగోళిక ప్రాంతానికి మధ్య సంబంధం కూడా ఏర్పడలేదు. అసలు అలాంటి అవసరమే ఏర్పడినట్టు లేదు. ఆ ప్రాంతాన్ని తమదిగా అనుకోవడానికి, నిలబెట్టుకోవాలనుకోడానికి బైటి నుండి యితర కారణాలు కూడా ప్రేరేపించలేదు. బహుశా అది యితర తెగలలో సంఘర్షణ నుండిగాని, రాజ్యంతో, మైదాన ప్రాంతాల అధిపత్య వ్యవస్థలతో సంఘర్షణ నుండి గాని సహజంగా జనిస్తుంది. అప్పుడు ఆప్రాంతంతో తమ అనుబంధాన్ని వ్యవస్థీకరించుకోవడానికి పెనుగులాట తప్పనిసరి. దానికి ఆలంబనగా ఒక దేవుడు లేదా దేవత, ఆరాధన పద్ధతులు, విశ్వాసాలు ఏర్పడటమేగాక ఆ రూపం తమ జీవితంలో నిర్వర్తించే పాత్రను కూడా ఊహించు కుంటారు. అక్కడి నుండే తెగకు సంబంధించిన పౌరాణికాలు ఆవిర్భవిస్తాయి. ఈ ప్రక్రియ చెంచుల్లో జరిగినట్టు ఆధారాలు కనిపించవు.

(మిగతా వచ్చే సంచికలో...)

మహిళా సంఘాల అధ్యయనం చేయకుండా మహిళా ఉద్యమ చరిత్రను సరిగ్గా నిర్మించలేమనీ, దాని స్వభావాన్ని అంచనా వేయలేమనీ అంటున్నారు **ఎస్. మహబూబ్ బాషా**

# వలసాంధ్రలో స్త్రీల సంఘాలు : వివాదాస్పద 'శ్రీ విద్యార్థిని సమాజ' కథ

**భా**రతదేశంలో మహిళల అభివృద్ధికి మహిళా సంఘాలు చేసిన కృషి చాలా ఉంది. కాని వారి కృషిని అంచనా వేసే విశ్లేషణ చాల తక్కువగా జరిగింది.

అపర్ణ బసు & భారతి రే[1]

**'ఆ**ల్ ఇండియా ఉమెన్స్ కాన్ఫరెన్స్' చరిత్ర రాస్తూ బసు, రే లు స్త్రీల ఉద్యమంలో ప్రధాన పాత్రను పోషించిన స్త్రీల సంఘాల గూర్చి సరైన పరిశోధన జరగలేదన్న నిష్ఠుర సత్యాన్ని మనముందుంచారు. జాతీయ స్థాయి మహిళా సంఘాల గూర్చిన పరిశోధనే యిలాగుందంటే ప్రాంతీయ స్థాయి మహిళాసంఘాల గూర్చిన పరిశోధన ఎలా ఉందో సులభంగానే గ్రహించవచ్చు. సంఘ సంస్కరణోద్యమాన్ని గూర్చి యింతవరకు జరిగిన పరిశోధనలన్నీ పురుషులు స్థాపించిన వివిధ సంఘాల గూర్చీ, వాటి కార్యకలాపాల గూర్చీ మాత్రమే చర్చించి స్త్రీల సంఘాలనూ, వాటి కార్యకలాపాలనూ, సంఘసంస్కరణలో వాటి పాత్రనూ సరిగ్గా పట్టించుకోలేదు. పట్టించుకున్న పరిశోధనలు కూడా పైపైన మాత్రమే తడమడం జరిగింది. వలసాంధ్రలో సంఘసంస్కరణను గూర్చి యిప్పటి దాకా జరిగిన పరిశోధనలు యిందుకు భిన్నంగా ఏమీలేవు. ఆయా పరిశోధనల స్వభావం, పరిధి దీనికి కారణం.[2] ఒక్క మల్లాది సుబ్బమ్మను మినహాయిస్తే యితరులెవ్వరూ ఈ విషయమై ప్రత్యేక దృష్టిని సారించిన దాఖలాలు లేవు.[3] సుబ్బమ్మ పుస్తకం కూడా సుదీర్ఘమైన కాలాన్ని (1860-1993) విషయ వస్తువుగా తీసుకోవడంతో వలసాంధ్ర లోని స్త్రీ సంఘాల కార్యకలాపాలు, స్వభావం మున్నగు వాటిని ప్రత్యేకంగా చర్చించే అవకాశం లేకపోయింది. అంతేకాక యిందులో వాస్తవాలకు సంబంధించిన కొన్ని తప్పులు కూడా దొర్లాయి.[4]

స్త్రీల చరిత్రను రచించే ప్రయత్నం, స్త్రీల దృక్కోణంతో చరిత్రను పునర్రచించే ప్రయత్నం యిటీవల ముమ్మరంగా సాగుతోంది. స్త్రీల జీవితాల్లో పరిగణించదగ్గ మార్పులు తెచ్చిన వలస భారతదేశంలోని మహిళా ఉద్యమాన్ని గూర్చి అనేక పరిశోధనలు జరిగాయి, జరుగుతున్నాయి. ఈ సందర్భంలో స్త్రీల దృక్కోణం నుండి మహిళా ఉద్యమాన్ని అర్థం చేసుకోవడానికి మహిళా సంఘాల అధ్యయనం తప్పనిసరి. స్త్రీలు ఎందుకు, ఎలా సంఘటితమయ్యారు? ఏయే సంఘాలను స్థాపించారు? ఆయా సంఘాల కార్యకలాపాలేమిటి? ఏయే అంశాలను చర్చించారు? ఆయా సంఘాలను స్థాపించడంలో, కొనసాగించడంలో, నిర్వహించడంలో ఎలాంటి యిబ్బందు లెదుర్కొన్నారు? వాటినెలా అధిగమించారు? మహిళా ఉద్యమ నిర్మాణంలో ఈ సంఘాలు ఎలాంటి పాత్రను పోషించాయి? వాటిలోని వైరుధ్యాలేమిటి? ఈ సంఘాలు స్త్రీలను ఎంతవరకు చైతన్యవంతుల్ని చేశాయి? మొదలైన అనేక ముఖ్యమైన విషయాలు దీనివల్ల మనకు స్పష్టమౌతాయి. అంతేకాక ఈ సంఘాలు మహిళలను యాక్టివిస్ట్‌లుగా నిరూపించి, మహిళలు కేవలం సంఘసంస్కరణ 'వస్తువులు' (ఆబ్జెక్ట్స్ ఆఫ్ సోషల్ రిఫామ్) గానే ఉండేవారన్న లోతయిన అభిప్రాయాన్ని బద్దలు కొడతాయి. ఒక్క మాటలో చెప్పాలంటే మహిళా సంఘాల అధ్యయనం చేయకుండా మహిళా ఉద్యమ చరిత్రను సరిగ్గా నిర్మించలేం; దాని స్వభావాన్ని అంచనా వేయలేం.

ప్రస్తుత వ్యాసం ఈ దిశగా జరిగిన చిరు ప్రయత్నం. ఇది ముఖ్యంగా వలసాంధ్రలో వివాదాస్పదంగా మారిన కాకినాడ విద్యార్థినీ సమాజపు కథను చెబుతుంది. ఇంతకీ ఈ సమాజపు విశేషమేంటి? ఇరవయ్యవ శతాబ్ది ప్రారంభంలోనే స్థాపించబడ్డ ఈ సమాజం భారతదేశం 'స్వాతంత్ర్యం' సంపాదించేవరకూ అంటే సుమారు అర్ధశతాబ్దం కొనసాగింది. (బహుశా తర్వాత కూడా కొనసాగి ఉండొచ్చు). సుదీర్ఘకాలం మనగలగడమే కాకుండా వలసాంధ్ర స్త్రీలలో చైతన్యం కలిగించడంలో బృహత్తరమైన పాత్ర పోషించి దీర్ఘకాల ప్రస్థానం సాగించిన 'హిందూసుందరి' పత్రికను నడిపింది; దాంతో పాటుగా 'రాజ్యలక్ష్మీ పుస్తక భాండాగారం' అనే సంపన్నవంతమైన లైబ్రరీని, 'మహిళా సంస్కృత విద్యాలయ'మనే పాఠశాలనూ నిర్వహించింది. మొత్తం వలసాంధ్ర స్త్రీల వేదిక అయిన 'ఆంధ్ర మహిళాసభ'ను ప్రారంభించడం లోనూ, దాని వార్షిక సమావేశాలను ముందుండి నడపడంలోనూ ప్రధాన పాత్ర పోషించింది. వీటన్నింటికీ మించి సుమారు రెండు సంవత్సరాల పాటు అతి గంభీరంగా నడిచి, పలువురి దృష్టిని ఆకర్షించిన, పలువురు సమకాలీన స్త్రీ-పురుష మేధావులకు సంబంధించిన వివాదానికి వేదికయ్యింది; వలసాంధ్రలో యింతగా వివాదాలకు నెలవైన స్త్రీ సంఘం మరొకటి లేదు! వివాదం చిలికి-చిలికి గాలివానగా మారి సంఘం చీలిపోయింది. సమకాలీన మహిళోద్యమంలో ప్రధాన భూమిక వహించిన

చాలామంది స్త్రీలు ఈ సంఘంతో సంబంధం కలవారే. అంటే విద్యార్థినీ సమాజ అధ్యయనం అంటే దాదాపుగా వలసాంధ్ర మహిళోద్యమ అధ్యయనమే; ఇది ప్రధానంగా ఇరవయ్యవ శతాబ్ది మొదటి రెండు దశకాల్లో వలసాంధ్ర మహిళోద్యమ తీరు తెన్నులనూ, స్వభావాన్నీ, ఉత్థాన పతనాలనూ అంచనా వేయడానికి తోడ్పడుతుంది. అందుకే ఈ సమాజ అధ్యయనం విశిష్టమైంది. విషయంలోకి వెళ్లేముందు పూర్వరంగాన్ని రేఖామాత్రంగా తడుముదాం.

## 1

ప్రధానంగా వలసవాదుల సాంస్కృతిక దాడికి ప్రతిస్పందనగా పదునెనిమిదవ శతాబ్దంలో ప్రారంభమై, పందొమ్మిదవ శతాబ్దంలో విజృంభించి ఇరవయ్యవ శతాబ్ద మొదటి అర్ధభాగం దాకా కొనసాగిన సంఘసంస్కరణోద్యమ కార్యకలాపాలకు స్త్రీ కేంద్రబిందువైంది. భారతీయులపై తన నైతిక ఆధిక్యాన్ని (మోరల్ సుపీరియారిటీ) ప్రకటించుకోవడానికీ, భారతీయులను 'అనాగరికులు'గా నిరూపించ డానికీ, తద్వారా తమ నాగరికతా కల్పనాకృషికి సాధికారతను సాధించడానికీ యిక్కడి స్త్రీల దుస్థితినీ, స్త్రీల పట్ల 'హిందూ' సమాజం చేస్తున్న అఘాయిత్యాలనూ ప్రధాన సూచికగా వలసవాదులు చూపించారు. దీంతో తమ 'సంస్కృతి సంస్కారానికి' నడుం బిగించి, ప్రధానంగా స్త్రీల స్థితిగతుల్లో మార్పులు తేవడానికై బెంగాల్, మహారాష్ట్ర, వలసాంధ్ర, ఇంకా భారతదేశంలోని అనేక ప్రాంతాల్లో సంఘ సంస్కర్తలు కృషి చేశారు; స్త్రీవిద్యపై తమ దృష్టిని కేంద్రీకరించారు. తద్వారా అనేక పాఠశాలలు బాలికల కోసం ప్రారంభమవడం, పలువురు బాలికలు విద్యావంతులై క్రమంగా విదుషీమణులవడం పందొమ్మిదవ శతాబ్ది ద్వితాయార్థం నుండీ జరుగుతూ వచ్చింది.

అతికొద్దిగానే అయినా, వ్యాప్తిచెందిన విద్యద్వారా చైతన్యవంతులైన స్త్రీలు సమాజంలో అధోగతిలోనున్న తమ స్థితిని గూర్చి ఆలోచించడం మొదలుపెట్టారు. తారాబాయి షిండే, భండారు అచ్చమాంబ లాంటి చాలామంది తమ ఆలోచనలకు అక్షర రూపం యివ్వడం, తద్వారా యితర స్త్రీలతో తమ భావాలను పంచుకోవడం షురూ చేసినారు. ఈ క్రమంలోనే సంఘటితమవ్వాలన్న ఆలోచన వారికి కలిగింది. స్త్రీలు తమ ఆలోచనలకు క్రియాశీలక రూపం కల్గించడమనే కార్యంలో భాగంగానే మహిళా సంఘాలు వెలుగులోకొచ్చాయి. ఇంతకు ముందు బ్రహ్మసమాజం, ప్రార్థనాసమాజం వంటి సమాజాల సమావేశాలలో 'పాల్గొన్న' అనుభవం యిప్పుడు బాగా పనికొచ్చింది.

స్వర్ణకుమారీ దేవి ('లేడీస్' అసోసియేషన్':1886), సరళాదేవీ చౌధురాణి ('భారత్ స్త్రీ మహామండల్':1905) లాంటి స్త్రీలు బెంగాల్‌లోనూ, పండిత రమాబాయి ('సేవాసదన్':1892), రమాబాయి రనడే, సావిత్రీబాయిఫూలే లాంటివారు మహారాష్ట్రలోనూ, రామేశ్వరీ నెహ్రూ ('ప్రయాగ్ మహిళా సమితి':1909) రత్నేశ్వరీ అగర్వాల్ ('మహిళా మండల్') లాంటివారు సంయుక్త రాష్ట్రాల్లోనూ మహిళాసంఘాలను స్థాపించి మహిళోద్యమానికి యితోధిక సేవలందించారు. వలస భారతదేశంలోని యితర ప్రాంతాల్లో కూడా అనేక మహిళా సంఘాలు ఉద్భవించాయి. వివిధ ప్రాంతాల్లో మహిళాసంఘాల స్థాపనా కార్యక్రమం ఒకవైపు సాగుతూ పోగా ఇంకోవైపు 'ఉమెన్స్ ఇండియన్ అసోసియేషన్' (1917), 'నేషనల్ కౌన్సిల్ ఆఫ్ ఉమెన్ ఇన్ ఇండియా', 'ఆల్ ఇండియా ఉమెన్స్ కాన్ఫరెన్స్'(1927) లనే జాతీయస్థాయి మహిళా సంఘాలు కూడా ఉనికిలోకి వచ్చాయి.

ఈ నేపథ్యంలోనే వలసాంధ్రలో కూడా ఇరవయ్యవ శతాబ్ది ప్రారంభంనుండీ అనేక మహిళా సంఘాలు ఉద్భవించసాగాయి. కందుకూరి వీరేశలింగం తదితర సంస్కర్తల కృషిఫలించి చైతన్యవంతులైన స్త్రీలు మహిళా సంఘాల స్థాపన ద్వారా మహిళోద్యమ నిర్మాణానికి శ్రీకారం చుట్టారు.[5] ఇంతవరకు లభిస్తున్న ఆధారాలననుసరించి 1897 లో పశ్చిమగోదావరి జిల్లా భీమవరం సమీపాన గల కుముదవల్లిలో స్థాపించబడ్డ 'వీరేశలింగం కవి క్లబ్బు' అనేది మొట్టమొదట స్త్రీల సంఘం. 1902 నవంబరులో ఓరుగంటి సుందరీ రత్నాంబ 'బృందావనపుర స్త్రీ సమాజా'న్ని మచిలీపట్నంలో ప్రారంభించింది. రెండే రెండు సమావేశాలు నిర్వహించిన తర్వాత స్తబ్దత వహించిన ఈ సమాజం సెప్టెంబరు 17, 1904న ప్రభల సత్యవతమ్మ, నాథావర్జుల సరస్వతమ్మ, వల్లూరు పార్వతమ్మ, సి.పంకజమ్మల కృషి ఫలితంగా పునరుద్ధరించబడ్డది. రాజాబాయమ్మ కార్యదర్శిని అయిన తర్వాతే ఈ సమాజానికి జవసత్వా లొచ్చాయి. ఈ సమాజం సెప్టెంబరు 17, 1905న ప్రథమ వార్షికోత్సవాన్ని 'ఘనంగా' జరుపుకుంది.

1902 సెప్టెంబరు 18న ప్రస్తుత ఒరిస్సా రాష్ట్రంలోని గంజాం జిల్లా అసికాలో 'అస్కా స్త్రీ సమాజం' అనేదాన్ని బుర్రె బుచ్చి బంగారమ్మ ప్రారంభించారు. పాఠశాల గ్రామానికి దూరంగా ఉండడం వల్ల బాలికలు వెళ్ళలేక పోతున్నారన్న విషయాన్ని గమనించిన బంగారమ్మ గ్రామ ప్రజలను ఒప్పించి బాలికలను పాఠశాలకు తీసుకెళ్ళడానికి ఒక ఎద్దుల బండిని ఏర్పాటు చేసింది: దానికయ్యే ఖర్చు గ్రామ ప్రజలు భరించేలా ఒప్పించింది. ప్రారంభమైన మొదటి సంవత్సరంలోనే 13 సమావేశాలను ఏర్పాటు చేసిందీ సంఘం. వెల్లింగ్టన్ లాంటి ఆంగ్ల స్త్రీలు ఈ సమాజంలో అత్యంత శ్రద్ధ చూపారు. బంగారమ్మే 1904లో విశాఖపట్నంలో 'భారతీయ సమాజము'ను ప్రారంభించింది. బుద్ధవరపు వీరలక్ష్మమ్మ, బులుసు సూరమ్మలు అధ్యక్ష, కార్యదర్శినులు. 1912 మే16, 17 తేదీల్లో జరిగిన ఈ సమాజ సప్తమ వార్షికోత్సవ సంబరాల్లో ఆంగ్ల వనితలను కలుపుకొని సుమారు 300 మంది స్త్రీలు పాల్గొన్నారు. ఉర్లాం జమీందారిణి అయిన కందుకూరి వెంకాయమ్మరావు అధ్యక్షత వహించింది. తన అధ్యక్షోపన్యాసంలో స్త్రీలకు సంబంధించిన అనేక విషయాలను చర్చించిన ఈవిడే స్త్రీలు వైద్యవిద్యను అభ్యసించాల్సిన అవసరాన్ని నొక్కి చెప్పింది. ఈ సమాజం కూడా క్రైస్తవ మిషనరీ స్త్రీలతో సాన్నిహిత్యాన్ని కల్గి ఉండేది.

1904-05 మధ్య బాపట్లలో ఏకా వెంకటరత్నమ్మ నాయకత్వంలో ప్రారంభించబడ్డ 'స్త్రీ సనాతన ధర్మమండలి' దీర్ఘకాలం కొనసాగి 1930 అక్టోబరు 14,15 తేదీల్లో సిల్వర్ జూబ్లీ సంబరాలను జరుపుకుంది. ఈ సంబరాలకు అధ్యక్షత వహించిన కనుపర్తి వరలక్ష్మమ్మ ప్రసంగిస్తూ దీర్ఘకాలంగా కొనసాగుతున్నప్పటికీ ఈ సమాజం 'పరిగణించదగ్గ' ఫలితాలను, విజయాలను సాధించలేదని అభిప్రాయపడ్డారు. 1910 నవంబరు 24న ఏలూరులో సత్తిరాజు శ్యామలాంబ నాయకత్వంలో 'హేలాపుర జనానా ప్రార్థనా సమాజము' ఏర్పడింది. చామర్ల గంగమ్మ (ప్రారంభంలో), కలగర పిచ్చమ్మ, కలగర రామమ్మ (తర్వాత)ల కృషి

ఫలితంగా అభివృద్ధి చెందిన ఈ సమాజం, వీక్లీ సమావేశాలకు చాటపర్రు మొదలైన ప్రక్క గ్రామాలనుండి కూడా స్త్రీలు వచ్చేవారంటే విశేషమే! 1911 జనవరి 6న విజయవాడలో 'సత్యసంవర్ధనీ సమాజం' స్థాపించబడ్డది. పి.లక్ష్మీకాంతమ్మ దీని శాశ్వత అధ్యక్షురాలు కాగా, గుండాల సుభద్రమ్మ, పి. త్రిపురసుందరమ్మలు కార్యదర్శినులు. స్త్రీలకు సంబంధించిన 15 అంశాలు అక్కడ చర్చించబడతాయని సమాజం చెప్పుకుంది. 1912 డిసెంబర్ 2 న పులుగుర్త లక్ష్మీనరసమ్మ గౌరవార్థం ఒక 'ప్రత్యేక' సమావేశాన్నీ, తేనీటి విందునూ ఏర్పాటు చేసింది. 1913 జనవరి 4,5 తారీఖుల్లో సమాజం జరుపుకున్న వార్షికోత్సవాలకు కాకినాడ నుండి వచ్చిన కళ్లేపల్లి వేంకట రమణమ్మ అధ్యక్షత వహించగా మొదటిరోజు 300 మంది, రెండవరోజు 500 మంది స్త్రీలు హాజరయ్యారు. ఈ సమాజానికి మంచి లైబ్రరీ ఉండేది. 1918 అక్టోబరు 31వ తేదీన పెద్దాపురంలో 'సరస్వతీ నికేతనము' అనే సమాజాన్ని బులుసు సూరమ్మ ప్రారంభించారు. లీలావతీ చెల్లమ్మ దీని అధ్యక్షురాలు కాగా అవసరాల శేషగిరమ్మ కార్యదర్శిని: శేషగిరమ్మ 'అనసూయ' అనే స్త్రీల పత్రికకు విలేకరిగా కూడా పని చేసింది. 'అనసూయ' పత్రికా సంపాదకురాలైన వింజమూరి వేంకటరత్నమ్మ ఈ సమాజంతో సన్నిహిత సంబంధం కలిగి ఉండేది. 1922లో ఉన్నవ లక్ష్మీ బాయమ్మ గుంటూరులో 'శారదానికేతనము'ను స్థాపించింది. ఈవిడ భర్త అయిన లక్ష్మీనారాయణ సంఘ సంస్కర్త, 'స్వాతంత్ర్యోద్యమ' కారుడు కావడంచేత ఈ సమాజం ప్రసిద్ధి కెక్కింది. సంఘసంస్కరణతో పాటు జాతీయోద్యమ భావాలు కూడా ఈ సమాజ కార్యక్రమాల్లో ప్రతిఫలించాయి.

కొమర్రాజు అచ్చమాంబ 1928 లో విజయవాడలో 'భారత మహిళా మండలి'ని స్థాపించింది. (బహుశా) 1941 ఏప్రిల్ నెలలో ఈ సమాజం జరుపుకున్న పదమూడవ వార్షికోత్సవానికి అధ్యక్షత వహించిన కనుపర్తి వరలక్ష్మమ్మ ఈ సమాజం బాగా పనిచేస్తోందని కితాబునిచ్చింది. 1931లో బాపట్లలో స్థాపించబడ్డ 'స్త్రీ హితైషిణీ మండలి'కి వెలగపూడి సరస్వతమ్మ అధ్యక్షురాలు కాగా, శారదలేఖల ఫేం కనుపర్తి వరలక్ష్మమ్మ కార్యదర్శిని. వెన్నా అనంతరామమ్మ ఈ సమాజాన్ని మెచ్చుకుంటూ తను 'వివిధ ప్రదేశాల్లో అనేక స్త్రీల సంఘాలను చూశాననీ, అన్ని విధాలుగా స్త్రీల అభివృద్ధికి పాటుపడుతున్న ఇలాంటి సంఘాన్ని చూళ్ళేద'నీ అంది. ఈ సంఘం 1941 మే 17 నుండి జూలై 27 వరకు బాలికలు, స్త్రీల కొరకు 'వేసంగి పాఠశాల'ను నడిపింది. ఈ విషయం అప్పటికి ఆంధ్రదేశానికి కొత్తే కాక వింతకూడా! సమకాలీన మహిళా ఉద్యమంలో గణనీయమైన పాత్రను పోషిస్తూ వస్తున్న మల్లాది సుబ్బమ్మ కూడా అయిదు సంవత్సరాల పాటు ఈ సంఘానికి కార్యదర్శినిగా పనిచేసినారు.

ఉన్నవ లక్ష్మీబాయమ్మ, రాయసం రత్నమ్మల ప్రోత్సాహంతో 1938లో నరసారావుపేటలో 'స్త్రీ విద్యాభివర్ధనీ సమాజము' స్థాపించబడింది. 1938లో ఏలూరులో 'పశ్చిమగోదావరి జిల్లా మహిళా సంఘం' స్థాపించబడింది; నరసాపురం, భీమవరం, తణుకు మొదలైన ప్రాంతాల్లో దీని శాఖలుండినాయి. స్త్రీల దైనందిన సమస్యల పట్ల స్పందించి క్రియాశీలక పాత్ర పోషించిన ఈ సంఘం యితర స్త్రీ సంఘాల కన్నా భిన్నమైనది. స్త్రీల మరుగుదొడ్లు, నీటి సమస్య మొదలైన సమస్యల పరిష్కారానికి 300 మంది సంతకాలను సేకరించి కమిషనరుకు సమర్పించింది. స్థానిక ప్రసూతి కేంద్రం సమస్యల వలయంలో చిక్కుకొనగా పరిష్కారంకోసం ధర్నాకూడా చేసింది. స్త్రీల పౌర, రాజకీయ హక్కుల కోసం కూడా ఈ సమాజం పోరాడింది. వామపక్ష భావాలు కల మహిళా సంఘమిది.

వలసాంధ్రలో ప్రారంభమై శాఖోపశాఖలుగా విస్తరించి యిప్పటికీ బృహత్తరంగా కృషి చేస్తున్న సంఘం 'ఆంధ్రమహిళాసభ'. గుమ్మడిదల దుర్గాబాయమ్మ నేతృత్వంలో 1938 జూన్‌లో 'లిటిల్ లేడీస్ ఆఫ్ బృందావన్' గా మద్రాసులో ప్రారంభమైన ఈ సంఘం 1942 ఫిబ్రవరి 4న ప్రస్తుత నామంతో అవతరించింది. స్త్రీలను చైతన్యవంతుల్ని చేయడానికి అనేక కార్యక్రమాల్ని చేపట్టిన ఈ సమాజం 'ఆంధ్రమహిళ' అనే స్త్రీల పత్రికను కూడా ప్రారంభించింది. స్త్రీల చైతన్యంలో క్రమంగా వచ్చిన రాడికల్ మార్పులకు 'ఆంధ్రమహిళ' అద్దంపడుతుంది.

వలస రాయలసీమలో కూడా పలు స్త్రీలసంఘాలు పుట్టుకొచ్చాయి. ఆంధ్రప్రాంతంలోని మహిళాసంఘాల సంఖ్యతో పోల్చి చూస్తే రాయలసీమలో వచ్చిన మహిళాసంఘాల సంఖ్య చాలా తక్కువ. ఆంధ్ర ప్రాంతంలోలా బలమైన సంఘసంస్కరణ కార్యకలాపాలు యిక్కడ రాకపోవడం మొదలైనవి దీనికి కారణంగా చెప్పుకోవచ్చు; ఎదను విదారించే 'వెనక్కిదొబ్బబడిన తనం' ఉండనే ఉంది! అయినప్పటికీ కొన్ని మహిళా సంఘాలు, ఆలస్యంగానే అయినా, ప్రారంభమయినాయి. రాయలసీమలో ప్రారంభమైన మొట్టమొదటి మహిళా సంఘమేదో తెలియరావట్లేదు. 1905 మార్చిలో 'బాలికా విద్యాభివర్ధనీ సమాజము' బళ్లారిలో స్థాపితమైంది. ('దత్తమండలాలు'గా క్షీత్కరింపబడ్డ వలస రాయలసీమలో బళ్లారి భాగం: వలసరాయలసీమ వారి 'సాంస్కృతిక రాజధాని' గా పేరుగాంచిన బళ్లారి దుర్మార్గంగా కర్ణాటకలో చేర్చబడ్డది) కె. వెంకట్రావు, టి. వరదరాజులు నాయుడు మొదలైనవారి కృషి ఫలితంగా ఏర్పడ్డ ఈ సమాజం బాలికల విద్యాభివృద్ధికై తోడ్పడింది. స్త్రీలు ఇందులో పాల్గొన్న దాఖలాలు కనిపించడం లేదు. 1910 లో కర్నూలులో 'హిందూ స్త్రీ విద్యాభివర్ధనీ సమాజము' ఆంధ్ర ప్రాంతంలో పలు స్త్రీ సమాజాలనేర్పర్చిన బుచ్చి బంగారమ్మ చొరవవల్ల స్థాపించబడింది. జానమ్మ దీని శాశ్వత అధ్యక్షురాలు కాగా, ఎస్. సుందరమ్మ కార్యదర్శిని. వారంవారం ఈ సమాజం జరిపిన సమావేశాలకు సుమారు 30 నుండి 40 మంది స్త్రీలు హాజరయ్యేవారు. 1911 వ సంవత్సరంలో మొత్తం 35 సమావేశాలు జరిగాయి. ఆ సంవత్సరంలోనే చందాల రూపంలో 55 రూపాయలు వసూలు కాగా వాటినుండి 27 రూపాయలను కాకినాడలో నిర్వహించ తలపెట్టిన 'ఆంధ్రమహిళాసభ' నిర్వహణ నిమిత్తం పంపడమైంది. 'నరసాపుర స్త్రీ సమాజము' నిర్వహించిన ప[illegible] నెగ్గిన బాలికలు, స్త్రీలకు యివ్వదలచిన బహుమతుల ఖర్చు నిమిత్తం ఏ[illegible] రూపాయలను పంపడం జరిగింది. 1911 నవంబరు తొమ్మిదిన ఈ సమాజం ప్రథమ వార్షికోత్సవాన్ని జరుపుకుంది. ఆ రోజు మధ్యాహ్నం రెండుగంటలకు ప్రారంభమైన సమావేశం సాయంత్రం ఏడుగంటలవరకు సాగింది. కొంతమంది ఆంగ్ల స్త్రీలను కలుపుకొని సుమారు రెండువందలమంది స్త్రీలు హాజరయ్యారు. వలస రాయలసీమలోని యితర జిల్లాల స్త్రీలు కూడా ఈ సమాజ అభివృద్ధిలో శ్రద్ధ చూపించారు. కడప జిల్లా జమ్మలమడుగు నుండి ఎస్. రాజమ్మ కర్నూలు వచ్చినపుడు సమాజానికి వచ్చి రెండు-మూడు

ఉపన్యాసాలివ్వడమే కాకుండా సంగీత కచేరీ కూడా చేసింది. కర్నూలు జిల్లా ద్రోణాచలం నుండి ఎస్. రంగమణి సమాజ ప్రథమ వార్షికోత్సవం లో తోడ్పడటానికి తన చెల్లెలుతో కలసి ఒకరోజు ముందే కర్నూలు చేరుకుంది.

'భారతమహిళా శారదా సమాజము' అనంతపురంలో స్థాపించ బడింది. 1935 జూన్ 'గృహలక్ష్మి' సంచిక ఈ సమాజ సభ్యుల ఫోటోను ప్రచురించింది. నంద్యాలలో 'మహిళాసమాజము' అనేదుండేది. 1939 డిసెంబర్ 'గృహలక్ష్మి' సంచిక సమాజ సభ్యురాండ్ర ఫోటోను ప్రచురించింది. 1942లో మదనపల్లిలో ఒక 'మహిళాసమాజము' స్థాపించబడింది. రాయలసీమ స్త్రీలు సమకాలీన మహిళా ఉద్యమంలో పాల్గొని తమవంతు తోడ్పాటునందించారు. 'ఆల్ ఇండియా ఉమెన్స్ కాన్ఫరెన్స్' రాష్ట్ర శాఖయైన 'ఆంధ్రరాష్ట్ర మహిళాసభ' ఎనిమిదవ, పదనాలుగవ, పదిహేనవ సమావేశాలు రాయలసీమలో జరిగాయి; వీటి నిర్వహణలో రాయలసీమ స్త్రీలు ప్రముఖమైన పాత్రను పోషించారు. 1934 నవంబర్ 18న మదనపల్లిలో జరిగిన ఎనిమిదవ సమావేశానికి గుమ్మడిదల దుర్గాబాయమ్మ అధ్యక్షత వహించగా కొంతమంది 'హరిజన' స్త్రీలతో కలుపుకొని 500కు పైగానే స్త్రీలు హాజరయినారు. ఈ కార్యక్రమ నిర్వహణలో కోటిరెడ్డి రామసుబ్బమ్మ (కడప) కీలక పాత్ర పోషించింది. ఆంధ్రరాష్ట్ర మహిళాసభ పదునాల్గవ సమావేశం 16, 17 డిసెంబర్ 1939 న కడపలో జరిగింది. బేగం అమీరుద్దీన్ అధ్యక్షత వహించిన ఈ సభకు డెలిగేట్లే సుమారు 200 మంది వివిధ ప్రదేశాలనుండి వచ్చినారు. మొదటిరోజు సమావేశానికి సుమారు వెయ్యిమంది, రెండవ రోజు రెండువేలకు పైగా హాజరయ్యారు. 'పెద్ద సంఖ్యలో' ముస్లిం స్త్రీలు కూడా హాజరవగా, బేగం అమీరుద్దీన్ వారికోసం ప్రత్యేకంగా ఉర్దూలో ఉపన్యసించింది. మహాసభ పదిహేనవ సమావేశాలకు కూడా రాయలసీమే వేదికయ్యింది. ఈసారి నవంబర్ 24, 1940న నంద్యాలలో జరిగాయి. 1910 నుండి జరగడం మొదలుపెట్టిన ఆంధ్రమహిళాసభ సమావేశాలకు రాయలసీమ స్త్రీలు హాజరయ్యేవారు. వీరిలో డాక్టర్ కె. లక్ష్మమ్మ (లక్ష్మీదేవి?) ముఖ్యులు. బళ్లారి వాస్తవ్యురాలైన లక్ష్మమ్మ ఢిల్లీలోనూ, బాంబేలోని 'నేషనల్ మెడికల్ కాలేజి'లోనూ వైద్య విద్యనభ్యసించిన తర్వాత బాంబేలోని కామా అండ్ ఆల్బైస్ ఘోషా హాస్పిటల్ లో వైద్యురాలిగా పనిచేశారు. సామాజిక సేవలో క్రియాశీలక పాత్ర పోషిందం వల్ల ఆమె 'బొంబాయి ఆంధ్రమహాసభ' కు కార్యదర్శినిగా ఏకగ్రీవంగా ఎన్నికైంది. 1929 నవంబర్ 'గృహలక్ష్మి' సంచిక ఆమెను ప్రశంసిస్తూ (కార్యదర్శినిగా ఎన్నికైన సందర్భంగా) ఒక నోట్‌ను ప్రచురించింది. రాయలసీమలో సంఘ సంస్కరణోద్యమం గూర్చి పరిశోధనలు దాదాపుగా శూన్యం కావడం చేత ఇక్కడి విషయాలు మనకు తెలియరావట్లేదు: ఇప్పటికైనా వలస రాయలసీమలోని 'సంఘ సంస్కరణోద్యమం' గూర్చి ఎవరైనా పరిశోధన మొదలుపెడితే బాగుంటుంది. ఇరవయ్యవ శతాబ్ది ప్రారంభంనుండీ సమీకరించబడ్డ శూద్రకులాల్లో కులచైతన్యం కలుగుతూపోయి వలు కుల సంఘాలేర్పడ్డాయి. ఈ కుల సమాజాలకు అనుబంధంగా ఆయా కులాల స్త్రీల సంఘాలు కూడా ప్రారంభించబడ్డాయి. వైశ్యస్త్రీల సంఘము, వైశ్యసేవాసదనము, కమ్మ స్త్రీల సంఘము మొదలైనవి వీటిలో కొన్ని. 1934 ఏప్రిల్ 18న మొట్టమొదటిసారిగా 'మద్రాస్ స్టేట్ ముస్లిం ఉమెన్స్ కాన్ఫరెన్స్' బేగం అమీరుద్దీన్ అధ్యక్షతన జరిగింది.

ఈ విధంగా వలసాంధ్రలోని వివిధ ప్రాంతాల్లో ఇరవయ్యవ శతాబ్ది ఆరంభం నుండి మహిళా సమాజాల స్థాపన ఒకవైపు జరుగుతూ పోగా యావదాంధ్ర (వలసాంధ్ర) మహిళల్ని ఒకే వేదికమీదికి తెచ్చే ప్రయత్నాలు కూడా జరిగి సఫలమయ్యాయి. యావదాంధ్ర మహిళల వేదికగా 'ఆంధ్రమహిళా మహాసభ' ఉనికిలోకి వచ్చింది. దాని ప్రథమ సమావేశం పులుగుర్త లక్ష్మీనరసమ్మ అధ్యక్షతన 1910 జూన్ 2 వ తేదీన గుంటూరులో జరిగింది. ఆపైన ప్రతి సంవత్సరం వివిధ ప్రదేశాల్లో సెషన్స్ జరగనారంభించాయి. రెండవ సెషన్ 1911 ఏప్రిల్ 28, 29 తేదీల్లో 'కాకినాడ విద్యార్థినీ సమాజం' ఆధ్వర్యంలో కాకినాడలో జరిగింది. మహిళల ప్రసంగ పాఠాలు 'ఉపన్యాస మంజరి' అను పుస్తక రూపంలో ప్రచురించబడ్డాయి. మూడవ సెషన్ బుర్రె బుచ్చి బంగారమ్మ అధ్యక్షతన నిడుదవోలులో 1912 మే 23, 24 తేదీల్లో జరిగింది. నాల్గవ సెషన్ 1913 మార్చి 23, 24 తారీఖుల్లో బందరులో జరిగింది. ఐదవ సెషన్ 1914 మే 11, 12 తేదీల్లో కొటికలపూడి సీతమ్మ అధ్యక్షతన విజయవాడ లో జరిగింది. ఆరవ సెషన్ 1915లో విశాఖపట్నంలో జరిగింది. ఏడవ సెషన్ 1916 మేలో నడుపల్లి బుచ్చి వెంకటసుబ్బమ్మ, మానూరి సీతమ్మల ఆధ్వర్యంలో కాకినాడలో జరిగింది. ఎనిమిదవ సెషన్ 1917 జూన్ 1, 2 తేదీల్లో నెల్లూరు (విక్రమపురి)లో జరిగింది: కాశీనాథుని రమాబాయమ్మ జనరల్ ప్రెసిడెంట్‌గా వ్యవహరించారు. ఆపై సమావేశాలు ఎక్కడెక్కడ జరిగాయో ఈ వ్యాసకర్తకు సమాచారం దొరకలేదు. 'ఆంధ్రమహిళా మహాసభ' సమావేశాలకు వలసాంధ్ర నలుమూలలనుండీ స్త్రీలు హాజరవడమే కాకుండా, కార్యక్రమాల్లో ఉత్సాహంగా పాల్గొనేవారు. స్త్రీలకు చెందిన వివిధ విషయాలపై ఉపన్యాసాలు, వాగ్వివాదాలు, తీర్మానాలు ప్రవేశపెట్టడం, చర్చించడం, పాస్ చెయ్యడం మున్నగు వాటిని జోరుగా సాగించేవారు. ఈ అనుభవమంతా ఒక ఎత్తుకాగా, సొంత గ్రామాలనుండి దూర ప్రదేశాలకు, కొన్ని సందర్భాల్లో ఒంటరిగా, ప్రయాణించడం మొదలగునవి స్త్రీలకొక కొత్త ప్రపంచాన్ని పరిచయం చేయడమే. స్త్రీలలో 'సోదరీతత్వ' (సిస్టర్‌హుడ్) పరిమళాలను గుబాళింపజేయడంలో మహాసభ పాత్ర శ్లాఘనీయమైనది.

ఈ'మహాసభ'తో పాటుగా 'ఆంధ్రరాష్ట్ర మహిళాసభ' అనే రాష్ట్ర స్థాయి వేదిక కూడా మహిళోద్యమంలో ప్రముఖ పాత్ర పోషించింది. 1927లో ఏర్పడ్డ జాతీయ మహిళా వేదిక అయిన 'ఆల్ ఇండియా ఉమెన్స్ కాన్ఫరెన్స్' రాష్ట్రశాఖ ఇది. ప్రతి సంవత్సరం వలసాంధ్రలోని వివిధ పట్టణాల్లో సమావేశాలు జరిగేవి. 1927లో కాకినాడలో మొదటి కాన్ఫరెన్స్ జరిగింది. 1929లో విజయవాడలో జరిగిన మూడవ కాన్ఫరెన్స్‌కు ముత్తులక్ష్మిరెడ్డి అధ్యక్షత వహించింది. నాల్గవ (1930), ఐదవ (1931), ఆరవ (1932), ఏడవ (1933), ఎనిమిదవ (1934), పదునాల్గవ (1939), పదిహేనవ (1940) సమావేశాలు వరుసగా బందరు; గుంటూరు, రాజమండ్రి, ఏటూరు, మదనపల్లి, కడప, నంద్యాలలో జరిగాయి. ఏ.ఐ.డబ్ల్యూ.సి. ప్రాంతీయ సమావేశాలు జరపడంలో ఆంధ్రస్త్రీలు మిగతా ప్రదేశాల్లోని స్త్రీల కన్నా చాలా ముందుండేవారని బేగం అమీరుద్దీన్ కితాబునిచ్చింది.

ఈ విధంగా వలసాంధ్రలో వివిధ ప్రాంతాల్లో అనేక మహిళా సంఘాలు ఉద్భవించాయి. స్థలాభావం కారణంగా కొన్నింటిని మాత్రమే మనం పైన చూశాము. వలసాంధ్రలో ప్రచురించబడ్డ వివిధ స్త్రీల పత్రికలు

నిజానికి రిజర్వేషన్ల పేరుమీద కొనసాగుతున్నవి రిజర్వేషన్లు కావనీ, అనాదిగా అగ్రవర్ణాలకు కొనసాగుతున్న రిజర్వేషన్లకు డీ రిజర్వేషన్ అని అంటున్నారు **తోట సత్యనారాయణ, వరయోగుల వెంకటేశ్వర స్వామి**

# డీ రిజర్వేషన్లతో సామాజిక న్యాయం సాధ్యమా?

*(.. గత సంచిక తరువాయి)*

## ప్రజాప్రయోజనాలు - తీర్పులు

రాజ్యాంగంలోని అధికరణ 30 (1) ప్రకారం అల్ప సంఖ్యాక వర్గాలవారు విద్యా సంస్థలను నెలకొల్పి నిర్వహించుకోవచ్చు. భారతీయు లందరు ఏ వృత్తినైనా, వ్యాపారాన్నైనా చేయవచ్చునంటూ అధికరణ 91(1)లను దృష్టిలోపెట్టకొని సుప్రీంకోర్టు తీర్పుఇచ్చినట్లుగా చెప్పుకుంటు న్నది. పైగా, గతంలో రెండు రాజ్యాంగ ధర్మాసనాలు వెలువరించిన తీర్పులకు వివరణ మాత్రమేనని ఈ తీర్పు ప్రకటిస్తున్నది. కానీ, వాస్తవానికి గతరాజ్యాంగ ధర్మాసనాలు ఇచ్చిన రెండు తీర్పులు అనేక సందేహలకు, ప్రశ్నలకు అవకాశమిచ్చేవిగావున్నాయి. ఆ తీర్పులు కూడా సామాజిక న్యాయ దృష్టితో సమాజిక వర్గాల విద్యా ప్రయోజనాలు, వారి విద్యాభివృద్ధి వంటి అంశాలు దృష్టిలో పెట్టకుని వెల్లడించిన తీర్పులు కాదన్న అభిప్రాయం వివిధ వర్గాల్లో బలంగా వున్నది. ఈ క్రమంలో సుప్రీంకోర్టు తాజాగా వెల్లడించిన తీర్పుకుడా అనేక సందేహాలకు తావిచ్చింది. అంతేకాదు, 2002 నాటి పాయ్ ఫౌండేషన్ కేసులోను, 2003 నాటి ఇస్లామిక్ అకాడమీ కేసులోనూ విచారణ సందర్భంగా తానే చేసిన సూచనలకు విరుద్ధంగా ఈ తీర్పు వెల్లడించడం విస్మయాన్ని కలిగిస్తుంది. గత తీర్పులు, రాజ్యాంగంలోని అధికరణలు 30 (1), 91 (1) ప్రకారమే ఈ తీర్పు అని చెప్పిన ఉన్నత న్యాయస్థానం 'ఏ వ్యాపారం పైనైనా సహేతక నియంత్రణలు విధించవచ్చునంటున్న" రాజ్యాంగంలోని అధికరణ 19(6) ను విద్యా సంస్థలకు వర్తింప చేయడంలో ఎందుకు దృష్టి సారించలేదు. ఆదేశిక సూత్రాలకు లోబడి అధికరణ 225 ప్రకారం సామాజిక న్యాయాన్ని పరిరక్షించాలన్న విషయాన్ని సుప్రీంకోర్టు ఎందుకు

---

మహిళాసంఘాల గుర్చిన సమాచారాన్ని అందజేశాయి. వివిధ సంఘాల రిపోర్టులు, వాటి సమావేశాల తాలూకు విపులమైన విశేషాలు అందించడమే కాకుండా స్త్రీల ప్రసంగపాఠాలను ప్రాధాన్యతనిచ్చి ప్రచురించాయి. ఆ విధంగా ఆయా పత్రికలు మహిళాసంఘాలకు సంబంధించిన సమాచార గనులు అని చెప్పవచ్చు. మహిళా సంఘాల కార్యకలాపాలు, చర్చించిన విషయాలు, మహిళోద్యమ నిర్మాణం లోనూ, స్త్రీలను చైతన్యవంతుల్ని చేయడంలోనూ అవి పోషించిన పాత్రనూ, వాటి స్వభావాన్నీ, పరిమితులనూ వ్యాసం చివరలో చూద్దాం. ఇపుడు కాకినాడ విద్యార్థినీ సమాజం దగ్గరికి పోదాం.

*(మిగతా వచ్చే సంచికలో....)*

### అంత్యసూచికలు

* 2007 జనవరి 6,7 తేదీల్లో కడపలో జరిగిన ఆంధ్రప్రదేశ్ చరిత్ర కాంగ్రెస్‌లో సమర్పించిన "అయ్యవార్లను జేయబోయిన కోతియయ్యెనన్నట్టు" : 'కాన్‌ట్రవర్సి ఓవర్ ఎ ఉమెన్స్ ఆర్గనైజేషన్ ఇన్ కలోనియల్ ఆంధ్ర - ది స్టోరీ ఆఫ్ ది శ్రీ విద్యార్థినీ సమాజము, కాకినాడ' అనే వ్యాసానికి సంక్షిప్తరూపం ఇది. కానీ వ్యాసంలోని చివరిభాగం మాత్రం కొత్తగా చేర్చినది. దీంతో పాటుగా మరికొన్ని ఇతర అంశాలను ప్రస్తుత వ్యాసంలో చేర్చడమైనది.

1. అపర్ణాబసు, భారతీ రే, విమెన్స్ స్ట్రగుల్ : ఎ హిస్టరీ ఆఫ్ ది ఆల్ ఇండియా ఉమెన్స్ కాన్ఫరెన్స్, 1927-2002 (ద్వితీయ ముద్రణ), మనోహర్, కొత్తఢిల్లీ, 2003, పు. 15.

2. ఉదాహరణకు చూడండి : వి. రామకృష్ణ, సోషల్ రిఫార్మ్ ఇన్ ఆంధ్ర (1848-1919), వికాస్ పబ్లికేషన్స్, కొత్తఢిల్లీ, 1983. ఈ పుస్తకం ఆంధ్రదేశంలో సంఘ సంస్కరణోద్యమాలు శీర్షికతో తెలుగులోకి అనువదితమై హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ద్వారా ప్రచురింపబడ్డది. (ప్రథమ ముద్రణ 1986, ద్వితీయ ముద్రణ 2003);, ఎస్. ఇన్నారెడ్డి, 'సోషల్ రిఫార్మ్ మూమెంట్స్ ఇన్ ఆంధ్ర (1920-1947)', పి.ఎచ్.డి. పట్టాకోసం 1998లో హైదరాబాద్ యూనివర్సిటీకి సమర్పించిన వ్యాసం.

3. మల్లాది సుబ్బమ్మ, ఆంధ్రప్రదేశ్‌లో మహిళోద్యమం : మహిళా సంఘాలు (1860-1983) ప్రజాస్వామ్య ప్రచురణలు, హైదరాబాద్, 1985. ఈ పుస్తకం 'ఉమెన్స్ మూమెంట్ అండ్ ఆర్గనైజేషన్స్ : రీజినల్ పర్‌స్పెక్టివ్ (1860-1983) శీర్షికతో ఆంగ్లంలోకి తర్జుమా చేయబడి 1994లో బుక్‌లింక్స్ కార్పోరేషన్, హైదరాబాద్ ద్వారా ప్రచురింపబడింది.

4. ఉదాహరణకు 'ఆంధ్రరాష్ట్ర మహిళా మహాసభ' మొదటి సమావేశం 1927లో జరగగా సుబ్బమ్మగారి గ్రంథం (ఇంగ్లిష్)లో 1929లో జరిగిందని ఇచ్చి ఉంది. పు. 51. తెలుగుపుస్తకంలో (పు. 87) 'ప్రథమ ఆంధ్రరాష్ట్ర మహిళా మహాసభ 1929లో జరిగింది. తుర్లపాటి రాజేశ్వరమ్మ ఆహ్వాన సంఘాధ్యక్షురాలు. మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ ఉపాధ్యక్షురాలు డా. ముత్తులక్ష్మి రెడ్డి అధ్యక్షత వహించింది.

5. వలసాంధ్రలో ఉద్భవించిన వివిధ స్త్రీ సమాజాలకు సంబంధించిన ప్రాథమిక సమాచారానికై చూడండి : వకుళాభరణం రామకృష్ణ, ఆంధ్రదేశంలో సంఘ సంస్కరణోద్యమాలు. పు. 65-68. ఎక్కువ సమాచారానికై మల్లాది సుబ్బమ్మ పుస్తకాన్ని చూడండి. సమాజాలకు సంబంధించిన విస్తారమైన సమాచారం కోసం చూడండి ఎస్. మహబూబ్ బాషా, 'స్ప్రెడింగ్ ది ఫ్రాగ్రెన్స్ ఆఫ్ సిస్టర్‌హుడ్ : ఉమెన్స్ ఆర్గనైజేషన్ అండ్ కాన్షస్‌నెస్ ఇన్ కలోనియల్ ఆంధ్ర, 1902-1947' మిమియోగ్రాఫ్.

విస్మరించినట్లు? ఇప్పటి వరకు ప్రైవేటు వృత్తి విద్యా సంస్థలతో అరకొరగానైనా ప్రభుత్వ జోక్యం, నియంత్రణ కలిగిఉంది. అయినప్పటికీ, వృత్తి విద్యా సంస్థలు తమకున్న పరిమితులను, ఆంక్షలను ఏనాడు పాటించలేదు. అడ్మిషన్ల నిర్వహణలోనూ, ఫీజులు, డొనేషన్ల వసూళ్లలోనూ, ఎన్.ఆర్.ఐ.ల పేరిటా, మేనేజ్‌మెంట్ కోటాలకు, గవర్నింగ్ బాడీల కోటాలకు ఏర్పాటు చేసిన డొనర్ సీట్ల రిజర్వేషన్‌కు మాత్రం మెరిట్‌ను ధ్వంసం చేస్తున్నారు. ఎందుకంటే, వాటి ప్రాతిపదిక డబ్బు కనుక. ఆశ్రిత పక్షపాతంతో కొట్టుకుపోతున్న ఈ దేశంలో ఎంపికదార్ల బంధువులు, సంరక్షితుల కోసం కేటాయించిన సీట్లు మాత్రం మెరిట్‌ను కూల దోయటంలేదు. వసూలు చేసే కాంపిటీషన్ ఫీజులు మెరిట్‌కు అనుకూలమైనవి, సుప్రీంకోర్టు ఇలాంటి రూలింగు ఇచ్చింది. కానీ కళాశాలలు నిర్వహణలోను ఇష్టానుసారంగా వ్యవహరిస్తున్నాయి. బోగస్ మైనారిటీ, మైనారిటీయేతర కళాశాలల ఏర్పాటుకు పూనుకుంటున్నాయి. విద్యా సంస్థల నిర్వహణలో అఖిల భారత సాంకేతిక విద్యామండలి, అఖిల భారత విద్యామండలి సూచించే కనీసమార్గ దర్శక సూత్రాలను, నియమ నిబంధలనలను పాటించడంలేదు.

పై నేపథ్యంలో ప్రైవేట్ వృత్తి విద్యాసంస్థల్లో రిజర్వేషన్లు రద్దయితే పేద, మధ్యతరగతి విద్యార్థులు ప్రధానంగా దళిత, గిరిజన, బలహీన వర్గాల విద్యార్థులు తీవ్రంగా నష్టపోతారు. గతంలో సుప్రీంకోర్టు రాజ్యాంగ ధర్మాసనాలు రెండు సందర్భాలలో ఇచ్చిన తీర్పులు సైతం ఈ అంశం జోలికి పోలేదు. దేశంలో ప్రధానంగా దక్షిణాది రాష్ట్రాలలో తమిళనాడు, కేరళ, కర్నాటకలలో వివిధ వృత్తి విద్యాకోర్సులలో సీట్ల భర్తీ విధానం 50 శాతం ప్రభుత్వ కోటా (కన్వీనర్), 50 శాతం మేనేజ్‌మెంట్ కోటా; ఆంధ్రప్రదేశ్‌లోనైతే 85 శాతం ప్రభుత్వం కోటా; 15 శాతం మేనేజ్‌మెంట్ కోటా. అదేవిధంగా మైనారిటీ కళాశాలల్లో 30 శాతం కింద సీట్లు కేటాయింపు జరుగుతోంది. అంతేకాదు, ప్రభుత్వ నియంత్రణ, పర్యవేక్షణ లోనే, అడ్మిషన్ల ప్రక్రియ కొనసాగుతోంది. సుప్రీం కోర్టు తాజా తీర్పుతో ఈ విధానం రద్దవుతుంది. ప్రైవేటు వృత్తి విద్యా సంస్థల యాజమాన్యాలే నూటికి నూరు శాతం వారి ఇష్టానుసారంగా అడ్మిషన్లు నిర్వహించు కోవచ్చన్న హక్కు దాఖలుపర్చబడింది. ఏరకమైన ప్రభుత్వ మార్గదర్శక సూత్రాలను పాటించాల్సిన అవసరం వారికి లేదు. రిజర్వేషన్లను అమలు పరచాల్సిన బాధ్యత కూడా ఏ మాత్రం లేదు. దీనివలన అత్యధిక వృత్తి విద్యా కళాశాలలున్న మనరాష్ట్రంలో పరిస్థితి మరింత దిగజారుతుంది. రిజర్వేషన్లు, కేవలం ప్రభుత్వం ఆధ్వర్యంలో నిర్వహించే వృత్తి విద్యా సంస్థల్లో అమలవుతాయి. ప్రైవేట్, మైనారిటీ, అన్‌ఎయిడెడ్ కళాశాల్లో రిజర్వేషన్లు వర్తించవు. ఫలితంగా వివిధ కోర్సుల్లో ఉన్న కన్వీనర్ కోటా 95,204 సీట్లు, ప్రభుత్వ కళాశాల్లో, 5,599 సీట్లు మినహా మిగతా 89,606 సీట్లను రిజర్వేషన్స్, మెరిట్ కలిగిన విద్యార్థులు కోల్పోతారు. కన్వీనర్ కోటాలోని సీట్ల సంఖ్యను కోర్సులవారిగా పరిశీలిస్తే ఇంజనీరింగ్‌లో 64,405 సీట్లు, ఎం.సి.ఎ.లో 4,011 సీట్లు, ఎం.బి.ఏ.లో 3,491 సీట్లు, బి.ఫార్మసీలో 2,658 సీట్లు, బి.ఎడ్.లో 22,639 సీట్లను దళిత, గిరిజన, బలహీన వర్గాల విద్యార్థులు, ఇతరపేద, మధ్యతరగతి విద్యార్థులు కోల్పోతారు. రిజర్వేషన్లవల్ల ఇప్పుడిప్పుడే అరకొరగా వృత్తి విద్యను అందుకొంటున్న బడుగు, బలహీనవర్గాల విద్యార్థులకు రిజర్వేషన్లు రద్దయితే వారి విద్యా భవిష్యత్తు అంధకారంగా మారుతుంది. ఫలితంగా, బడుగు, బలహీనవర్గాలు 4 లేదా 5 దశాబ్దాలుగా విద్యావకాశాలకు దూరమయ్యాయి. ఈ క్రమంలోనే 1980 తరువాత కాలంలో దేశ, ఆర్థిక, రాజకీయ, సాంఘిక రంగాలలో ముఖ్యంగా ఆర్థిక రంగంలో చోటు చేసుకున్న మార్పులు, పరిణామాలు, విద్యా రంగాన్ని కూడా ప్రబలంగా ప్రభావితం చేశాయి. ఉన్నత విద్యావకాశాలు అధికమైనప్పటికీ, ప్రభుత్వ పెట్టబడి తగ్గుతోంది. ఉన్నత విద్యారంగంలో ప్రధానంగా సాంకేతిక, వృత్తిపరమైన విద్యలో ప్రభుత్వ బాధ్యత, నియంత్రణ క్రమంగా తగ్గుతూ వస్తున్నది. నిజానికి ఉన్నత విద్యలో ప్రభుత్వాలకు బాధ్యత ఉండకూడదన్న సామ్రాజ్యవాదుల ఒత్తిడి పెరిగింది. వర్ధమాన దేశాలలో ప్రభుత్వాలు ప్రాథమిక విద్యనందించే బాధ్యతలకే పరిమితం కావాలన్నది, ఉన్నతవిద్యనుపూర్తిగా ప్రైవేటీకరించా లన్నదీ వారి విధానం. అదికూడా వారి ప్రయోజనాల పరిధిలోనే. వాస్తవానికి ప్రపంచీకరణ పరిస్థితుల్లో ప్రాథమిక విద్యతోపాటు, ఉన్నత విద్యారంగానికే ప్రభుత్వ సహకారం, నియంత్రణ, బాధ్యత మరింత అవసరం. కానీ, అందుకు భిన్నంగా ప్రభుత్వ విధానాలున్నాయి. ప్రభుత్వ విద్యారంగం క్రమంగా నిర్వీర్యమౌతోంది. మరోవైపున విద్యారంగాన్ని ప్రైవేట్ శక్తులు ఆవరించి ఉన్నాయి.

## గ్లోబలైజేషన్ - దాని ప్రభావం

డబ్ల్యూ.టి.ఒ, ప్రపంచబ్యాంక్, ఐ.ఎం.ఎఫ్.ల షరతులకు తలొగ్గి భారత పాలకులు చేసుకున్న ఒప్పందాలు దేశాన్ని అన్ని రంగాల్లో దివాళా తీయించాయి. వాటి ఆదేశాల ప్రకారం చేపట్టిన ప్రైవేటీకరణ, సరళీకరణ విధానాలను వేగవంతం చేశాయి - దీనితో ఆర్థిక, సామాజిక రంగాలు చిన్నాభిన్నమయ్యాయి - తీవ్ర సంక్షోభాన్ని ఎదుర్కొంటున్నాయి. ప్రభుత్వ రంగం ధ్వంసమవుతోంది. ప్రభుత్వ పరిశ్రమలు మూతపడుతున్నాయి. ప్రభుత్వశాఖలలో ఉద్యోగాలు రద్దవుతున్నాయి. వి.ఆర్.ఎస్, పథకాల పేరుతో ఉద్యోగులను బలవంతంగా బయటకు నెడుతున్నారు. నూతన పరిశ్రమలకు, ఉపాధి ఉద్యోగాలకు పూర్తి అవకాశాలు తగ్గిపోతున్నాయి. తదనుగుణంగానే విద్యారంగం పూర్తిగా ప్రైవేట్‌పరం కాబోతున్నది. గాట్ ఒప్పందం ఫలితంగా, విద్యారంగంలోకి విదేశీపెట్టుబడులు వస్తున్నాయి. దీని ఫలితంగా ఇప్పటికే పేద, మధ్యతరగతి వర్గాలు, అగ్రవర్ణాల్లోని పేదలు విద్యకు, ఉపాధికి దూరమవుతున్నారు. ఇందులో బడుగు, బలహీనవర్గాలు మరింత దూరమవుతున్నారు.

ఆదేవిధంగా ప్రపంచీకరణ, సరళీకృత ఆర్థిక సంస్కరణలు పటిష్టంగా అమలు జరగడానికి, ప్రైవేటీకరణ విధానాలు వేగవంతం కావడానికి అనుకూలంగా మన న్యాయస్థానాలను కూడా ప్రపంచ బ్యాంక్, డబ్ల్యూ.టి.ఒ.లు ప్రభావితం చేస్తున్నాయి. ప్రభుత్వాలు అనుసరిస్తున్న విధానాల వల్లనే కోర్టులు ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ సమర్థిస్తున్నాయి. ఒకవైపున ప్రైవేటీకరణ విధానం ప్రభుత్వాల హక్కు అనీ, దానిలో జోక్యం చేసుకునే అవసరం తమకు లేదని కోర్టులు తీర్పులిచ్చాయి. కార్మికులకు, ఉద్యోగులకు, ఇతర శ్రామిక జీవులకు ప్రభుత్వాలకు వ్యతిరేకంగా సమ్మెచేసే హక్కులేదని కూడా తీర్పులిచ్చాయి. మరోవైపున ప్రజల ఆస్తులైన ప్రభుత్వరంగ పరిశ్రమలను అతితక్కువ ధరలకే ప్రభుత్వాలు విక్రయిస్తుంటే కోర్టులు మౌనంగా వుంటున్నాయి. పాలకుల విధానాల వలన దేశంలో కార్మికులు, రైతులు ఆత్మహత్యలకు, ఆకలిచావులకు గురవుతున్నారు.

దేశంలో మెజారిటీ ప్రజలు పేదరికంలో, దారిద్ర్యంలో మగ్గుతున్నారు. వారిని నిరక్షరాస్యత, నిరుద్యోగం వెంటాడుతున్నాయి. ఈ పరిస్థితుల్లో సాధారణ ప్రజలకు, నిరుపేదలకు, బడుగు బలహీనవర్గాలకు న్యాయస్థానాలు రక్షణ కల్పించాలి. ప్రభుత్వ విధానాలను ప్రతిబింబించేవిగానే కోర్టు తీర్పులుండాలి. " ఏ దశలోనైనా న్యాయవ్యవస్థ తీరుతెన్నులకు పాలక పక్షప్రయోజనాలు, విధానాలే నిర్ణయిస్తాయి" గ్లోబలీకరణ పరిస్థితుల్లో ఈ విషయం మరింత ప్రస్ఫుటంగా కనబడుతుంది.

ప్రపంచీకరణ నేపథ్యంలో ఆర్థికరంగంలో రిజర్వేషన్లవల్ల భారత పరిశ్రమల్లో పోటీతత్వం తగ్గిపోతుందన్నది వారి ముఖ్య వాదన. లక్ష కోట్ల రూపాయల భారతీయ ప్రజల ధనాన్ని మింగేసిన ఈ ధనస్వాములు ఓబిసి విద్యార్థులకు రిజర్వేషన్ సౌకర్యం కల్పించటం 'తగింది కాదని' ప్రభుత్వ చర్యను విమర్శిస్తున్నారు. భారతదేశపు ఐటి పరిశ్రమకు ప్రాతినిధ్యం వహించే నాస్కామ్ అధ్యక్షుడు కిరణ్ కార్నిక్ ఇలా చెప్పారు. " ప్రైవేట్‌రంగంలోని మెరిట్‌ను ఇవి (రిజర్వేషన్లు) పూర్తిగా ధ్వంసం చేస్తాయి. (హిందుస్థాన్ టైమ్స్ 2006: మే:1) వీరి వరసలోనే టాటా గ్రూపు అధినేత రతన్ టాటా, ఇన్ఫోసిస్ నారాయణమూర్తి లాంటి వారు ప్రభుత్వ ప్రకటనను వ్యతిరేకించడంలో ప్రముఖపాత్ర వహిస్తున్నారు.

## రిజర్వేషన్లు – వాటి పర్యవసానాలు

రిజర్వేషన్ విధానం మూలంగా 'కులతత్వం' కంపు మరింత పెరుగుతోందని, దేశం కులాల వారిగా మరింత చీలిపోతుందని అభియోగం. ఈ అభియోగాలు కులతత్వంతో అణగిపోతున్నవాళ్ళ మీదే ఎందుకు చెయ్యబడుతున్నాయి? ఒక స్థాయిలో ఆలోచిస్తే, ఇప్పటి వరకు ప్రశాంతంగా సాగిపోతున్న జీవితాల్లో అనవసరమైన విషయాల్ని రేకెత్తించి గొడవల్ని సృష్టిస్తున్నారన్న అరోపణే వీటిలో ప్రధానంగా కనిపిస్తున్నాయి. ఈ అరోపణలు చేయడంలో సాంప్రదాయవాదులు, పత్రికలు, మీడియా కూడా భాగస్వాములవడమే కాకుండా స్వలాభాపేక్షతో యువతరాన్ని పక్కదారి పట్టించటంలో సఫలమవుతున్నారు.

ఉదాహరణకు ఢిల్లీ కేంద్రంగా తలెత్తిన రిజర్వేషన్ వ్యతిరేక ఆందోళనకు (ఓబిసి-27శాతం) ఎలక్ట్రానిక్ మీడియా, జాతీయవార్తా పత్రికలు పూర్తి మద్దతు పలికాయి. అంతేకాదు, ఆందోళనకు వ్యతిరేకంగా డాక్టర్లు చేపట్టిన కార్యక్రమాలను పూర్తిగా తెలియనివ్వకుండా చేసే ప్రయత్నం జరిగింది. మెడికోలు అందరిలోను 'ఒకే' అభిప్రాయం నెలకొనివుందని చెప్పటమే వారి ప్రయత్నం. ఆందోళన జరిగే సమయంలో రాత్రింబవళ్లు టి.వి.చానెళ్ళవారి కెమెరాలు అక్కడే వున్నా ఆ ప్రదర్శనను చిత్రీకరించలేదు. ఇంకొక ఉదాహరణకు పరీక్షల్లో వెనకబడ్డ కులానికి చెందిన ఒక విద్యార్థి 'ప్రతిభ' ను అంచనా వేయటం దగ్గరి నుంచి ఇంటర్వ్యూల్లో ఆఫీసర్ల పక్షపాత బుద్దులకు గురయ్యేవరకు కులరాజకీయాలు అమలులో వుంటూనే వుంటాయి.

❖ రిజర్వేషన్ల మూలంగా అసమర్థత, అవినీతి పెరిగిపోతాయన్నది మరొక వాదన.

ఉదాహరణకు మనదేశంలో కట్టిన మర్నాడే కూలిపోతున్న వంతెనల్ని, భవనాల్ని నిర్మించే ఇంజనీర్లందరూ ఆ వెనుకబడ్డ వర్గాలకు చెందిన వాళ్ళేనా? వాళ్లలో ప్రతిభ లేకపోవడమే ఈ అనర్థాలన్నింటికి కారణమా? అవినీతితో అంతస్తులు పెంచుకొని, ఆస్తులు అక్రమార్జన దారిన సంపాదించే వారు ఎవరో అందరికీ తెలుసు.

❖ అవినీతి సాగించి ఆ మేరకు ఆరోపణలు కూడా రుజువైన, ప్రతి ప్రభుత్వ శాఖకు చెందిన పై వరసలోనున్న అధికారులెవరు?

❖ దేశంలో నాసిరకం రోడ్లు, డ్యాంలు, భవనాలు కట్టిన తొలి కాంట్రాక్టర్లు ఎవరు?

❖ తమ నిర్లక్ష్యంతో రోగుల ప్రాణాలు తీసిన పై వరుసలో వున్న డాక్టర్లు ఎవరు?

❖ స్టాక్ మార్కెట్లలో, ఆర్థికలావాదేవీలలో, బ్యాంకింగ్‌లో కుంభకోణాలు సాగించిన పైవరసలో ఉన్నది ఎవరు?

❖ వేలాది మందిని చంపిన 40 ఏళ్లనాటి పాతవాహనాలకు పర్మిట్లు ఇచ్చిన పైవరసలోని ఉన్న రవాణా అధికారులు ఎవరు?

వీటిగురించిన సమాచారం అందిన తర్వాత, ప్రస్తుత సందర్భంలో వినిపిస్తున్న ప్రతిభ అనేమాటకు లేదా భావాలను పునర్ నిర్వచించుకుందాం.

❖ ప్రతిభ అనేది ప్రధానంగా పెట్టుబడిదారీ పారిశ్రామిక సమాజానికి పునాది. ఇది వ్యక్తుల మధ్యపోటీతత్వాన్ని పెంచుతుంది. అందువలన వ్యక్తుల మధ్య సామాజిక సంబంధాలను పెంపొందించు కోవడానికి ఒక అవరోధంగా తయారవుతుందనేది మరో సత్యం.

ఉదాహరణకు ఎంతో ప్రతిష్ఠ కలిగినదిగా చెప్పుకునే ఒక స్కూటర్ తయారీ కంపెనీ యజమాని ఈ మధ్య రిజర్వేషన్లను ఎద్దేవా చేశారు. ఈ కంపెనీ 50 ఏళ్లనాటి ముసలి టెక్నాలజీతో థర్డ్‌రేట్ స్కూటర్లు తయారు చేస్తూ ఈ దేశ ప్రజలకు అత్యధిక ధరకు అమ్ముతూ వచ్చిందన్న విషయాన్ని ఇక్కడ మనం గుర్తుచేసుకోవాలి. 30 ఏళ్ళపాటు ఇలా ఈ దేశప్రజల మీద అది స్వారీ చేసింది. ఇపుడు మార్కెట్లో ఈ స్కూటర్లు అడ్రస్‌లేదు. పైగా ఇవి, ఈ దేశం మొత్తంలో కాలుష్యాన్ని పెంచాయి. ఇపుడు ఏది ప్రతిభో మనకే అర్థమౌవుతుంది.

ఉదాహరణకు ప్రతిభావంతులైన మనమిత్రులు 'బాకీలు ఎగ్గొట్టడం' అనే దుర్మార్గాన్ని సూచించడానికి ఎంతో అందంగా రూపొందించిన ఎన్.పి.ఎ. (నాన్‌ఫెర్‌ఫార్మింగ్ అసెట్స్) అనేది. మన ప్రతిభావంతులు పరిశ్రమలను ప్రారంభించడానికి భూమి, విద్యుత్తు వగైరా రాయితీలతోపాటు జాతీయబ్యాంకుల నుంచి దండిగా డబ్బు తీసుకొంటారు. కానీ ఆ డబ్బును తిరిగి చెల్లించరు. ఆ చెల్లించని బాకిలే ఎన్.పి.ఎ. ఇదే ఒక సామాన్యుడు చేస్తే బాకీ ఎగ్గొట్టడం అంటారు. ప్రతిభావంతులు చేస్తే ఎన్.పి.ఎ. అంటారు.

ప్రస్తుతం ప్రైవేట్ రంగంలో ప్రాధాన్యతను పెంచే 'సరళీకరణ' విధానాలను 'ప్రతిభ' వాదనలద్వారా సమర్థిస్తున్నారనేది స్పష్టం. అంటే ఈ వాదన సమాజంలో మత్స్య న్యాయాన్ని పెంపొందిస్తుంది. కాబట్టి, వ్యక్తిగత ప్రతిభ, దాని భావజాలం విద్యార్థులను మరింత నిస్పృహకు గురి చేస్తోంది. అవకాశం పొందలేకపోవడం అనేది వారి వ్యక్తిగత అసమర్థతగా అర్థం చేసుకొంటున్నారే తప్ప, ఉద్యోగాలు చూపించ లేకపోవడం అనేది 'సామాజిక వైఫల్యంగా' గుర్తించటం లేదు.

❖ మన ప్రస్తుత సమాజం ఇతరుల్ని కిందికి తోసి మనంపైకి ఎదగాలనుకునే ధోరణిని, వ్యక్తిగతలాభాన్ని సమర్థిస్తుంది.

ఉదాహరణకు వైద్యరంగాన్నే తీసుకుంటే, మన వైద్య విద్యార్థులు సర్జరీలో నైపుణ్యాన్ని సంపాదించడానికి ఒకరితో ఒకరు పోటీపడ్డారు. ఈ నిపుణత్వంలో ఎవరికి ఉపయోగం? మళ్ళీ డబ్బున్న పెద్దమనిషికే అని చెప్పాల్సిన అవసరం లేదు. వైద్య విద్యార్థులకు, డాక్టర్లకు సర్జరీలో వున్న ఆసక్తి, 'కమ్యూనిటీ హెల్త్'లోనూ 'వ్యాధి నిరోధకత'లలో ఎందుకుండవు? ఆ రంగాలలో పని చేయటాన్ని ఒక సవాలుగా ఎందుకు తీసుకోరు?

❖ రిజర్వేషన్లను వ్యతిరేకించే వాళ్లు బూట్ల పాలిష్ చేయడం, రోడ్లను ఊడ్చడం, మరమ్మత్తులు చేయడం లాంటి ఉద్యమ కార్యక్రమాల్ని చేపట్టారు. దీని వెనక మనకి కనిపించే ఆంతర్యం ఏమిటి? ఉద్యోగాలు, వృత్తుల్లో, కూడా ఉచ్చం, నీచం ఉన్నాయని, రిజర్వేషన్ వ్యతిరేకులు కొన్ని వృత్తుల్ని తుచ్ఛమైనవిగా తలుస్తారని ఈ సందర్భంగా అర్థమౌవుతుంది.

❖ రిజర్వేషన్ వ్యతిరేక ఉద్యమంలో ప్రధానంగా కనిపించే ఉద్యోగావకాశాల సమస్య నిజానికి ప్రధానం కాదు.

వ్యక్తి ఉన్నతి 'ప్రతిభ' సమర్థతలను ఆదర్శాలుగా చెప్పే రాజకీయ అవసరాలు భారత పరిశ్రమలకు, అంతర్జాతీయ పెట్టుబడులకు మాత్రమే దోహదం చేస్తాయి – రిజర్వేషన్లు సమర్థించే వాళ్ళే ఒక్కఉద్యోగాలకే చర్చను పరిమితం చేస్తే ఏమీ ప్రయోజనం లేదు.

## ముగింపు

స్వతంత్ర భారతదేశంలో సామాజిక వ్యవస్థకు ఒక కొత్త రూపాన్ని ఇచ్చిన పరిణామం – రిజర్వేషన్లు తన సామాజిక చరిత్రలోని ఒక గొప్ప దోషాన్ని అసంగతాన్ని సరిదిద్దుకునే క్రమంలో దేశం ముందుకు తీసుకవచ్చిన విధానమే ఈ రిజర్వేషన్లు. వీటి అవసరం కాదనడం ఎంత అనాగరికమో, ఇందులో జరుగుతున్న దుర్వినియోగం, అశాస్త్రీయ పోకడలను ఖండించలేకపోవడమూ అంతే అజ్ఞానం అవుతుంది.

రిజర్వేషన్ వ్యవస్థ మార్పులు సంతరించుకోక తప్పదు. ఎందుకంటే, అది సామాజిక, సాంస్కృతిక సమస్య. అది మార్పుమీద ఆధారపడివుంది. కాలంగడిచేకొద్ది మార్పు తప్పదు. కానీ ఈ మార్పునకు కొన్ని వర్గాలు సిద్ధంగా లేవు. సామాజికంగా వెనుకబడిన వారిని ముందుకు తీసుకరావడం కోసం ప్రభుత్వం ఏర్పాటు చేసిన రిజర్వేషన్లు చివరికి ఓట్లు సంపాదించే ఆయుధాలుగా మారిపోయాయి. రిజర్వేషన్ల అమలులో జరుగుతున్న అసంబద్ధతకారణంగా అది సమాజంలో చిచ్చు పెడుతోంది. ఆర్థికంగా వెనుకబడినవారికి కూడా రిజర్వేషన్ కల్పించాలన్న డిమాండ్ ఇటీవల ఊపందుకొంటుంది. రిజర్వేషన్ల ధ్యేయం ఆర్థికంగా వెనుకబడటం కాదని, సామాజికంగా వెనుక బడడమని, కాబట్టి సామాజికంగా వెనుకబడ్డారని, ఎట్టి పరిస్థితులలో చెప్పడానికి అవకాశం లేని అగ్రవర్ణాలవారికి ఈ సౌకర్యం కల్పించడం రాజ్యాంగ స్ఫూర్తికే వ్యతిరేకమని వాదించే వారున్నారు.

సామాజిక న్యాయంతో రిజర్వేషన్లు ప్రారంభమైనాయి. 1947 నుంచే సామాజిక నేపథ్యాన్ని దృష్టిలో ఉంచుకొని, వందలాది సంవత్సరాలుగా అణచివేతకూ, వెనుకబాటుతనానికీ గురైన వర్గాల అభ్యున్నతిని కాంక్షించారు. సామాజికంగానే కాక ఆర్థికంగా వెనుకబడినవారికి కూడా రిజర్వేషన్లు కల్పించాలన్న డిమాండ్‌కు ఇటీవలి కాలంలో బలం చేకూరుతోంది. అగ్రవర్ణాల్లో కూడా చాలా మంది కటిక పేదరికంతో విద్య, ఉపాధి అవకాశాలు పొందలేక పోతున్నందున వారికి కూడా రిజర్వేషన్ కల్పించాలనీ వీరి వాదన. రిజర్వేషన్ సమస్య చాలా సున్నితమైంది. మండల్ కమిషన్ సిఫారుసులను ముందుకు తెచ్చినపుడు దేశవ్యాప్తంగా జరిగిన ఆత్మాహుతులు, ఆందోళనలు గుర్తుండే ఉంటాయి. ఇంతే కాకుండా, రిజర్వేషన్లు సామాజిక సమానత్వ న్యాయాలకు కాకుండా, కొన్ని పార్టీలను, వర్గాలను శాశ్వతంగా అధికారంలో ఉంచే ఆయుధాలుగా మారిపోయాయి.

దేశంలో రిజర్వేషన్ వ్యవస్థ ప్రారంభమై అర్ధశతాబ్దం గడిచిన దృష్ట్యా సమీక్ష చేయడం తొందరపాటు ఏ మాత్రంకాదు. రిజర్వేషన్‌తో బాగుపడిన కులాలను గుర్తించడం, తప్పించడం (క్రిమీలేయర్) అర్హులను చేర్చడం అనివార్యంగా జరగాలనీ గట్టి అభిప్రాయమే ఇపుడు ఉంది. ఏ ప్రజాస్వామిక దేశంలోనైన పార్లమెంట్, సుప్రీంకోర్టు అత్యున్నతమైన సంస్థలు. వీటిలో పార్లమెంట్ శాసనాలు చేస్తుంది. రాజ్యాంగ నిబంధనలకు, న్యాయాన్ని, ధర్మాన్ని దృష్టిలో ఉంచుకొని ఆ శాసనాలకు సుప్రీంకోర్టు భాష్యం చెబుతుంది. అయితే, ఇటీవల వెలువడిన తీర్పుల ఫలితంగా న్యాయవ్యవస్థ ప్రతిష్ఠను దిగ జార్చేవిగా ఉన్నాయి. ఈ తీర్పు పూర్తిగా రాజ్యాంగ విరుద్ధం. కాని వాటిని కాదనే నైతిక స్థైర్యం, రాజకీయ సంకల్పం, ఎన్నికైన ప్రభుత్వాలకు, పార్టీలకు కొరవడటంతో రాజ్యాంగానికి అతీతంగా ఈ అధికారాలను సుప్రీంకోర్టు సొంతం చేసుకుంది. నిస్సందేహంగా ఇది రాజ్యాంగ ఏర్పాట్లకు, ప్రజాస్వామ్య సంప్రదాయాలకు, గొడ్డలిపెట్టు. సర్కార్ల బలహీనత, అసమర్థత, అలసత్వం, దుష్పరిపాలన వంటివాటివల్ల సాధారణ పాలనా వ్యవహారాల్లో కూడా న్యాయస్థానాల జోక్యం పెరిగిపోయింది.

చివరిగా ఒకమాట, భారతదేశానికి స్వాతంత్రం వచ్చినా, మహాత్ములే ఊహించి అన్నట్లు ఆ స్వాతంత్రం అగ్రవర్ణాలకే పరిమితం. బహుసంఖ్యాక గిరిజన, దళిత, ఓ.బి.సి.లకు అసంఖ్యాక ప్రజలకు భారతదేశంలో నేటికి స్వాతంత్రం రాలేదు. సమాజంలో ఈ దీనులకు, సాంఘిక స్వేచ్ఛ సమానత్వం, స్వాతంత్ర్యం లేదు. భారతదేశంలో బలహీన వర్గాల అసంఖ్యాక ప్రజలు, స్వేచ్ఛగా, సమానత్వంతో స్వతంత్రంగా జీవించడానికి, సాంఘిక విప్లవం ద్వారా రెండవ స్వాతంత్ర్య పోరాటం ఎంతైన అవసరం. ఈ విప్లవంతో సమాజంలోని సామాజిక రుగ్మతలు రూపుమాపి గిరిజనులు, దళితులు, ఓబిసిలు దేశ జీవన ప్రవంతిలో సగౌరవంగా జీవించడానికి కులనిర్మూలన, స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, సమానత్వం, సామాజికన్యాయం, అందరికీ అందుబాటులో ఉంచడానికి కృషి జరపాలి. సామాజిక సమానత్వం సాధించాలంటే అవసరమైన రాజకీయ లక్ష్యంగా, అధికార యంత్రాంగం సాంఘిక లక్ష్యాల్ని పునః రూపొందేట్లుగా ఒత్తిడి చేసే సాధనంగా రిజర్వేషన్లను అర్థం చేసుకోవాలి. నిజానికి రిజర్వేషన్ విధానంపేరుమీద కొనసాగుతున్నది రిజర్వేషన్ కాదు. అది వేలఏళ్లుగా అగ్రవర్ణాలకు కొనసాగుతున్న రిజర్వేషన్‌ను సరిచేసే 'డీ'రిజర్వేషన్ విధానం అవుతుంది. దీంతో సామాజికన్యాయం సాధ్యమా? సామాజిక న్యాయం మీద అవగాహన ఉన్నవారు, రిజర్వేషన్లను సమర్థించేవారు ఈ వ్యాసాన్ని చదువుతారనే విశ్వాసముంది. ◆

మానవ వనరుల అభివృద్ధి ముఖ్యంగా మానవుల్లో విజ్ఞానాన్ని, నైపుణ్యాన్ని, సామర్థ్యాన్ని, సృజనాత్మకతను పెంచడానికి సంబంధించిన విషయం అంటున్నారు **భూక్య శ్రీనివాస్ నాయక్**

# మానవ వనరుల అభివృద్ధి - వ్యూహాలు

మానవ వనరుల అభివృద్ధి అంటే ప్రజల నైపుణ్యాలను, జ్ఞానాన్ని పోటీతత్వాన్ని పెంపొందిండం. మానవ వనరుల అభివృద్ధి అనే భావన జనాభాతో మమేకమై, జనాభాలో గుణాత్మక మార్పును పెంపొందించటానికి ఉపయోగ పడుతుంది. మానవవనరుల అభివృద్ధిలో వ్యూహాలు, పద్ధతులు, పని మదింపు, కెరీర్ ప్లానింగ్, శిక్షణ, నియామకం, ఎంపిక, బహుమతులు, నమూనా పార్యాంశాలు. కీలక పాత్ర వహిస్తాయి.

మానవ వనరుల అభివృద్ధిపైనే వ్యవస్థ ఆధారపడి ఉంది. మానవ వనరుల అభివృద్ధి ముఖ్యంగా మానవుల్లో విజ్ఞానాన్ని, నైపుణ్యాన్ని, సామర్థ్యాన్ని, సృజనాత్మకతను పెంచడానికి సంబంధించిన విషయం. అంతేకాకుండా మనుషుల విలువల్లో దృక్పథాల్లో అభిప్రాయాలల్లో, ఆలోచనల్లో మార్పులు తీసుకురావడానికి సంబంధించినది.

అమెరికాలో నిర్వహించిన ఒక సదస్సులో 1969లో లియోనార్డ్ నాడ్లర్ మానవ వనరుల అభివృద్ధి భావనను ప్రవేశ పెట్టాడు. అతని అభిప్రాయం ప్రకారం 'ఒక నిర్ణీతకాలంలో ప్రవర్తన పరమైన మార్పులకోసం నిర్ణయించిన అత్యవసరమైన అనుభవాలే' మానవ వనరుల అభివృద్ధి.

## మానవ వనరుల అభివృద్ధిని నిర్ణయించే అంశాలు

- ఒక సంస్థ నిర్మాణం, సంస్థకు సంబంధించిన వాతావరణం, మానవ వనరుల అభివృద్ధి స్వభావం, మానవ వనరుల అభివృద్ధికి సంబంధించిన పరిజ్ఞానం, మేనేజర్ల నైపుణ్యాలు, మానవ వనరుల ప్రణాళిక నియామకం, ఎంపిక మొదలైనవి.
- మానవ వనరుల అభివృద్ధికి, వాటిలో మార్పుకు అవసరమైన సాధనాలు, మార్గాలుగా అనేక సాంకేతిక పద్ధతుల ఉపయోగం, సాంకేతిక పద్ధతులలో భాగంగా నిష్పాదన, కెరీర్ ప్రణాళిక, అభివృద్ధి, శిక్షణ, నిర్వహణ అభివృద్ధి, సంస్థ అభివృద్ధి, సామాజిక, సాంస్కృతిక కార్యక్రమాలు, శ్రామిక భాగస్వామ్యం, నాణ్యత చక్రాలు మొదలైనవి ఉంటాయి.
- వ్యక్తిగత, సామాజిక, సామూహిక సంస్థల లక్ష్యాలను సాధించటం ద్వారా మానవ వనరుల అభివృద్ధి ప్రక్రియలను అభివృద్ధి పరచటం.

## మానవ వనరుల అభివృద్ధి లక్షణాలు

- మానవ వనరుల అభివృద్ధి అనేది క్రమబద్ధమైన ప్రక్రియ. దీని ద్వారా వ్యక్తుల వ్యక్తిత్వ వికాసం, పెంపుదల సాధ్యమవుతాయి. మానవ వనరుల అభివృద్ధి ద్వారా వ్యక్తుల, సంస్థల, సమూహాల లక్ష్యాల సాధనకు వీలుకలుగుతుంది.
- సాంకేతిక, నిర్వహణపరమైన, ప్రవర్తనపరమైన, భావనా యుక్తమైన నైపుణ్యాలను, జ్ఞాన సమూపార్జనకు సంబంధించిన అంశాలను అభివృద్ధి పరచటంలో మానవవనరుల అభివృద్ధి ఒక నిరంతర ప్రక్రియగా పనిచేస్తుంది.
- మానవ వనరుల అభివృద్ధి బహుముఖమైనది. ఇది అనేక ఇతర శాస్త్రాలను వినియోగించుకుంటుంది. ఇందులో భాగంగా ఇంజనీరింగ్, సాంకేతిక రంగం, మనస్తత్వ శాస్త్రం, ఆంత్రోపాలజి, నిర్వహణాశాస్త్రం, వాణిజ్యశాస్త్రం, అర్థశాస్త్రం, వైద్యశాస్త్రం, మొదలైన రంగాలను చెప్పవచ్చును.
- మానవ వనరుల అభివృద్ధి భావన ఉత్పత్తి రంగానికి, సేవల రంగానికి మాత్రమే కాక సమాచార సాంకేతిక విజ్ఞాన రంగానికి కూడా వర్తిస్తుంది.

## మానవ వనరుల అభివృద్ధి వ్యూహాలు

సాంప్రదాయకంగా, మానవ వనరుల ప్రణాళికలు వ్యూహాత్మక ప్రణాళికలలో భాగంగా ఉండవు. కాని సంపూర్ణ నాణ్యతా సంస్థలు, మానవ వనరుల ప్రణాళికలు వ్యూహాత్మక ప్రణాళికలలో మమేకం అయి ఉన్నాయి. వాస్తవానికి మానవ వనరుల వ్యూహాలకు సంపూర్ణ నాణ్యతా సంస్థలలో అత్యున్నత స్థాయి ప్రాధాన్యత కల్పించబడింది. అయితే మానవ వనరుల మేనేజర్ల అభిప్రాయం ప్రకారం మానవ వనరుల వ్యూహాలకు సంపూర్ణ నాణ్యతగల వ్యవస్థలలో తగిన ప్రాధాన్యత ఇవ్వలేదు.

మానవవనరుల అభివృద్ధికి సంబంధించిన అనేక వ్యూహాలు, మొత్తం నాణ్యత మానవవనరులతో సంబంధం కలిగిఉంటాయి. సంపూర్ణ నాణ్యత మానవ వనరుల వ్యూహం నిర్వహణ, వ్యాపార వ్యూహాత్మక నిర్వహణలో ఇచ్చి పుచ్చుకునే అంతర్గత సంబంధం కలిగి ఉంటుంది.

సంపూర్ణ నాణ్యత మానవవనరుల వ్యూహం సమర్థవంతంగా అమలు పరచటానికి కొన్ని అంశాలు అవసరం అవుతాయి. వీటిలో భాగంగా సంస్థకు సంబంధించిన సమగ్ర ప్రక్రియ, ప్రతి ఒక్కదాన్ని సమర్థవంతంగా నిర్వహించే సమూహాలను ఉపయోగించటం, వినియోగ దారులను తృప్తిపరచగలిగే ఉత్పత్తిని తయారు చేయటం, సమూహానికి సంబంధించిన ఫలితాలకు ప్రతిఫలాలు ఇవ్వడం, వినియోగదారులకు, సరఫరాదారుకు మధ్యగల ఒప్పందాన్ని గరిష్ఠం చేయటం, ఉద్యోగులు అందరికి శిక్షణను అందించటం వంటి వాటిని పేర్కొంటాం.

సంపూర్ణ నాణ్యతా నిర్వహణ (టి.క్యు.ఎం. - టోటల్ క్వాలిటీ మేనేజ్‌మెంట్)ను మెరుగుపరచడానికి మానవవనరుల మేనేజర్లు ఈ కింది కార్యకలాపాలలో పాల్గొనాలి.

1. టి.క్యు.ఎం. పరంగా అనుభవంగల ఇతర సంస్థల నుంచి నివేదికలను తయారు చేయటం.
2. టి.క్యు.ఎం. పద్ధతిని అనుసరించడానికి గల వివిధ మార్గాల సహాయాన్ని పొందటం.
3. సంస్థలో అంతర్గతంగా ఉన్న అనుభవజ్ఞులను గుర్తించటం.
4. ఇతర సంస్థలకు సంబంధించిన అనుభవజ్ఞుల సేవలను ఉపయోగించుకోవటం.

## టి.క్యు.ఎం. ను ప్రవేశపెట్టడానికి కావలసిన సౌకర్యాలు

1. కంపెనీలకు, యూనియన్ నాయకులకు మధ్య సత్సంబంధాలు ఏర్పరచి వాటాదారులందరికి ప్రయోజనం చేకూర్చే విధంగా సంపూర్ణ నాణ్యతా భాగస్వామ్యాన్ని ప్రోత్సహించటం, అందుబాటులో ఉంచటం.
2. యూనియన్‌లోని నాయకుల అందరికీ టి.క్యు.ఎం. సూత్రాల గురించి శిక్షణ ఇవ్వటం, అంతేకాక నాణ్యతకు సంబంధించి నిరంతర అభివృద్ధి కార్యక్రమాన్ని ఆయా నాయకుల ప్రత్యేక విభాగాలలో పెంపొందించటం.
3. నాణ్యత నిర్వహణ సాధనాలను, పద్ధతులను సమర్థవంతంగా ఉపయోగించటానికి కావలసిన పరిస్థితులను గుర్తించటం.
4. ప్రోత్సాహక ప్రక్రియను నిర్వహించటానికి కావలసిన శిక్షణనివ్వటం.

## మానవ వనరుల వ్యూహం - మేనేజర్లు సమీక్ష చేసే అంశాలు

1. సాలుసరి టి.క్యు.ఎం. నివేదికను తయారు చేయటం.
2. టి.క్యు.ఎం. కు కావలసిన పరిస్థితులైన స్టీరింగ్ కమిటీలు, నాణ్యతకౌన్సిల్స్, నాణ్యతా పెంపుదల సమూహాలు, సౌకర్యాలను పెంపొందించేవారు, వ్యక్తిగత ప్రతిభ మొదలైన అంశాల ఆధారంగా టి.క్యు.ఎం. సమర్థతను అంచనా వేయటం.
3. సంస్థ ప్రగతి గురించి వినియోగదారుల విమర్శలను సమీక్షించటం.
4. సంస్థకు సంబంధించిన టి.క్యు.ఎం. సమర్థతను, పోటీ సంస్థల, ప్రపంచ సంస్థల టి.క్యు.ఎం.లతో పోల్చి చూడటం.
5. సంస్థలో అంతర్గతంగా సమీక్షించేందుకు ఐ.ఎస్.ఐ. 9000 వంటి అంశాలు ఉపయోగించటం.

## మానవ వనరుల అభివృద్ధి పద్ధతులు - పాఠ్యాంశాలు

1. **పని సామర్థ్య మదింపు :** ఉద్యోగులు పని ప్రమాణాలను చేరుకోగలు గుతున్నారో లేదో అన్న విషయం తెలుసుకోవటానికి, ఒకే స్థాయిలో పని చేస్తున్న వివిధ ఉద్యోగులను తులనాత్మకంగా విశ్లేషించినప్పుడు, వారి సామర్థ్య స్థాయిలలో గల తేడాలను తెలుసుకోవటానికి, ఉద్యోగుల పదోన్నతి అర్హతల గురించి నిర్ణయం తీసుకోవడానికి పని సామర్థ్య మదింపు అత్యవసరం.
2. **శిక్షణ, విద్యా వ్యాసంగం :** సిబ్బంది శిక్షణ చాలా అవసరమైన ప్రాముఖ్యత గల ప్రక్రియ. శిక్షణ నిరంతరం కొనసాగే ప్రక్రియ. పని సామర్థ్యమదింపుతోనూ, వ్యాసంగ ప్రణాళికతోనూ దగ్గర సంబంధం కలిగి ఉంది. ఉద్యోగి స్థాయినిబట్టి నిపుణతను బట్టి, భవిష్యత్తులో చేపట్టవలసిన బాధ్యతలను బట్టి, మారే సాంకేతిక విధానాన్ని బట్టి శిక్షణ కార్యక్రమాన్ని నిర్ణయిస్తారు.
3. **వ్యాసంగ ప్రణాళిక :** వ్యవస్థ అభివృద్ధి పథకాలు, భవిష్యత్తు ప్రణాళికలను, సిబ్బందికి తెలిపి, అభివృద్ధి కార్యక్రమంలో వారి పాత్రను నిర్వచించి, వారికి పాల్గొనే అవకాశం కలుగచేసినట్లయితే, ఉద్యోగులకు సంతృప్తి స్థాయి పెరుగుతుంది.
4. **వ్యవస్థ అభివృద్ధి :** వ్యవస్థ నందలి వివిధ అంతర్భాగాల పనితీరును, వ్యవస్థ ఆరోగ్యాన్ని పెంచే దృష్టితో సమన్వయపరిచి, వ్యవస్థలోని సమస్యలను కనుగొని, వ్యవస్థ సార్ధకతను, ఉత్పాదకతను పెంచే ప్రణాళికలను చేపట్టాలి.
5. **కౌన్సిలింగ్ :** వృత్తి వ్యాసంగాలకు సంబంధించి, ఉద్యోగులకు, ఒకటి కంటే ఎక్కువ అవకాశాలున్నప్పుడు ఎంపిక చేయటం సమస్యకావచ్చు. వారి భవిష్యత్తును, సామర్థ్యాన్ని, నైపుణ్యాలను, మానసిక స్థితిని, వ్యవస్థ అవసరాలను పరిగణనలోకి తీసుకొని, సరైన సలహా ఇవ్వక పోయినట్లయితే, సార్థకమైన నిర్ణయాలు తీసుకోవడం సాధ్యం కాదు.
6. **మానవ వనరుల పారితోషికం :** వ్యవస్థ లక్ష్యసాధనలో తగిన సేవలం దిస్తున్న ఉద్యోగులకు తగిన ప్రతిఫలం ఇవ్వటం మానవ వనరుల ప్రధానకర్తవ్యం. ఇది మూడురూపాలలో ఇవ్వటం జరుగుతుంది. (ఎ) వేతనాలు; (బి) ప్రోత్సాహకాలు; (సి) ప్రయోజనాలు - సేవలు. పనిలో కావలసిన నైపుణ్యాలు, అర్హతలు, అనుభవాలను బట్టి నిర్ణీతకాలానికి వేతనం ఇవ్వడం జరుగుతుంది.
7. **మానవ వనరుల సమాచార సేకరణ :** పైన పేర్కొన్న కార్యక్రమాలను సరైన పద్ధతిలో నిర్వహించాలంటే, సమగ్రమైన, సంపూర్ణమైన, శాస్త్రీయమైన పద్ధతిలో సేకరించిన సమాచారం అందుబాటులో ఉండాలి. సమాచారాన్ని సేకరించటం మాత్రమే కాదు. ఎప్పటికప్పుడు తగిన మార్పులు చేస్తు ఉండాలి. పెద్ద సంస్థలు, కంప్యూటరైజ్ చేసిన మానవ వనరుల సమాచారం ఏర్పాటు చేసుకుంటాయి.
8. **మానవవనరుల అభివృద్ధిలో బోధనాంశాలు, పాఠ్యాంశాలు :** వ్యవస్థను అభివృద్ధి పథంలో నడిపించడంలో భాగంగా మానవ వనరుల అభివృద్ధి కీలక పాత్ర పోషిస్తుంది. అందుల భాగంగా నమూనా పాఠ్యప్రణాళిక రూపొందించడం జరుగుతుంది. తద్వారా ఆ సంవత్సరంలో ఆయా ఉద్యోగులకు ఇవ్వవలసిన శిక్షణ, కెరీర్ ప్లానింగ్, పనిమదింపు మొదలయిన విస్తృత అంశాలపై ఒక సమగ్ర అవగాహన రూపొందించడం జరుగుతుంది.

ఏ వ్యవస్థ ఉన్నతికైనా ఆ వ్యవస్థలో రూపొదించుకున్న పాఠ్య ప్రణాళిక అమలుపై ఆ వ్యవస్థ మనుగడ ఆధారపడి ఉంది. కాబట్టి పాఠ్య ప్రణాళిక రూపొందిండంలో కాలాగుణంగా వ్యవస్థ ప్రయోజనాలకు అనుగుణంగా వ్యవస్థలో పనిచేసిన వ్యక్తులకు అనుగుణంగా వివిధ రకాల నమూనాలతో పాఠ్య ప్రణాళిక రూపొందించి దానిని సరైన సమయంలో వినియోగించు కున్నప్పుడు మాత్రమే ఆ వ్యవస్థకి ప్రయోజనం చేకూరుతుంది. కరికులమ్ రూపొందించడంలో వివిధ సంస్థలు వివిధ పద్ధతులను అవలంబిస్తున్నాయి. ◆

ఆంధ్రప్రదేశ్‌లో సాంఘిక రంగ అభివృద్ధికి సంబంధించిన ఐదు మౌలిక సమస్యలను చర్చిస్తున్నారు
ఎస్. మహేంద్ర దేవ్

# ఆంధ్రప్రదేశ్‌లో సమ్మిళిత అభివృద్ధి

*(... గత సంచిక తరువాయి)*

## సాంఘిక రంగం

ఆంధ్రప్రదేశ్‌లో విద్యా, ఆరోగ్య రంగాలలో మెరుగుదల ఉంది. కాని, దేశవ్యాప్తంగా మానవాభివృద్ధి సూచికను బట్టి చూస్తే రాష్ట్రం పదో స్థానంలో ఉంది.

ఆంధ్రప్రదేశ్‌లో సాంఘిక రంగానికి సంబంధించి మౌలికంగా అయిదే సమస్యలు ఉన్నాయి.

| రాష్ట్ర స్థాయిలో అక్షరాస్యత శాతం 2004-05 | | | | | |
|---|---|---|---|---|---|
| | రాష్ట్రం | గ్రామీణ | | పట్టణ | |
| | | పురుషులు | మహిళలు | పురుషులు | మహిళలు |
| 1 | ఆంధ్రప్రదేశ్ | 55.8 | 39.1 | 76.7 | 62.5 |
| 2 | అస్సాం | 75.1 | 63.5 | 85.6 | 78.8 |
| 3 | బీహార్ | 53.7 | 32.6 | 75.6 | 60.2 |
| 4. | చత్తీస్‌గడ్ | 64.7 | 43.4 | 82.4 | 68.7 |
| 5 | గుజరాత్ | 69.3 | 46.9 | 84.7 | 73.6 |
| 6 | హర్యానా | 68.1 | 47.3 | 79.6 | 66.9 |
| 7 | హిమాచల్ ప్రదేశ్ | 79.1 | 64.1 | 81.0 | 78.9 |
| 8. | జమ్ము & కాశ్మీర్ | 67.1 | 46.4 | 80.0 | 65.0 |
| 9. | జార్ఖండ్ | 59.8 | 34.2 | 83.6 | 68.7 |
| 10. | కర్ణాటక | 62.2 | 46.7 | 82.0 | 69.4 |
| 11. | కేరళ | 85.0 | 80.6 | 87.4 | 83.9 |
| 12. | మధ్యప్రదేశ్ | 59.1 | 36.0 | 78.8 | 65.1 |
| 13. | మహారాష్ట్ర | 71.8 | 55.1 | 84.3 | 69.8 |
| 14. | ఒరిస్సా | 62.5 | 45.0 | 77.3 | 66.4 |
| 15. | పంజాబ్ | 67.5 | 58.8 | 80.6 | 73.1 |
| 16. | రాజస్థాన్ | 58.8 | 31.3 | 72.2 | 54.9 |
| 17. | తమిళనాడు | 72.4 | 54.5 | 85.6 | 75.6 |
| 18. | ఉత్తరాంచల్ | 70.8 | 50.3 | 82.2 | 69.8 |
| 19. | ఉత్తరప్రదేశ్ | 58.0 | 36.0 | 71.0 | 59.4 |
| 20. | పశ్చిమ బెంగాల్ | 67.9 | 53.9 | 84.5 | 76.1 |
| | భారతదేశం | 63.6 | 45.0 | 80.5 | 69.3 |

మూలం : 61వ రౌండ్ ఎంప్లాయ్‌మెంట్ అండ్ అన్ ఎంప్లాయ్‌మెంట్ సర్వే, 2004-05

మొదట – ఆంధ్రప్రదేశ్‌లో సాంఘిక రంగ సూచికల స్థాయి చాలా తక్కువగానూ, వాటి అభివృద్ధి రేటు ఇతర రాష్ట్రాలతో ప్రత్యేకించి దక్షిణాది రాష్ట్రాలతో పోలిస్తే మందకొడిగాను ఉంది. జాతీయ సాంపిల్ సర్వే అరవై ఒకటో విడత గణాంకాలు 2004-05 కు సంబంధించి రాష్ట్రంలో అక్షరాస్యతను సూచిస్తున్నాయి. వాటిని బట్టి ఆంధ్రప్రదేశ్ అక్షరాస్యతా స్థాయి దేశంలోని ఇతర రాష్ట్రాల కన్న చాలా తక్కువగా ఉంది. గ్రామీణ పురుషులలో ఆంధ్రప్రదేశ్ ఇరవై రాష్ట్రాలలో అట్టడుగున ఉంది. గ్రామీణ మహిళలలో పదహారో స్థానంలో, పట్టణ పురుషుల లోనూ, స్త్రీలలోనూ పదిహేడో స్థానంలో ఉంది. మరొక పక్క గ్రామీణ, పట్టణ స్త్రీలలో తమిళనాడు అయిదో ఆరో స్థానాలలో ఉంది.

ఆంధ్రప్రదేశ్ జనాభాలో సాధారణ విద్యా స్థాయిని చూస్తే గ్రామీణ పురుషులలో 74 శాతం, గ్రామీణ మహిళలలో 86 శాతం నిరక్షరాస్యులు గానూ, ప్రాథమిక స్థాయి విద్యావంతులుగానో మాత్రమే ఉన్నారు. గ్రామీణ మహిళలలో ఏడు శాతం మంది మాత్రమే ఉన్నత పాఠశాల లేదా ఆపైనా చదువుకున్నారు.

ఇక ఆరోగ్య సూచికలలోకి వస్తే రాష్ట్రంలో శిశు మరణాల సంఖ్య 1992-93లో వెయ్యికి 70 ఉన్నదల్లా, 2005-06 నాటికి వెయ్యికి 53కు చేరింది. ఇలా మరణాల సంఖ్య తగ్గినప్పటికీ 2005-06లో ఆంధ్రప్రదేశ్ దేశవ్యాప్తంగా పదిహేడు రాష్ట్రాలలో పదకొండో స్థానంలో ఉంది. శిశు మరణాల సంఖ్య కేరళలో పదిహేను, తమిళనాడులో ముప్పై ఒకటి, కర్ణాటకలో నలభై మూడు ఉండగా ఆంధ్రప్రదేశ్‌లో అతి ఎక్కువగా 53గా ఉంది.

బాలబాలికలలో పోషకాహార లోపం చూసినప్పుడు ఉండవలసిన బరువుకన్న తక్కువ బరువు ఉన్న బాలబాలికల శాతం 1992-93లో నలభై అయిదు శాతంగా ఉన్నదల్లా 2005-06 నాటికి ముప్పై ఏడు శాతానికి తగ్గింది. బాలల ఎదుగుదల పై ఆటంకాల విషయంలో కూడా తరుగుదల ఉంది. కాని ఈ అభివృద్ధి వేగం మాత్రం మందికొడిగానే ఉంది. మొత్తం పదిహేడు రాష్ట్రాలను

| సాధారణ విద్యా స్థాయి జనాభాలో శాతం 2004-05 | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | ఆంధ్రప్రదేశ్ | | | | భారతదేశం | | | |
| | గ్రా.పు. | గ్రా.మ. | ప.పు. | ప.మ. | గ్రా.పు. | గ్రా.మ. | ప.పు. | ప.మ. |
| నిరక్షరాస్యులు | 44.2 | 60.9 | 23.3 | 37.5 | 36.4 | 55.0 | 19.5 | 30.7 |
| ప్రాథమిక అక్షరాస్యులు | 30.0 | 25.0 | 28.9 | 28.6 | 36.1 | 29.3 | 30.0 | 29.4 |
| మాధ్యమిక | 12.5 | 07.4 | 13.5 | 12.1 | 14.0 | 08.9 | 16.0 | 14.4 |
| సెకండరి, ఉన్నత | 13.3 | 06.6 | 34.3 | 21.8 | 13.4 | 06.7 | 34.5 | 25.5 |
| మొత్తం | 100.0 | 100.0 | 100.0 | 100.0 | 100.0 | 100.0 | 100.0 | 100.0 |

మూలం : 61వ రౌండ్ నేషనల్ సాంపిల్ సర్వే, రిపోర్ట్ నెం. 515

తగ్గిపోయింది. ఆరోగ్య, విద్యా రంగాలకు ఎక్కువ వనరులు కల్పించాలని, ఆ రంగాలలోని సంస్థల పని తీరును పెంచాలని ప్రణాళికా ప్రాతిపదిక పత్రం వాదిస్తుంది. కాని, మరొకపక్క 'నీటిని సరఫరా చేసే గొట్టాన్ని మరమ్మత్తు చేయాలంటే అందులోకి ఎక్కువ నీళ్లను వదిలితే సాధ్యంకాదు' అని ఆర్థిక మంత్రిత్వశాఖ వాదిస్తుంది. ఆయా రంగాలలో సంస్కరణలు జరిగిన తరువాత మాత్రమే ప్రభుత్వ నిధులు పెంచవలసి ఉంటుందని ఆర్థిక మంత్రిత్వ శాఖ భావిస్తుంది. అంటే సాంఘిక రంగానికి నిధుల కేటాయింపును పెంచనక్కరలేదని ఆర్థిక మంత్రిత్వ శాఖ వాదిస్తుంది. మధ్యదారిలో ఎన్ని చోట్ల కారిపోతున్నప్పటికీ ఈ పద్ధతిలో ఎంతో కొంత పేదలకు చేరుతుందనీ, కారిపోతున్నదనే పేరు మీద సాంఘిక రంగ నిధుల హెచ్చింపును అడ్డుకోకూడదని ఆర్థిక మంత్రిత్వ శాఖ అర్థం చేసుకోవాలి.

గత నాలుగు సంవత్సరాలలో అంటే 2002 నుంచి 2006 మధ్య ఆంధ్రప్రదేశ్ స్థూల రాష్ట్ర ఉత్పత్తిలో సాంఘిక రంగంపై వ్యయం ఆరు నుంచి ఏడు శాతం మధ్య ఉంది. అదే విధంగా ఈ కాలంలోనే ఆంధ్రప్రదేశ్‌లో మొత్తం వ్యయం సాంఘిక రంగ వ్యయం 30 నుంచి 35 శాతంగా ఉంది.

దేశవ్యాప్తంగా విద్యా, ఆరోగ్య రంగాల మీద వ్యయం సగటు కన్న ఆంధ్రప్రదేశ్‌లో వ్యయం తక్కువగా ఉంది. ఉదాహరణకు 2000-07 మధ్య ఆంధ్రప్రదేశ్‌లో విద్య మీద వ్యయం 10 నుంచి 13 శాతం మధ్య ఉండగా అన్ని రాష్ట్రాల సగటు 12 నుంచి 17 శాతంగా ఉంది. గత రెండు సంవత్సరాలలో అన్ని రాష్ట్రాల సగటు కన్న ఆంధ్రప్రదేశ్‌లో వ్యయం తక్కువగా ఉంది.

నాలుగవది - విద్యా, ఆరోగ్య రంగాలలో ఆంధ్రప్రదేశ్‌లో నిర్మాణాలు సమర్థవంతంగా లేవనేది నిజమే. ఈ రెండు రంగాలలోను

చూసినప్పుడు బాలల్లో పోషకాహార లోపం సూచికలో ఆంధ్రప్రదేశ్ ఆరో స్థానంలో ఉంది.

రెండవది - సాంఘిక రంగ సూచికలలో ప్రాంతీయ, సామాజిక, గ్రామీణ-పట్టణ, లింగ పరమైన వ్యత్యాసాలు గణనీయంగా ఉన్నాయి. ఉదాహరణకు మహిళా అక్షరాస్యత మహబూబ్‌నగర్ జిల్లాలో అతి తక్కువగా 32.8 శాతం ఉండగా, పశ్చిమ గోదావరిలో అతి ఎక్కువగా 70 శాతం ఉంది. శిశు మరణాలు విజయనగరంలో అతి ఎక్కువగా ఉండగా కృష్ణా, గుంటూరులో అతి తక్కువగా ఉన్నాయి. ఇటువంటి వ్యత్యాసాలే సామాజిక వర్గాల మధ్య కూడా కనబడతాయి. మానవాభివృద్ధి సూచికల ప్రగతి పురుషుల కన్న స్త్రీలలో తక్కువగా ఉంది.

మూడవది - ఆరోగ్య, విద్యా రంగాల మీద ప్రభుత్వ వ్యయం చాలా తక్కువగా ఉండడం. సాంఘిక రంగం మీద నిధుల కేటాయింపు సంస్కరణల ముందుకాలంలో కంటే సంస్కరణల తరువాతి కాలంలో

| రాష్ట్రస్థాయిలో శిశు మరణాల సంఖ్య 2005-06 | | | | |
|---|---|---|---|---|
| రాష్ట్రం | NFHS I | NFHS II | NFHS III | స్థానం 2005-06 NFHS III |
| ఆంధ్రప్రదేశ్ | 70 | 66 | 53 | 11 |
| అస్సాం | 89 | 70 | 66 | 14 |
| చత్తీస్‌గడ్ | - | 81 | 71 | 16 |
| గుజరాత్ | 69 | 63 | 50 | 10 |
| హర్యానా | 73 | 57 | 42 | 6 |
| హిమాచల్ ప్రదేశ్ | 56 | 34 | 36 | 3 |
| జమ్ము & కాశ్మీర్ | - | 65 | 45 | 8 |
| కర్ణాటక | 65 | 52 | 43 | 7 |
| కేరళ | 24 | 16 | 15 | 1 |
| మధ్యప్రదేశ్ | - | 88 | 70 | 15 |
| మహారాష్ట్ర | 51 | 44 | 38 | 4 |
| ఒరిస్సా | 112 | 81 | 65 | 13 |
| పంజాబ్ | 54 | 57 | 42 | 5 |
| రాజస్థాన్ | 73 | 80 | 65 | 12 |
| తమిళనాడు | 68 | 48 | 31 | 2 |
| ఉత్తరప్రదేశ్ | - | 89 | 73 | 17 |
| పశ్చిమ బెంగాల్ | 75 | 49 | 48 | 9 |
| భారతదేశం | 77 | 67 | 55 | - |

మూలం : కేంద్ర ఆరోగ్య కుటుంబ సంక్షేమ మంత్రిత్వశాఖ

| రాష్ట్ర స్థూల జాతీయ ఉత్పత్తిలో సాంఘిక రంగ వ్యయం వాటా | | |
|---|---|---|
| స్థాయి (శాతం) | 2002-05 (యావరేజ్) | 2005-06 (ఆర్.ఇ.) |
| 5 లోపల | హర్యాన, పంజాబ్, ఢిల్లీ, పశ్చిమ బెంగాల్ | పంజాబ్ |
| 5-6 | మహారాష్ట్ర, గుజరాత్ | గుజరాత్, హర్యాన, ఢిల్లీ, పశ్చిమ బెంగాల్ |
| 6-7 | కర్ణాటక, తమిళనాడు, ఉత్తరప్రదేశ్, ఆంధ్రప్రదేశ్ | మహారాష్ట్ర |
| 7-8 | గోవా, కేరళ, మధ్యప్రదేశ్ | ఆంధ్రప్రదేశ్, కర్ణాటక, తమిళనాడు |
| 8 ఎక్కువ | బీహార్, జార్ఖండ్, ఒరిస్సా, రాజస్థాన్, చత్తీస్‌గడ్ | గోవా, కేరళ, మధ్యప్రదేశ్, బీహార్, జార్ఖండ్, ఒరిస్సా, రాజస్థాన్, చత్తీస్‌గడ్ |

పోషకాహార లేమితో బాధపడుతున్న మూడు సంవత్సరాల కన్న తక్కువ వయసు గల పిల్లలశాతం 1992-93 నుంచి 2005-06

| రాష్ట్రం | తక్కువ బరువు | | | ఎదుగుదల లేకపోవడం | | |
|---|---|---|---|---|---|---|
| | 1992-93 | 1998-99 | 2005-06 | 1992-93 | 1998-99 | 2005-06 |
| ఆంధ్రప్రదేశ్ | 45 | 38 | 37 | - | 39 | 34 |
| అస్సాం | 49 | 36 | 40 | 50 | 50 | 35 |
| చత్తీస్‌గడ్ | - | 61 | 52 | - | 58 | 45 |
| గుజరాత్ | 48 | 45 | 47 | 44 | 44 | 45 |
| హర్యానా | 35 | 35 | 42 | 43 | 50 | 36 |
| హిమాచల్ ప్రదేశ్ | 44 | 44 | 36 | - | 41 | 27 |
| జమ్ము & కాశ్మీర్ | - | 35 | 29 | - | 39 | 28 |
| కర్ణాటక | 51 | 44 | 41 | 40 | 37 | 38 |
| కేరళ | 27 | 27 | 29 | 25 | 21 | 21 |
| మధ్యప్రదేశ్ | - | 54 | 60 | - | 49 | 40 |
| మహారాష్ట్ర | 51 | 50 | 40 | 41 | 40 | 38 |
| ఒరిస్సా | 52 | 54 | 44 | 45 | 44 | 38 |
| పంజాబ్ | 46 | 29 | 27 | 38 | 39 | 28 |
| రాజస్థాన్ | 44 | 51 | 44 | 42 | 52 | 34 |
| తమిళనాడు | 46 | 37 | 33 | - | 29 | 25 |
| ఉత్తరప్రదేశ్ | - | 52 | 47 | - | 56 | 46 |
| పశ్చిమ బెంగాల్ | 55 | 49 | 44 | - | 42 | 33 |
| భారతదేశం | 51 | 47 | 43 | - | 46 | 37 |

మూలం : కేంద్ర ఆరోగ్య కుటుంబ సంక్షేమ మంత్రిత్వశాఖ

మొత్తం వ్యయంలో సాంఘిక రంగ వ్యయం

| రేంజ్ (శాతం) | 2002-05 (సగటు) | 2005-06 (సవరించిన అంచనాలు) |
|---|---|---|
| 30 లోపల | గోవా, హర్యాన, పంజాబ్, ఉత్తరప్రదేశ్, పశ్చిమ బెంగాల్, గుజరాత్, కర్ణాటక, ఒరిస్సా | పంజాబ్, పశ్చిమ బెంగాల్ |
| 30-35 | ఆంధ్రప్రదేశ్, మధ్యప్రదేశ్, ఢిల్లీ, తమిళనాడు, కేరళ, బీహార్, మహారాష్ట్ర | ఆంధ్రప్రదేశ్, గోవా, గుజరాత్, హర్యాన, కర్ణాటక, మధ్యప్రదేశ్, ఒరిస్సా, మధ్యప్రదేశ్ |
| 35-40 | రాజస్థాన్, చత్తీస్‌గడ్ | బీహార్, మహారాష్ట్ర, తమిళనాడు, ఢిల్లీ |
| 40 ఎక్కువ | జార్ఖండ్ | చత్తీస్‌గడ్, జార్ఖండ్, కేరళ, రాజస్థాన్ |

మొత్తం వ్యయంలో విద్యా, ఆరోగ్య రంగాల వ్యయం శాతం

| | 2000-01 | 2001-02 | 2002-03 | 2003-04 | 2004-05 | 2005-06 | 2006-07 |
|---|---|---|---|---|---|---|---|
| **విద్యా** | | | | | | | |
| ఆంధ్రప్రదేశ్ | 13.3 | 12.5 | 11.7 | 11.6 | 10.0 | 13.1 | 11.7 |
| అన్ని రాష్ట్రాలు | 17.4 | 16.1 | 15.0 | 12.6 | 12.7 | 14.3 | 14.4 |
| **ఆరోగ్యం** | | | | | | | |
| ఆంధ్రప్రదేశ్ | 4.7 | 4.4 | 4.0 | 3.7 | 3.2 | 3.5 | 3.4 |
| అన్ని రాష్ట్రాలు | 4.7 | 4.4 | 4.1 | 3.5 | 3.5 | 4.2 | 4.4 |

మూలం : 61వ రౌండ్ నేషనల్ సాంపిల్ సర్వే, రిపోర్ట్ నెం. 515

మౌలిక సదుపాయాలు గాని, సేవల నాణ్యత గాని ఘోరంగా ఉన్నాయి. నాణ్యమైన బోధనను అందించడం చాలా కష్టతరమైన పని. ప్రథం అనే ప్రభుత్వేతర సంస్థ ఇటీవల జరిపిన ఒక అధ్యయనం ప్రకారం దేశవ్యాప్తంగా నాలుగు సంవత్సరాలపాటు పాఠశాలకు వెళ్లిన విద్యార్థుల లో 38 శాతం మంది రెండవ తరగతి పిల్లలు చదవవలసిన చిన్న వాక్యాలతో కూడిన ఒక చిన్న పరిచ్ఛేదాన్ని చదవలేక పోతున్నారని తేలింది. వారిలో 55 శాతం మంది పిల్లలు ఒక మూడు అంకెల సంఖ్యను ఒక అంకె సంఖ్యతో భాగహారం చేయలేకపోయారు. ఆంధ్రప్రదేశ్‌లో కూడా ఇటువంటి సమస్యలే చూడవచ్చు. అదే విధంగా ఉన్నత పాఠశాల స్థాయిలోనూ, ఇంకా పైస్థాయిలోనూ విద్యా నాణ్యతను మెరుగుపరచ వలసిన అవసరం ఉంది.

అయిదవది - విద్యా, ఆరోగ్య రంగాలలో ప్రైవేటీకరణ వల్ల పేద ప్రజానీకం సమస్యలు ఎదుర్కొనవలసి వస్తోంది. ఆంధ్రప్రదేశ్‌లో ఆరోగ్య సేవలలో ప్రైవేట్ రంగం పాత్ర పెరిగిపోతున్నదని జాతీయ సాంపిల్ సర్వే గణాంకాలు చూపుతున్నాయి. ఇన్‌పేషెంట్, అవుట్ పేషెంట్ల చికిత్సలలో ప్రైవేట్ ప్రభుత్వ ఆసుపత్రుల పాత్ర గురించి జాతీయ సాంపిల సర్వే నలభై రెండవ దఫా (1986-87), యాభై రెండవ దఫా (1995-96) గణాంకాలు వివరించాయి. జాతీయ స్థాయిలో. 1986-87లో మొత్తం ఇన్‌పేషెంట్లలో అరవై శాతం మంది ప్రభుత్వ ఆసుపత్రులలోనే చికిత్స పొందారు. 1995-96 నాటికి ఈ ప్రభుత్వ రంగం వాటా నలభై అయిదు శాతానికి తగ్గిపోయింది. కాని, ఆంధ్రప్రదేశ్ లో మాత్రం 1980ల నుంచి కూడా ప్రైవేట్ ఆరోగ్య రంగమే ప్రధాన స్థానంలో ఉంది. అప్పుడు గ్రామీణ ప్రాంతాలలో 70 శాతం ఇన్‌పేషెంట్లు, పట్టణ ప్రాంతాలలో 62 శాతం ఇన్‌పేషెంట్లు, ప్రైవేట్ ఆసుపత్రులలో చికిత్స పొందారు. 1990ల మధ్య భాగానికి వచ్చేసరికి గ్రామీణ ప్రాంతాలలో ఈ వాటా 77.5 శాతానికి పెరిగింది. అవుట్ పేషెంట్లు చికిత్స విషయంలో దేశంలోని అన్ని రాష్ట్రాలలోనూ, ఆంధ్రప్రదేశ్ లోనూ కూడా ప్రైవేట్‌రంగ వాటానే ఎక్కువ. విద్యారంగంలో కూడా ఇటువంటి పరిణామాలనే చూడవచ్చు. ఆంధ్రప్రదేశ్‌లో ఆరోగ్య, విద్యా రంగాల మీద ప్రైవేట్ వ్యయం పెరగడం కూడా కొందరు రైతుల ఆత్మహత్యలకు కారణంగా ఉంది.

ఆంధ్రప్రదేశ్‌లో మానవాభివృద్ధిని మెరుగు పరచాలంటే ఈ అయిదు సమస్యలను పరిష్కరించవలసి ఉంది.

(మిగతా వచ్చే సంచికలో...)

**సమకాలీన చరిత్ర, ప్రపంచీకరణ, రాజకీయార్థిక సూత్రాలు, సామ్రాజ్యవాదం, వివిధ ప్రజాఉద్యమాలు అంశాలుగా వార్షిక సంచికగా వెలువడే పత్రిక సోషలిస్ట్ రిజిస్టర్‌ను పరిచయం చేస్తున్నారు మానేపల్లి**

# సోషలిస్ట్ రిజిస్టర్ - ఒక పరిచయం

మార్క్సిజం పైన, సోషలిస్ట్ వ్యవస్థపైనా, కమ్యూనిజం సిద్ధాంతాలపైనా అచంచల విశ్వాసం గల కొందరు మిత్రబృందం - సమకాలీన చరిత్ర, ప్రపంచీకరణ, రాజకీయార్థిక సూత్రాలు, సామ్రాజ్యవాదం, వివిధ ప్రజాఉద్యమాలు ఈ అంశాలన్నిటిపై నిష్ణాతులచేత వ్యాసాలు రాయించి ప్రతి ఏటా ఒక వ్యాస సంపుటి తీసుకురావాలని నిర్ణయించారు. అలా 1964లో 'సోషలిస్ట్ రిజిస్టర్' అనే వార్షిక సంచిక ప్రారంభమైంది. దాన్ని లండన్‌లోని మెర్లిన్ ప్రెస్ ప్రచురిస్తోంది. సోషలిస్ట్ రిజిస్టర్ - వ్యవస్థాపక సంపాదకులు రాల్ఫ్ మిలిబాండ్ (1924-94), జాన్ సావిల్లె. వారి అనంతరం సంపాదక బాధ్యతల్ని స్వీకరించి - ఈనాటికీ క్రమం తప్పకుండా ప్రచురిస్తున్నవాళ్లు లీయో పానిచ్, కోలిన్ లీస్.

ప్రధాన సంపాదకులిద్దరు గాక - ఒక మేధావి బృందంతో సంపాదకమండలి వుంటుంది. వివిధ దేశాల్లో సంపాదకవర్గ ప్రతినిధులుంటారు. 1997 నుంచి ఎలా నడుస్తున్నదో తెలుసుకుని, ఆ తరువాత 2001-04 సంవత్సరాల్లో ఎలా నడిచిందో చెప్పుకుందాం.

'1997 - రూథ్‌లెస్ క్రిటిసిజమ్ ఆఫ్ ఆల్ దట్ ఎగ్జిట్స్' - ఇందులో 15 వ్యాసాలున్నాయి. వ్యాస రచయితల్లో - అనన్య ముఖర్జీ, మీరానందా, ఎయిజాజ్ అహమద్ - ఈ ముగ్గురూ భారతీయులు. వ్యాసాలన్నీ నిర్మోహమాట విమర్శకు పెట్టింది పేరుగా సాగాయి.

'1998 - ది కమ్యూనిస్ట్ మ్యానిఫెస్టో నౌ' - మార్క్స్ - ఏంగిల్స్ 'కమ్యూనిస్ట్ మ్యానిఫెస్టో' ప్రకటించి 150 సంవత్సరాలు నిండిన సందర్భంగా ప్రపంచవ్యాప్తంగా వందలాది పుస్తకాలు వెలువడ్డాయి. అందులో ఇదొకటి. ఇందులో పదకొండు వ్యాసాలున్నాయి. ఆపైన 'కమ్యూనిస్ట్ మ్యానిఫెస్టో' పూర్తిపాఠం అనుబంధం ఇచ్చారు. వ్యాస రచయితల్లో శామ్ గిన్‌డిన్, జాన్ బెలమీ ఫోస్టర్, సంపాదకులు కోలిన్‌లీస్, లియోపానిచ్ మొదలైనవారున్నారు.

'1999 - గ్లోబల్ క్యాపిటలిజమ్ వర్సెస్ డెమోక్రసి' - ప్రపంచీకరణ - ప్రజాస్వామ్య విలువలు ప్రధానాంశంగా ఈ సంపుటిలో 14 వ్యాసాలున్నాయి. వ్యాసకర్తల్లో ఉర్సులా హ్యూస్, కోలిన్‌లీస్, షీలా రౌబోతం మొదలైనవారున్నారు.

'2000 - నెసిస్సెరీ అండ్ అన్‌నెసిస్సెరీ ఉటోపియాస్'. ఇందులో 15 వ్యాసాలున్నాయి. లియో పానిచ్, శామ్‌గిన్‌డిన్ కలిసి తొలివ్యాసం రాశారు. ఊతిలిజనిత సోషలిజంపై వ్యాసాలన్నీ విమర్శ ఎక్కుపెట్టాయి. **'2001 సోషలిస్ట్ రిజిస్టర్'** గురించి కాస్త వివరంగా మాట్లాడుకుందాం.

(వర్కింగ్ క్లాసెస్ గ్లోబల్ రియాలిటీస్, సంపాదకులు : లియోపానిచ్, కోలిన్స్‌లీస్. గ్రేగ్ అల్బో, డేవిడ్ కోట్స్‌ల సహకారంతో, మెర్లిన్ ప్రెస్, లండన్ (కె.పి. బాగ్చీ, కలకత్తా) రు. 350)

"కార్మికవర్గ సమస్యలు, ప్రపంచ వాస్తవికతలు" అనేది ఈ సంపుటి శీర్షిక - అంటే ఈ ప్రధానాంశంపై వ్యాసాలలోని అంశాలు కేంద్రీకృతమై ఉన్నాయి. ఇందులో ఇరవై వ్యాసాలున్నాయి.

తొలివ్యాసం సైబర్‌టరియట్‌పై - మహిళా మేధావి ఉర్సులా హ్యూస్ రాసింది. ఆమె రాసిన 'ది మేకింగ్ ఆఫ్ ఎ సైబర్‌టరియట్' పుస్తకం ప్రసిద్ధమైంది. ప్రపంచ సమాచార రంగంలో ప్రస్తుత పరిస్థితుల్ని వివరించి - వాస్తవ పరిస్థితుల గురించి చర్చించింది ఉర్సులా. వివిధ దేశాల్లోని ప్రభుత్వ, ప్రభుత్వేతర కార్యాలయాల్లో గుమాస్తాలు - కార్యనిర్వహణ గురించి, ముఖ్యంగా మహిళా ఉద్యోగుల గురించి చర్చించింది.

రెండవ వ్యాసం వ్యవసాయ రంగంలో రైతులు తదితర శ్రమజీవుల గురించి మార్క్స్ తన ప్రామాణిక గ్రంథం 'కాపిటల్'లో వ్యవసాయం గురించీ, రైతాంగం, సన్నకారు కూలీల గురించీ ఏం చెప్పారో పరిశీలన ప్రారంభించి - మార్కెట్లు, సామ్రాజ్యవాదం - వ్యవసాయరంగం 1870 - 1970 అనే అంశం వరకూ వివరంగా చర్చించాడు వ్యాసకర్త హెన్రీ బెర్న్‌స్టీన్. సరుకుల ఉత్పత్తి, మార్కెట్ ఆర్థిక వ్యవస్థ, 1970ల తరువాత ప్రపంచీకరణ వరకూ చర్చసాగింది. అటు లాటిన్ అమెరికన్ దేశం అయిన బ్రెజిల్‌నీ, ఇటు ఆసియాలో అభివృద్ధి చెందుతున్న ఇండియానీ ఉదాహరణగా తీసుకొని వ్యవసాయరంగంలో రాజకీయ భావజాలాన్ని విశ్లేషించాడు.

అంతర్జాతీయ కార్మికవ్యవస్థ, కార్మికులహక్కులు, మూడవ ప్రపంచ దేశాల్లో చావుబతుకుల్లో కార్మికరంగం, చైనాలో ఏర్పడిన దుస్థితి - ఇవన్నీ చర్చించారు బెవర్లీ సిల్వర్, గియవన్ని అరిఘి. ఇద్దరూ కలిసి కార్మికరంగం ఎదుర్కొంటున్న సవాళ్లను గురించి విలువైన అధ్యయనాలను అందించారు.

ఆండ్రూ రాస్ - కారుచౌక శ్రమ, వేతనాలు, బానిసత్వం ఎలా అమెరికా వంటి దేశాల్లోని కార్మికుల్ని పట్టి పల్లారుస్తున్నాయో క్లుప్తంగా వివరించారు. దాదాపు ఆకలి, దరిద్రంతో కొట్టుమిట్టాడుతూ శ్రమజీవులు - తమ శ్రమను కారుచౌకగా అమ్మకానికి పెడుతున్నారో, భయంకరమైన దోపిడీకి గురవుతున్నారో రాస్ చాలా బాగా వివరించాడు.

నందినీ గుప్త - భారత రాజకీయ ఆర్థికరంగం, కార్మిక సమస్యలు బాగా అధ్యయనం చేసిన మహిళా మేధావి. ఆమె, బార్బారా హారిస్ - వైట్‌తో కలిసి భారతదేశంలో అసంఘటిత కార్మికుల సమస్యలపై మంచి వ్యాసం అందించారు. వర్గపోరాట సమస్యతో వ్యాసం ప్రారంభించారు. శ్రామిక రంగం, ఆర్థిక దోపిడీ - రుణవ్యవస్థ, భూ సంబంధాలు, మహిళా కార్మికుల దుర్భర పని పరిస్థితులు, వయో పరిమితి - పని సామర్థ్యం, కులం - వర్గం సమస్య, పనిస్థలాల్లో అభద్రత, ప్రభుత్వ చట్టాలు, వివిధ కార్మిక సంఘాలలో లోపించిన ఐక్యత, శ్రామికుల విముక్తి - ఇలా భారతీయ కార్మిక సమస్యని బహుముఖంగా విశ్లేషించారు వ్యాసకర్తలు. ఈ వ్యాసంలో అరుదైన మహిళాకోణం కూడా కనిపించడం విశేషం.

పాట్రిక్ బాండ్, డార్లెన్ మిల్లర్, గ్రెగ్ రూటర్స్ ముగ్గురు కలిసి దక్షిణ ఆఫ్రికా శ్రామికవర్గ సమస్యల్ని విశ్లేషించారు. సుదీర్ఘమైన ఈ వ్యాసంలో వారు ఉత్పత్తి, పునరుత్పత్తి, రాజకీయాలను చర్చించారు.

2000లో పశ్చిమ యూరప్ ట్రేడ్ యూనియన్ల గురించి స్టీవ్ జెఫెరిస్ వ్యాసం - పరిశీలించదగింది.

రష్యా శ్రామికవర్గంలో ఈ రోజు ఎందుకు తిరుగుబాట్లు లేవు?కార్మికోద్యమాలేమయ్యాయి అనే వ్యాసం రాశారు డేవిడ్ మాండెవ్.

ఇస్లామిక్ దేశాల్లో శ్రామికుల సమస్య గురించి హైద మొఘిస్సి, సయద్ రెహ్నామా ఇద్దరు కలిసి ఒక వ్యాసం రాశారు. బ్రెజిల్ వర్గ పోరాటాల్లో ప్రజాస్వామ్య విలువల గురించి హ్యూ బైనన్, జోస్ రమల్లో వ్యాసం, తూర్పు ఆసియా దేశాల గురించి గెరార్డ్ గ్రీన్‌ఫీల్డ్ వ్యాసం చదవదగినవి.

భారతీయ మహిళామేధావి రోహిణీ హెన్స్‌మన్ భారతదేశంలోని మహిళలు ఎన్నో కష్టనష్టాలకోర్చి, సంఘాన్ని నిర్మించుకుని ఎలా సంఘటితం, సమైక్యం కావడానికి ఆరాట పడుతున్నారో వివరించింది.

ఈ సంపుటిలో మొత్తం ఇరవై వ్యాసాలున్నాయి. దేనికదే ప్రత్యేక అధ్యయనాలనదగినంత వివరంగానూ, లోతుగానూ ఉన్నాయి. సంపాదకుల్లో ఒకరైన లియోపానిచ్ - కార్మిక పోరాటాలు : ఎత్తుగడలు అనే అంశంపై రాసిన వ్యాసం చివరిది. ఇరవయ్యవ శతాబ్ద చివరి సంవత్సరమైన 1998-2000 నాటి వివిధ ప్రపంచ దేశాల సమస్యలపై, ప్రధానంగా కార్మిక రంగంపై వెలువడిన 'సోషలిస్ట్ రిజిస్టర్ 2001' అషామాషీగా చదవదగింది కాదు, లోతుగా అధ్యయనం చెయ్యాలి. ఒకటి రెండుసార్లు చదివాక కాలేజీల్లో, యూనివర్సిటీల్లో, స్టడీసర్కిల్స్‌లో సెమినార్లు పెట్టి చర్చించాలి.

**'సోషలిస్ట్ రిజిస్టర్ 2002'** ప్రధానాంశం

ఎ వరల్డ్ ఆఫ్ కంట్రాడిక్షన్స్

ఇందులో 15 వ్యాసాలున్నాయి

ఇది సెప్టెంబర్ 11, 2001 సంఘటనకు కొంతముందే జూన్ 2001 నాటికే తుదిరూపం తీసుకున్న వ్యాస సంకలనం. వైరుధ్యాలంటే అర్థం ప్రపంచీకరణ, పెట్టుబడిదారీ విధానం, నయా మార్కెట్ ఆర్థిక వ్యవస్థ - ఇందుకు సంబంధించిన వైరుధ్యాలని. నయా సంస్కరణవాద, ఆర్థిక సరళీకరణ, మార్కెట్ పెట్టుబడులు - ఇవి మరింత సంక్షోభాన్ని తెచ్చిపెట్టాయి. దీన్ని బడుగుదేశాలు, అభివృద్ధి చెందుతున్న దశలో వున్న దేశాలు తట్టుకోవడం కష్టం. విద్యుత్తు సరఫరా (కాలిఫోర్నియా), రైలు రవాణా సౌకర్యాలు (ఇంగ్లండ్), నీటి సరఫరా (కెనడా, బొలీవియా, దక్షిణాఫ్రికా) - ఇలా ఈ లిస్టు ఎంతదూరం అయినా పొడిగించవచ్చు. సోషలిస్టు రిజిస్టర్ 1994, 1999 సంపుటాల్లో గ్లోబల్ సంక్షోభం, ప్రపంచీకరణ - జాతీయవాదం మధ్య వైరుధ్యాలు, గ్లోబల్ పెట్టుబడి - ప్రజాస్వామ్య వ్యవస్థ - మొదలైన సమస్యలపై చాలా గట్టిచర్చ ఉంది. ఈ సంకలనంలోని వ్యాసకర్తల్లో నోమీ క్లీన్, జెరాల్డ్ డ్యూమినివ్ - డొమినిక్ లెవీ (పారిస్), ఎల్మర్ అల్టవటర్ (బెర్లిన్), డేవిడ్ హార్వే (న్యూయార్క్), గ్రాహమ్ మర్డోక్ - పీటర్ గోల్డింగ్ (ఇంగ్లండ్), మార్తా రసెల్ (లాస్ ఏంజిల్స్) మొదలైనవారున్నారు. రవి మల్హోత్రా (భారతీయుడే కాని - హార్వర్డ్ లా స్కూల్), పాబ్లో గొంజువెజ్ కాసినోవా (మెక్సికో). ఈ వరసలో చివరి వ్యాసం రాసిన ఎవెన్ వుర్ - అమెరికన్ కాని ఈ వ్యాసం రాసేనాటికి లండన్. ఈమె కొన్నాళ్లు ప్రతిష్ఠాత్మకమైన మంత్లీ రివ్యూ పత్రిక సంపాదకవర్గంలో (1997-2000) పని చేసింది. 'వైరుధ్యాలు పెట్టుబడిదారీ విధానం లోనేనా? అంతటా వున్నాయి' - అంటుందీమె. పుస్తకం అంతా ఒక ఎత్తయితే - చిట్టచివరి ఈ వ్యాసం చాలా ఆలోచింప చేస్తుంది. చాలా ప్రశ్నలు లేవనెత్తుతుంది.

**'సోషలిస్ట్ రిజిస్టర్ 2003'** ప్రధానాంశం

ఫైటింగ్ ఐడెంటిటీస్ : రేస్, రిలిజన్ అండ్ ఎటినో - నేషనలిజం. ఇందులో 18 వ్యాసాలున్నాయి.

ఈ సంకలనం జూలై 2002 నాటికి తుదిరూపం తీసుకున్నా "జాతి, మతం, జాతీయవాదం - పోరాట శక్తులు" అనే అంశంపై తీసుకురావాలని - సెప్టెంబర్ 9, 2001 సంఘటనకు ఏడాది ముందుగానే నిర్ణయం తీసుకున్నామని - సంపాదకులు ముందు మాటలో వివరించారు. కనుక ఇది టెర్రరిజంపై గానీ, టెర్రరిజంపై యుద్ధంపై గానీ కాదని ఇటువంటి దాడులు న్యూయార్క్, వాషింగ్టన్ డి.సి.లపై జరుగుతున్న వైరుధ్యాల గురించీ, సంక్షోభాల గురించీ వ్యాసకర్తలు విశ్లేషించారని - సంపాదకులు లియో పానిచ్, కోలిన్ లీస్ అంటున్నారు. తొలి వ్యాసంలో పీటర్ గోవన్ అమెరికా ప్రపంచ గుత్తాధిపత్యం సాధించేందుకు చేస్తున్న ప్రయత్నాన్ని విశ్లేషించారు. అజీజ్ అల్-అజ్మె-ముస్లిం సమస్యపై అవిషయ్ ఎల్లిక్ - పాలస్తీనా, ఇజ్రాయిలీ యూదుల సమస్యలపై, యుగోస్లావియా జాతుల సమస్యపై, జాతీయ వాదంపై, రాజకీయార్థిక విధానాలపై సుసాన్ ఎల్. వుడ్‌వర్డ్ వ్యాసం, సోవియట్లలో ఒకటైన అజర్‌బైజాన్ జాతీయవాదంపై జార్జి డెర్లుగియన్ వ్యాసం, భారతీయుడైన ప్రత్యూషచంద్ర భారతదేశంలో భాషా సమస్యలు, రాజకీయాలు వర్గ సంఘర్షణలపై వ్యాసం రాశారు. ఆఫ్రికా వలసవాదం - రాజకీయ హింస అనే అంశంపై మహమూద్ మామ్దానీ వ్యాసం రాశారు. అల్జీరియా, పశ్చిమ యూరప్, ఉత్తర అమెరికా ప్రపంచీకరణ వ్యతిరేకోద్యమం చేసేవారు, జాతి దురహంకారులా? పోర్టో అలెగ్రె - బ్రెజిల్ - ఈ విధంగా వివిధ అంశాలపై విలువైన విశ్లేషణతో కూడిన వ్యాసాలున్నాయి.

**'సోషలిస్ట్ రిజిస్టర్ 2004'** ప్రధానాంశం

ది న్యూ ఇంపీరియల్ ఛాలెంజ్

ఇందులో 14 వ్యాసాలున్నాయి

గత ఐదు సంవత్సరాలలో మెదక్ జిల్లాలోని తొగుట, మిరుదొడ్డి మండలాల్లో జరిగిన రైతు, చేనేత కార్మికుల ఆత్మహత్యలు, ఆకలి చావుల గురించి చేపట్టిన అధ్యయనంలోని ఒక విషాదగాథను మనముందుంచుతున్నారు **బి. కొండల్ రెడ్డి, ఆర్. లక్ష్మి**

# బంజరుపల్లి బాలరాజు కథ - ఒక వ్యథ

మేం కేరింగ్ సిటిజన్స్ కలెక్టివ్(సిసిసి) (ఆకలిచావులు, రైతు, చేనేత కార్మికుల ఆత్మహత్యలు జరిగిన కుటుంబాలకు ఆసరాగా నిలబడే పౌరవేదిక)గా మెదక్‌జిల్లా తొగుట, మిరుదొడ్డి మండలాల్లో పనిచేస్తున్నాం.

గత ఐదు సంవత్సరాల నుంచీ ఈ రెండు మండలాల్లో జరిగిన రైతు, చేనేత కార్మికుల ఆత్మహత్యలు, ఆకలి చావుల గురించి 50 మంది కళాశాల విద్యార్థులతో, స్థానికంగా పనిచేసే నవజ్యోతి స్వచ్ఛంద సంస్థ యూత్ వాలంటీర్ల సహాయంతో మేం గ్రామ గ్రామాన ఒక సర్వే నిర్వహించాం. సర్వేలో పాల్గొన్నవారందరూ ఆయా గ్రామాలకు చెందిన వారే. ఈ సర్వేలో వెల్లడయిన అంశాల ప్రకారం కేవలం ఈ రెండు మండలాల్లోనే గత ఐదు సంవత్సరాల నుంచీ జరిగిన రైతు ఆత్మహత్యలు దాదాపు 70 ఉన్నాయి. చేనేత కార్మికులు ఆరు మంది దాకా చనిపోయారు. ఇవికాక, సరైన పనిదినాలు లేక, తిండి కరువై, అనారోగ్యాల పాలై, ఆకలి చావులకు గురై చనిపోయినవారు సుమారు నలభై మంది దాకా వున్నారు. ఇందులో ఆకలిచావులకు గురై మరణించిన వారి పరిస్థితి మరింత ఘోరం. అవి ఆకలిచావులుగా గ్రామమంతా గుర్తించినప్పటికీ ప్రభుత్వం వైపు నుంచి మాత్రం వాటికి ఆకలి చావుగా గుర్తింపు లేదు. గ్రామ ప్రజలు లేదా హక్కుల సంఘాలు గట్టిగా పట్టించుకుంటే కేవలం అనారోగ్యంతోనే చనిపోయారని రికార్డు చేస్తారు తప్పించి, అనారోగ్యానికి, ఆహారానికి వున్న అత్యంత ముఖ్యమైన సంబంధాన్ని మాత్రం గుర్తించకపోవటం ఆశ్చర్యమనిపిస్తోంది. గ్రామాలు ఎంతగా సంక్షోభంలోకి కూరుకుపోతున్నవో చూపించటానికి మెదక్ జిల్లా ఒక బాధాకరమైన ఉదాహరణగా నిలుస్తుంది. వర్షాభావం, కరువు, పనులు లేకపోవటం, పేదరికం, ఆకలిచావులతో, రైతు, చేనేత కార్మికుల ఆత్మహత్యలతో పరిస్థితి రోజురోజుకి దిగదిగజారిపోవటమనే వాస్తవాన్ని సర్వే చేసిన విద్యార్థులు ప్రత్యక్షంగా గమనించగలిగారు. ఆయా కుటుంబాలలోని పిల్లలు, వృద్ధుల పరిస్థితి గురించి చెప్తూ చాలామంది కళ్లనీరు పెట్టుకున్నారు. ఇద్దరు ముగ్గురు పిల్లలు ఆయా కుటుంబాలకు చెందినవారూ వున్నారు. మిగిలిన వారందరూ కూడా బాధిత కుటుంబాలతో ఏ మాత్రం సంబంధం లేనివారే. ఈ సంక్షోభానికి గురైన కుటుంబాల పరిస్థితి మరింత దిగజారిపోతోందనీ, చాలామంది పిల్లలు అనాథలుగా మారుతున్నారని, ఆసరాగా ఉండే పిల్లలు అర్ధాంతరంగా అసహజ చావులకి గురవటంతో వృద్ధులు ఏ ఆసరా లేకుండా అవుతున్నారని, పేదరికం ఆకలిచావులకి దారితీస్తోందని మా ప్రత్యక్ష అనుభవంలోకి వచ్చింది. దిగజారిపోయిన బతుకులు, జీవనోపాధి

---

ఇందులో తొలివ్యాసం ఎంతో కీలకమైనది. దీన్ని లియోపానిచ్, శామ్‌గిన్‌డిన్‌లు సంయుక్త కృషిచేసి రాశారు. ప్రపంచ పెట్టుబడిదారీ విధానం - అమెరికన్ సామ్రాజ్యవాదం అనే ఈ వ్యాసం ఎన్నో కీలక ప్రశ్నల్ని లేవనెత్తి సమాధానాలు చర్చించేందుకు ప్రయత్నించింది. భారతీయుడైన ఎయిజాజ్ అహ్మద్ - మనకాలంలో సామ్రాజ్యవాదం అనే అంశంపై వ్యాసం రాశారు. ఇరాక్ దురాక్రమణ - కొన్ని నిజాలు, అబద్ధాలు అనే వ్యాసం రాశారు - నోమ్ చోమ్‌స్కీ. ఆయన ఉద్యోగరిత్యా భాషాశాస్త్ర శాఖలో పనిచేస్తున్నా సమకాలిన రాజకీయార్థిక సమస్యలన్నిటి పైనా నిరంతరం వ్యాసాలు రాస్తుంటారు.

సోషలిస్ట్ రిజిస్టర్ 2004 - 40వ సంకలనం. దీన్ని నిజానికి 2001లోనే ఆలోచించి వుంచారు. సెప్టెంబర్ 9, 2001కి ముందే ఇందులోని వ్యాసాలు రూపొందాయి. ఇందులో 2003 నాటి అమెరికా ఇరాక్ దురాక్రమణ గురించి ఏం వుండదు. ప్రపంచ చరిత్ర తెలుసుకో గోరేవారెవరయినా - సోషలిస్ట్ రిజిస్టర్ చదివితీరాలి. ఏటా వెలువడే ఈ వార్షిక సంపుటాలు ఏ గ్రంథాలయానికైనా అమూల్య నిధులు.

సుమారు 350-400 పేజీలతో 15-20 వ్యాసాలతో రిజిస్టర్ ప్రతి ఏటా విడుదలవుతుంది. క్రమంగా ప్రపంచవ్యాప్తంగా వివిధ రంగాలకు చెందిన మేధావులు దీనికి ఆకర్షితులయ్యారు. క్రమం తప్పని నిరంతర పాఠకులయ్యారు. ఇందులో సమకాలిక చరిత్ర, రాజకీయాలు, అంతర్జాతీయ వ్యవహారాలు, మిలిటరీ - యుద్ధం - ఆయుధాలు, సాంకేతిక సమాచార రంగం, పారిశ్రామిక - వ్యవసాయ రంగాలు, పేటెంట్ హక్కులు, సామ్రాజ్యవాద దురాక్రమణ, ప్రజాఉద్యమాలు, విప్లవాలు, ఉగ్రవాదం, నూతన ప్రభుత్వాల ఏర్పాటు, బహుళజాతి కంపెనీలు, ఆర్థిక సరళీకరణ - మొదలైన అంశాలన్నిటిపై ఆయా రంగాలలో పరిణత అనుభవం గల మేధావులతో రాయించిన వ్యాసాలుంటాయి. ఈ సంపుటాలు 1990ల నుంచి నేరుగా భారతదేశంలో లభిస్తున్నాయి. ముఖ్యంగా 1997 నుంచి కె.పి. బాగ్చీ అండ్ కంపెనీ (కోల్‌కతా - 12) సంస్థ భారతీయ ముద్రణలను - అందుబాటులోని ధరకు అందిస్తోంది. దేశంలోని ప్రముఖ పుస్తక విక్రేతలందరి దగ్గర లభిస్తుంది. ◆

కరువవటం, పెరిగిపోతున్న అప్పులభారం, సామాజిక అవసరాలు, దరిదాపుల్లోకి రాని ఆరోగ్యభద్రత, అన్నీ ముప్పేటలాచుట్టి తీవ్రమైన సామాజిక, మానసిక సంక్షోభంలోకి మరింతగా కూరుకుపోతున్నారనే వాస్తవాన్ని ఈ సర్వే ద్వారా మేమందరం గ్రహించాం.

ఈ సర్వేలో మా దృష్టికి వచ్చిన పద్నాలుగు సంవత్సరాల బాలరాజు పరిస్థితి గురించి ఇక్కడ వివరించాలని అనుకుంటున్నాం. ఇది ఒక ఉదాహరణ మాత్రమే. ప్రతి ఒక్క గ్రామంలోనూ ఇలాంటి సంఘటనలు అనేకం. పరిస్థితి మరింత విషమంగా వున్న కుటుంబాలు ఎన్నో వున్నాయి. కదిలిస్తే అన్నీ కన్నీటి గాథలే. నిలువెత్తు ప్రభుత్వ నిర్లక్ష్యానికి నిదర్శనాలు. తొగుట మండలంలోని లింగాపూర్ పంచాయితీలోని బంజరుపల్లి గ్రామానికి చెందిన రామెల్ల బాలచంద్రం, అతని భార్య లక్ష్మి ఇద్దరూ కూడా 2007లోనే అనారోగ్యానికి గురై, సరైన వైద్యసహాయం లేక, పని చేయలేని పరిస్థితిలో ఆరునెలల వ్యవధిలో ఆకలితో అలమటిస్తూ చనిపోయారు. వారి కొడుకే ఈ బాలరాజు.

మాల కులస్థుడైన నలభై అయిదు సంవత్సరాల బాలచంద్రం, తనకి ఉన్న అర ఎకర పొలంలో ఆరుతడి పంటలు వేస్తూ కూలీ పనులు చేసుకుంటూ, భార్య లక్ష్మితో కొడుకు బాలరాజుతో, వృద్ధురాలైన తల్లితో జీవించేవాడు. ఈ క్రమంలో బాలచంద్రం అర ఎకర పొలంలో బోరు వేయడం కోసం మూడు సార్లు ప్రయత్నించి విఫలమయ్యాడు. బోరు కోసం మూడుసార్లు కలిపి దాదాపు 50వేలు పైనే అప్పు చేశాడు. భార్యాభర్తలిద్దరూ కూలిపనులు చేసుకుంటు అప్పులు తీర్చుకుంటూ వస్తున్నారు. ఆ పరిస్థితుల్లో కుటుంబానికి పెద్దదిక్కుగా ఉన్న తల్లి గత సంవత్సరం చనిపోయింది. తల్లి చావు బాలచంద్రాన్ని మానసికంగా దెబ్బతీసింది.

ఈ క్రమంలో బాలచంద్రానికి దగ్గు, ఆయాసంతో కూడిన టిబి వచ్చి అనారోగ్యం పాలయ్యాడు. ప్రభుత్వ ఆస్పత్రిలో టిబి మందులు తెచ్చుకున్నాడు, కానీ భోజనానికి మాత్రం ఉండేది కాదు. అతను పని చేయలేని పరిస్థితిలోకి వెళ్లాడు. ఈక్రమంలోనే బాలచంద్రం భార్య లక్ష్మి తెచ్చే కూలీ కుటుంబానికి ఆధారమయంది. ఆమె కూడా విపరీతమైన చాకిరీతో పాటు, క్రమంగా తగ్గుతూ వచ్చిన తిండి కొరతతో తీవ్ర అనారోగ్యానికి గురికావడం జరిగింది. కుటుంబ పోషణ మరింత భారంగా మారింది.

దానితో అదే గ్రామంలో 6వ తరగతి చదువుకుంటున్న బాలరాజు అర్ధాంతరంగా చదువు మధ్యలో ఆపేసి తండ్రి పేరు మీద వున్న ఉపాధి కార్డుపై గ్రామంలో వ్యవసాయ పనులకు వెళ్ళి తల్లితండ్రులను పోషించసాగాడు. చిన్నపిల్లవాడు కావడంతో కూలీ తక్కువ వచ్చేది. ముగ్గురున్న కుటుంబానికి ఆ కొద్ది సంపాదనే ఆధారమయింది. అయితే అది ఒక పూట తిండికి కూడా సరిపోయేది కాదు. కుటుంబ పోషణ భారమై లక్ష్మి కాళ్లకు ఉన్న కడియాలు ఇంటిలో ఉన్న ఇత్తడి బిందెలు, ఇతర సామాన్లు అమ్మవలసి వచ్చింది. బాలరాజు పనికి వెళ్లినపుడు వచ్చే డబ్బుతో కుటుంబం గడవక పక్కింటి వాళ్ళు, బంధువులు పెట్టే కొద్దిపాటి భోజనంతో కడుపు నింపుకొనేవారు. తీవ్ర అనారోగ్యానికి గురియైన లక్ష్మిని బంధువుల సాయంతో సిద్ధిపేట హస్పిటల్‌కి తీసుకెళ్ళాడు బాలరాజు. డబ్బులు లేకపోవడంతో హాస్పిటల్‌లో మూడురోజులు ఉంచి తిరిగి తీసుకువచ్చాడు.

ఒక పక్క కుంగదీస్తున్న అనారోగ్యం, మరోపక్క తిండికే జరగని పరిస్థితిలో బాలచంద్రం, లక్ష్మి మందులు కొనడానికి కూడా డబ్బు లేని స్థితిలో అలానే పస్తులు పడుకునేవారు. బాలరాజు పనిచేసి వచ్చి గంజి పోస్తే తాగి పడుకునేవారు. రోజంతటికి ఇదే పరిస్థితి. రోజుల తరబడి, నెలల తరబడి ఇదే పరిస్థితి కొనసాగింది. వీరి కుటుంబానికి అంత్యోదయ కార్డు ఉన్నప్పటికీ ఆ కార్డుపై బియ్యం తెచ్చుకోవడానికి కూడా వీరి వద్ద డబ్బు లేకపోయేది. నెలల తరబడి అనారోగ్యంతో, తీవ్ర ఆకలికి గురైన లక్ష్మి 2007 ఏప్రిల్ మాసంలో చనిపోయింది. ఈమె కర్మకాండలు నిర్వహించటానికి కూడా బంధువులు కొంత సహయం చేయగా మళ్ళీ నాలుగు వేల రూపాయల అప్పు చేశాడు బాలరాజు. ఇలా కొన్నాళ్ళు గడిచింది. ఇక ఆ కుటుంబంలో మిగిలింది బాలచంద్రం, బాలరాజు మాత్రమే. అనారోగ్యంతో ఉన్న తండ్రి బాలచంద్రంను చూసుకుంటూ, బాలరాజు పనికి వెళ్తుండేవాడు. కదిలే శక్తి కూడా లేకుండా అయిపోయిన తండ్రికి అన్నిరకాల పనులూ బాలరాజే దగ్గరుండి చేసేవాడు.

డబ్బులు ఉన్నప్పుడు డాక్టరు దగ్గర ఆయన ఆరోగ్యం చూపిస్తూ వచ్చేవాడు. అక్క బావ సహాయంతో సిద్దిపేట లోని చంద్రారెడ్డి హస్పిటల్ లో అయిదు రోజులు ఉంచి తిరిగి తీసుకువచ్చాడు. మళ్లీ ఆరోగ్యం క్షీణించడంతో హాస్పిటల్ కి వెళ్లటానికి డబ్బులు లేక భోజనం చేయటానికి ఇంట్లో సరుకులు లేక పక్కింటి వాళ్ల సహాయంతో కొన్నాళ్లు గడిచింది.

ఒకవైపు ఆరోగ్యం దెబ్బతిని, ఇంకోవైపు తిండికి జరగక 2007 అక్టోబరు 10న సాయంత్రం 7:30 నిమిషాలకు బాలచంద్రం చనిపోయాడు. పక్కింటివాళ్లు, దూరపు బంధువుల సహాయంతో బాలరాజు తండ్రి అంత్యక్రియలు పూర్తిచేశాడు. సంవత్సర కాలంలోనే కుటుంబం లోని ముగ్గురు వ్యక్తులను కోల్పోయిన బాలరాజు ఒకవిధమైన మానసిక అయోమయానికి గురైనాడు. ఎవరైనా కొంచెం పెడితే తినడం లేకపోతే మానేయడంతో అతను కూడా అనారోగ్యానికి చేరువ కాబోతున్నాడని అనిపించింది. తల్లిని, తండ్రిని బతికించుకోవడానికి బాలరాజు పడిన తాపత్రయాన్ని ఆ ఊరిలోని ప్రతి ఒక్కరూ చెప్పారు. ఆ ఊరి ఉపసర్పంచు కిష్టయ్యగారు మాట్లాడుతూ, దాదాపు గ్రామంలోని నిరుపేద దళిత, బహుజన కులాలకు చెందిన కుటుంబాల పరిస్థితి ఇదేనని, ఏదో ఒక విధంగా బతుకు బండి లాగుతూ వస్తున్నారు తప్పించి, ఎవ్వరికీ సరైన పోషకాహారమే కాదు కనీసం రెండుపూటలా తిండి భద్రత అనేదే లేదని చెప్పారు. కుటుంబానికి 100 రోజుల ఉపాధి హామీ కార్డు, అంత్యోదయ కార్డు ఉండటంతో, బాలరాజు తల్లిదండ్రుల చావును, ప్రభుత్వ లెక్కల ప్రకారం ఆకలిచావుగా గుర్తించదు.

ప్రస్తుతం 14 సంత్సరాల బాలరాజు తిండి, చదువుకునే అవకాశం ఉంటే ఏదైనా హాస్టల్‌లో జేరి చదువుకోవాలనుందనే ఆశను వ్యక్తంచేశాడు.

ఈ అబ్బాయిని ఎక్కడైనా హాస్టల్‌లో చేర్పించాలనే ఉద్దేశంతో గ్రామంలోని మా వాలంటీర్లు ప్రయత్నం చేస్తున్నారు. ఇట్లాంటి పరిస్థితులు ఎదురైన పల్లెల్లో పంచాయితీ మెంబర్లతో, ప్రజలతో కూడిన గ్రామకమిటీ లను ఏర్పాటుచేసి, వాటిద్వారా ఇలాంటి పిల్లలకు, వృద్ధులకు ఎలాంటి సహాయం అవసరమవుతుందో చర్చించి, అందుకు తగిన విధంగా వారే చర్యలు చేపట్టేలా, బాధ్యత తీసుకునేలా చేయాలని ప్రయత్నిస్తున్నాం. అందులో భాగంగా ఈ గ్రామంలో ఒక కమిటీ ఏర్పడింది. మా ఈ ప్రయత్నంలో మీ అందరి సహకారాన్ని కోరుతున్నాం. ◆

## ఉత్తరప్రదేశ్‌లో పేలుళ్లు

లక్నో, ఫైజాబాద్, వారణాసి కోర్టు ఆవరణల్లో నవంబర్ 23న పేలుళ్లు సంభవించాయి. ఈ పేలుళ్లలో పదమూడు మంది చనిపోగా, అరవై మంది గాయపడ్డారు. మరణించిన వారిలో నలుగురు లాయర్లు ఉన్నారు. ఈ సంఘటనలు మూడు చోట్లా దాదాపు ఒకేసారి మధ్యాహ్న సమయాన జరిగాయి. ఈ పేలుళ్ల వెనుక సిమి, ఎచ్.యు.జె.ఐ., లష్కరే తొయెబా వంటి సంస్థలు ఉండోచ్చని అనుమానిస్తున్నారు. ఢిల్లీ ఇంటెలిజెన్స్ వర్గాలు హర్కత్-ఉల్-జిహద్-ఇ-ఇస్లామీ ఉండవచ్చునని అనుమానిస్తున్నాయి. ఇది జరిగిన సమయంలో ఒక ప్రైవేట్ టివి ఛానల్‌కు అందిన ఈమెయిల్‌లో 'ఇండియన్ ముజాహిదీన్' అనే సంస్థ (ఈ పేరుగల సంస్థ ఇప్పటివరకు వార్తలలో లేదు) తామే దాడులు జరిపినట్టు ప్రకటించింది. ఈ దాడులకు బాబ్రీమసీదు విధ్వంసం దగ్గరి నుంచి ప్రారంభించి బొంబాయి పేలుళ్ళ, మత హింసాకాండ, వివిధ కమిషన్ల వైఫల్యం, ఇలా చాలా పరిణామాలు ఏకరువు పెట్టారు. ఆ లేఖల్లో విశ్వసనీయత ఎలా ఉన్నా సామాజిక అశాంతికి కారణాలనయితే అన్వేషించాల్సే ఉంది.

## న్యాయ వ్యవస్థకు బడ్జెట్ ఏది?

మన దేశంలో ప్రతి ఏడు నవంబర్ 26న 'లా డే'గా పాటిస్తారు. 1949లో ఇదే రోజున రాజ్యాంగాన్ని ఆమోదించారు. 1950 జనవరి 26 నుంచి ఆ రాజ్యాంగం అమలులోకి వచ్చింది. ఈ సందర్భంగా ప్రధాన న్యాయమూర్తి కె.జి. బాలకృష్ణన్ మాట్లాడుతూ 'న్యాయ వ్యవస్థ సరిగా పనిచేయక పోవడానికి చాలా కారణాలు ఉన్నాయనీ, కేవలం న్యాయ వ్యవస్థను నిందించడం వల్ల ఉపయోగం లేదనీ' అన్నారు. దేశవ్యాప్తంగా కిందిస్థాయి కోర్టులు, ప్రధాన న్యాయస్థానాలు, సుప్రీం కోర్టుతో కలుపుకొని మొత్తం 14,447 మంది న్యాయమూర్తులు ఉన్నా వాస్తవంలో 11,767 మంది మాత్రమే పనిచేస్తున్నారని అన్నారు. అందులోనూ ట్రయల్ కోర్టు స్థాయిలో చాలా ఖాళీలు ఉండడం వల్ల కేసులు వాయిదాలపై వాయిదాలు పడుతున్నాయి అన్నారు. న్యాయ వ్యవస్థ, రాష్ట్ర ప్రభుత్వాలు ఉమ్మడిగా దీనిపై ఆలోచించి న్యాయస్థానాల్లో 'జీరో వెకెన్సీ' స్థితి ఉండేలా చూడాలన్నారు. పదవ పంచవర్ష ప్రణాళికలో న్యాయవ్యవస్థకు రు.700కోట్ల బడ్జెట్ కేటాయించారు. బడ్జెట్ కేటాయింపుల్లో ఈ మొత్తం 0.078 శాతం మాత్రమే. ప్రణాళికాబద్ధ అభివృద్ధిలో న్యాయవ్యవస్థ భాగం కాదా అని కె.జి. బాలకృష్ణన్ ప్రశ్నించారు.

## అన్యాక్రాంతం అవుతున్న అడవులు

అటవీశాఖ మంత్రి ఎస్. రేహుపతి అన్యాక్రాంతమైన అటవీ భూముల వివరాలను నవంబర్ 29న రాజ్యసభలో సమర్పించారు. అటవీ శాఖకు చెందిన 14.54 లక్షల హెక్టార్ల భూమి అన్యాక్రాంతమైందని తెలుస్తోంది. అసోంలో 3,49,401 హెక్టార్ల భూమి చట్టవిరుద్ధంగా అన్యాక్రాంతమై ప్రథమ స్థానంలో ఉండగా, 2,40,600 హెక్టార్ల అన్యాక్రాంతమైన అటవీ భూమితో ఆంధ్రప్రదేశ్ రెండవస్థానంలో ఉంది. ఒకవైపు దున్నుకోవడానికి ఎకరం, నివసించడానికి అరవై గజాలు స్థలం కోసం సామాన్యులు నెత్తురు చిందిస్తుంటే, మరోవైపు లక్షలాది హెక్టార్ల భూమి అన్యాక్రాంతమవుతోంది.

## నందిగ్రామ్‌ను సందర్శించిన గవర్నర్

పశ్చిమ బెంగాల్ గవర్నర్ గోపాల్ కృష్ణ గాంధీ వరుస సంఘటనలు, ఘర్షణలతో రక్తమోడుతున్న నందిగ్రామ్‌ను డిసెంబర్ 2న సందర్శించారు. ఆయన కాలి నడకన సతెంగబరి, రాణిచక్, సోనాచూరాలకు కూడా వెళ్లారు. జరిగిన హింసకు సాక్షిగా నిలిచిన కాలిపోయిన, కూలిపోయిన ఇళ్లను చూసారు. బాధితుల కన్నీటి గాథలను విన్నారు. ఒక పక్క అధికార సి.పి.ఎం. మద్దతుదార్లు తమ ఇళ్లను సందర్శించాల్సిందిగా కోరగా, మరోపక్క భూమి ఉచ్ఛేద్ ప్రతిరోధ్ కమిటీ (బి.యు.పి.సి.) కార్యకర్తలుతమ ఆస్తిపాస్తులను ఎలా ధ్వంసం చేశారో విడమర్చి చెప్పారు. పర్యటన ముగిశాక గవర్నర్ విలేకరులతో మాట్లాడుతూ - నందిగ్రామ్ ప్రజలు శాంతిని, భద్రతను కోరుకుంటున్నారని అన్నారు. సి.పి.ఎం. ఆగడాలను మరోమారు ఖండించారు. త్వరలో కేంద్రానికి నివేదికను పంపుతున్నట్లు చెప్పారు. ఇటీవల ముఖ్యమంత్రి బుద్ధదేవ్ భట్టాచార్య స్వయంగా నందిగ్రామ్ ఘటనలు తప్పిదమే అనడం కొసమెరుపు.

## రిజర్వేషన్ల కోసం ఒడ్డిన రక్తం

నిన్న రాజస్థాన్ గుజ్జర్లు, నేడు అసోం తేయాకు తెంపే జాతుల వారు ఇలా వివిధ సామాజిక సమూహాలు రిజర్వేషన్ల కోసం దేశంలో ఏదో ఒకమూల రక్తమొడ్డుతునే ఉన్నాయి. నవంబర్ 24న ఆల్ ఆదివాసి స్టూడెంట్స్ అసోసియేషన్, అసోం విద్యార్థులు గౌహతి నగరంలో చేపట్టిన ర్యాలీలో అవాంఛనీయ సంఘటనలు చోటు చేసుకున్నాయి. సంతాల్ ఆదివాసులను, తేయాకు తెంపే జాతుల వారిని షెడ్యూల్డ్ తెగల జాబితాలో చేర్చాలంటు ఐదువేలకు పైగా విద్యార్థులు ఈ ర్యాలి చేపట్టారు. ఈ సందర్భంగా స్థానికంగా ఉంటున్న వారికి, ర్యాలిలో పోతున్న వారికి మధ్య ఘర్షణలు చోటుచేసుకున్నాయి. ఈ ఘర్షణలో ఒకరు (అనధికారికంగా అయిదుగురు) చనిపోగా , రెండువందల యాభై మంది గాయపడ్డారు. వీరిలో పదిమంది తీవ్రంగా గాయపడ్డారు. ఈ డిమాండ్‌తోవారు ఎంతోకాలంగా పోరాడుతూనే ఉన్నారు.

## జలవివాదమో కాదో నిర్ణయిస్తాం

గోదావరి నదిపై మహారాష్ట్ర ప్రభుత్వం నిర్మిస్తున్న బాబ్లీ ప్రాజెక్టను నిలిపివేసేలా ఆదేశాలు జారీ చేయాలంటూ మన రాష్ట్ర ప్రభుత్వం దాఖలు చేసిన పిటిషన్ డిసెంబర్ 6న ప్రధాన న్యాయమూర్తి కె.జి. బాలకృష్ణన్ న్యాయమూర్తులు పాంచల్, రవీంద్రన్‌లతో కూడిన ధర్మాసనం ముందుకు విచారణకు వచ్చింది. ఈ సందర్భంగా మహారాష్ట్ర తరపున హాజరైన సీనియర్ కౌన్సిల్ అంధ్యార్జున 'జలవివాదాలను ట్రిబ్యునల్ మాత్రమే పరిష్కరించాలనీ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సుప్రీం కోర్టును ట్రిబ్యునల్ స్థాయికి దించుతోందనీ, అలా అనుమతించరాదనీ' తన వాదనను వినిపించారు. రాష్ట్ర ప్రభుత్వం తరపున హాజరైన సీనియర్ న్యాయవాది పరాశరన్ జోక్యం చేసుకొని ట్రిబ్యునల్ తీర్పుకు విరుద్ధంగా బాబ్లీ ప్రాజెక్ట్ నిర్మాణం జరుగుతోందని అన్నారు. ట్రిబ్యునల్ తీర్పును సక్రమంగా అమలు చేయాలనే కోరుతున్నామన్నారు. ఇప్పటికే నీటి కేటాయింపులు ముగిసినందున మళ్లీ దీనిపై ట్రిబ్యునల్‌లో విచారించాల్సిన అవసరం లేదన్నారు. ఇరు పక్షాల వాదనలు విన్న ప్రధాన న్యాయమూర్తి అసలు ఇది జలవివాదమా? కాదా? అన్న విషయాన్ని నిర్ణయిస్తామంటూ ఫిబ్రవరి 5కు కేసును వాయిదా వేశారు. ◆

## ఆస్ట్రేలియా ప్రధాని కెవిన్ రడ్

పదకొండేళ్ల కన్జర్వేటివ్ పార్టీ పాలనకు లేబర్ పార్టీ తెరదించింది. యాభై ఏళ్ల కెవిన్ రడ్ తనను తాను కొత్త ఒరవడికి వారసుడిగా ఆస్ట్రేలియా ప్రజల్లో ప్రచారం చేసుకున్నారు. ఇరాక్ నుంచి సేనలను ఉపసంహరిస్తానని, పర్యావరణంకై ఉద్దేశించిన క్యోటో ఒప్పందం పై సంతకం చేస్తానని ప్రకటించి అమెరికాను ఇరుకున పెట్టారు. చైనా, ఆసియా దేశాలతో సంబంధాలను మెరుగుపరుస్తానని అంటూనే మరో పక్క అమెరికాతో దగ్గర సంబంధాలను కొనసాగిస్తానని ప్రకటించారు. ఆయన చేసిన పలు వాగ్దానాల వల్ల అయిదు శాతం ఎక్కువ ఓట్లు లేబర్ పార్టీకి అనుకూలంగా వచ్చాయని తెలుస్తోంది. పనిచేసే స్థలాల్లోని చట్టాలు, వడ్డీ రేటు పెరుగుదల ఇళ్ల యజమానులను ఆర్థిక ఒత్తిడికి గురి చేసింది. ఈ కారణాల వలన కన్జర్వేటివ్ ప్రధాని తన సీటును కూడా ఈ ఎన్నికల్లో కోల్పోయారు.

## జి.సి.సి. సమావేశాలకు తొలిసారి ఇరాన్

ఆరుదేశాల గల్ఫ్ కో-ఆపరేషన్ కౌన్సిల్ (జి.సి.సి.) సమావేశాలకు ఇరాన్ మొట్టమొదటి సారిగా హాజరయ్యింది. ఇరాన్ దేశాధ్యక్షుడు మొహమ్మద్ అహమ్మదీ నెజాద్ దోహాలో డిసెంబర్ 2న జరిగిన ఈ సమావేశానికి హాజరయ్యారు. సౌది అరేబియా, యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్, బెహ్రైన్, కతార్, కువైట్, ఒమాన్‌లు సభ్య దేశాలుగా ఉన్నాయి. వీరంతా అమెరికాకు అనుకూలురు. జి.సి.సి. కార్యదర్శి జనరల్ అబ్దుల్ రహమాన్-బిన్-హమద్ అల్-అట్టియాహ్ మాట్లాడుతూ ఇప్పుడున్న ప్రాంతీయ పరిస్థితి రీత్యా, ఇరాక్‌లో దిగజారుతున్న పరిణామాల రీత్యా, ఇరాన్‌కు పశ్చిమ దేశాలకు మధ్య ఇరాన్ అణు కార్యక్రమాల వలన తలెత్తుతున్న ఒత్తిడుల రీత్యా ఈ సమావేశం ప్రత్యేకత సంతరించుకుందన్నారు. మానవ వనరులు, గల్ఫ్ కరెన్సీ-డాలర్ మారకం తదితర అంశాలు ఈ సమావేశంలో చర్చించనున్నాయి. ఈ నేపథ్యంలో (అమెరికా నేషనల్ ఇంటలిజెన్స్ ఎస్టిమేట్ - ఎన్ఇఇ) జాతీయ వేగుల అంచనా సంస్థ ఇరాన్ నుంచి అణ్వస్త్రాల ప్రమాదం ఏమీలేదనీ, 2003లోనే ఆ ప్రయత్నం ఇరాన్ నిలిపి వేసినట్లు తెలుస్తోందని తన నివేదికలో పేర్కొంది. ఇరాక్ దురాక్రమణకూ, నేడు ఇరాన్‌పై యుద్ధ సన్నాహానికీ కారణం చమురు నిక్షేపాలేనని అంతర్జాతీయ పరిశీలకులు వ్యాఖ్యానించడం సహజమేమరి.

## విశేష అధికారాలు ఇవ్వమన్న వెనిజ్యూలా

వెనిజ్యులా అధ్యక్షుడు హ్యూగో ఛావెజ్ అత్యంత ప్రతిష్ఠాత్మకంగా తీసుకొని చేపట్టిన జనాభిప్రాయం ఆయనకు ప్రతికూలించింది. రాజ్యాంగంలో ఆయన ప్రతిపాదించిన దాదాపు 70 రకాల సవరణల్లో పని గంటలను రెండు గంటల పాటు తగ్గించడం, అసంఘటిత రంగంలో పనిచేస్తున్న కార్మికులకు కూడా సాంఘిక భద్రతా ప్రయోజనాలు కల్పించడం వంటి ఉత్తమమైన మార్పులు ఉన్నాయి. వీటి ద్వారా 21వ శతాబ్దపు సామ్యవాదాన్ని ప్రవేశపెడుతున్నానని ఆయన ప్రకటించారు. అధికశాతం ప్రతిపాదనలకు ప్రజలనుంచి, ప్రత్యర్థులనుంచి ఆమోదముద్ర ఉన్నప్పటికీ, దేశాధ్యక్షునికి విశేషాధికారాలను కట్టబెట్టే కొన్ని ప్రతిపాదనల్లో ప్రజలకు నియంతృత్వ పోకడలు కనిపించాయి. వాటిలో ప్రధానమైనది దేశంలో దీర్ఘకాలం అత్యవసర పరిస్థితిని విధించే విశేషాధికారం అధ్యక్షునికి ఇవ్వాలనడం. అలాగే, సెంట్రల్ బ్యాంక్‌పైనా, చమురు నిల్వలపైనా, వాటి ఎగుమతులపైనా సర్వాధికారాలూ అధ్యక్షుడు తన వశం చేసుకోవడం. ఈ ప్రతిపాదనలకు వ్యతిరేకంగా ఎన్ని ఉద్యమాలు జరిగినా, స్వపక్షంలోనే వ్యతిరేకత ఎదురైనా ఛావెజ్ వెనక్కు తగ్గలేదు. ఈ జనాభిప్రాయ సేకరణలో స్వల్ప తేడాతోనే ఛావెజ్ ఓటమి పాలైనప్పటికీ ప్రజల మనోభిప్రాయాలను గ్రహించడానికి ఈ ఫలితం ఉపయోగ పడుతుంది. ఈ ఓటమిని అవమానంగా కాక, గుణపాఠంగా ఛావెజ్ స్వీకరిస్తారా, అధికారకాంక్ష కాకుండా ప్రజాసేవే లక్ష్యమను కుంటారా లేదా వేచి చూడాలి.

## రష్యా ఎన్నికల్లో ప్రజాభిప్రాయమెంత?

రష్యా పార్లమెంట్ దిగువ సభకు జరిగిన ఎన్నికల్లో అధ్యక్షుడు పుతిన్ పరిపాలనకు ఓటర్లు ఆమోద ముద్ర వేశారు. సోవియట్ యూనియన్ విచ్ఛినం తరువాత ఇప్పటివరకూ ఐదుసార్లు జరిగిన పార్లమెంట్ ఎన్నికల్లో అధికార పార్టీ ఇంత పెద్ద ఎత్తున ఓట్లు కొల్లగొట్టడం ఇదే మొదటిసారి. 2001లో పుతిన్ ప్రారంభించిన యునైటెడ్ రష్యా పార్టీకి గత ఎన్నికల్లో నలభై శాతం ఓట్లు వస్తే ఇప్పుడు అరవై ఐదు శాతం ఓట్లు రావడానికి అక్రమాలే ఆధారమని అమెరికాతో సహా రష్యాలోని ఇతర పార్టీలు ఆరోపిస్తున్న మాట నిజం. చెచెన్యాలో పుతిన్ పార్టీ తొంభై శాతం పైగా ఓట్లు సంపాదించుకోవడం ఆశ్చర్యకరం. మన దేశంలో మాదిరిగానే పుతిన్ కూడా ఎన్నికలకు కొద్ది గంటల ముందు కూడా అనేక వర్గాలకు వరాలు కురిపించి, సంఘాలతో ఒప్పందాలు చేసుకున్నారు. అలాగే ఎన్నికల నియమావళిలో మార్పు చేర్పులు చేసి కనీసం ఏడు శాతం ఓట్లు రావాలన్న నిబంధనపెట్టి చిన్న చితక పార్టీలను పార్లమెంట్‌లోకి ప్రవేశించకుండా అడ్డుకున్నారు. రెండవ పెద్ద పార్టీగా అవతరించిన కమ్యూనిస్టు పార్టీకి కూడా ఈ ఎన్నికల్లో పన్నెండు శాతం ఓట్లే రావడానికి ఓటర్ల జాబితాలో జరిగిన అవకతవకలేనన్న ఆరోపణలు ఉన్నాయి.

## సజావుగా ఎన్నికలు జరుగుతాయా?

బేనజీర్ భుట్టో నాయకత్వంలోని పాకిస్తాన్ పీపుల్స్ పార్టీ, నవాజ్ షరీఫ్ నాయకత్వంలోని ఆల్‌పార్టీ డెమొక్రటిక్ మూవ్‌మెంట్లు జనవరి 8న జరగబోయే ఎన్నికలు సజావుగా జరపాలంటూ ఉమ్మడిగా డిమాండ్ల పత్రాన్ని తయారు చేయడానికి డిసెంబర్ 3న సమావేశమయ్యాయి. అంతకుముందు లండన్‌లో మే 2006లో 'చార్టర్ ఆఫ్ డెమొక్రసి' పై సంతకం చేసే సందర్భంలో ఈ నాయకులు ఇరువురు కలిశారు. పెద్ద ఎత్తున బ్యాలెట్ పత్రాల అపహరణ, రిగ్గింగ్ లాంటివి ఈ ఎన్నికలలో చోటు చేసుకోవచ్చుననే అనుమానాన్ని బేనజీర్ వ్యక్తపరిచారు. నవాజ్ షరీఫ్ మాట్లాడుతు ఈ ఎన్నికలతో ముషారఫ్ రాజకీయ భవిష్యత్తు ముడిపడి ఉందని, అందువల్ల ఎన్నికలు సజావుగా జరిగే అవకాశాలు లేవని అన్నారు. ఎన్నికలు సజావుగా జరగడానికి ముషారఫ్ అంగీకరించకపోతే ఈ ఎన్నికలను బహిష్కరిస్తామని బేనజీర్ అన్నారు. పాకిస్తాన్ ఎన్నికల కమిషన్ ఈ ఆరోపణలను తోసిపుచ్చింది. ◆

# అసహజ మరణాల సూచి

సంకలనం : రాంకి, వై. రామచంద్రం

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. ఆ సహజ మరణపు వయోపరిమితి దేశ కాల పరిస్థితులను బట్టి, జీవన ప్రమాణాలను బట్టి అరవైల నుంచి తొంభైల దాకా ఉండవచ్చు. కాని మన సమాజంలో సాధారణ ఆయు ప్రమాణం 63 సంవత్సరాలు అయినప్పటికీ ఎంతోమంది పుట్టుకలోనే మరణిస్తున్నారు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ మరణం అనేక రూపాలలో సంభవిస్తోంది. ఆకలి, అనారోగ్యం, మానసిక ఆందోళనలు, సామాజిక అసమానతలు, వరకట్న మరణాలు, నిర్లక్ష్యం, అంటరాని తనం, వ్యవసాయం, చేనేత వంటి రంగాల్లోని సంక్షోభాలు, పారిశ్రామిక అశాంతి, జీవనోపాధి లేమి అసహజ మరణాలకు లెక్కలేనన్ని కారణాలున్నాయి. మన పక్కనె మనతోనే ఉండే మనుషులు అర్థాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైనపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే, ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

| తేది | ఆత్మహత్యలు | | | హత్యలు | | | | గుర్తు తెలియని | ఆకలి | ప్రమాదాలు | | | చికిత్స అందక, అనారోగ్యం | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | ఫ్యాక్షన్ | కులం | మతం | తగాదాలు | | | పనిచేసే స్థలంలో | రహదారి | ఇతరాలు | | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| 21.11.07 నుండి 27.11.07 | 4 | - | 11 | - | - | - | 7 | 13 | - | - | 9 | 15 | 4 | - | - | - | 1 | - |
| 28.11.07 నుండి 04.12.07 | 2 | - | 11 | - | - | - | 5 | 4 | - | - | 13 | 8 | 5 | - | - | - | 4 | - |
| 05.12.07 నుండి 11.12.07 | 4 | - | 11 | - | - | - | 7 | 8 | - | - | 23 | 16 | 2 | - | - | - | 6 | - |
| 12.12.07 నుండి 20.12.07 | 6 | - | 20 | - | - | - | 11 | 6 | - | - | 34 | 12 | 6 | 1 | - | - | 3 | - |
| మెదక్ | 12 | - | - | - | - | - | - | - | - | - | - | - | - | - | - | - | 2 | - |
| గుంటూరు | 2 | - | 2 | - | - | - | 15 | 5 | - | 5 | 18 | 5 | 2 | - | - | - | 2 | - |
| శ్రీకాకుళం | 2 | - | 6 | - | - | - | 3 | - | - | - | 11 | - | 7 | - | - | - | - | - |
| చిత్తూరు | 2 | - | 20 | - | - | - | 12 | 11 | - | 4 | 37 | - | 29 | - | - | - | - | - |
| మహబూబ్‌నగర్ | 4 | - | 34 | 5 | - | - | 10 | 5 | - | 7 | 35 | - | 10 | - | - | - | 3 | - |
| మొత్తం | **38** | **-** | **115** | **5** | **-** | **-** | **70** | **52** | **-** | **16** | **180** | **56** | **65** | **1** | **-** | **-** | **21** | **-** |

ఈ శీర్షికకు సహకారం అందిస్తున్న వారు : హైదరాబాద్ - డి. విజయభాస్కర్; మెదక్ - కె. రాజు;
గుంటూరు - బి. అంజమ్మ; శ్రీకాకుళం - జి. సుధీర్; మహబూబ్‌నగర్ - ఏసురత్నం; చిత్తూరు - పలమనేరు బాలాజి

*గమనిక : మీ అందరి సహకారంతో అన్ని జిల్లాల పూర్తి సమాచారంతో భవిష్యత్తులో ఈ శీర్షికను మరింత సమగ్రంగా అందించే ప్రయత్నం చేస్తాం.*



# యాభై ఏళ్ల ఆంధ్రప్రదేశ్ పై ఏకైక విశిష్ట సమాచార, విశ్లేషణా గ్రంథం

సిడిఆర్‌సి ప్రచురణ

ఇంగ్లిషులో, 568 పేజీలు

హార్డ్ బౌండ్ (గ్రంథాలయ, మేలు ప్రతి) రు. 895

విద్యార్థుల కొరకు ప్రత్యేక ముద్రణ రు. 225

## FIFTY YEARS OF ANDHRA PRADESH
## 1956 - 2006

ప్రస్తుతం మార్కెట్లో ఉంది

యాభై సంవత్సరాల ఆంధ్రప్రదేశ్ జయాపజయాలపై,
అభివృద్ధి పథంలో ఒడిదుడుకులపై
నలభై విశ్లేషణాత్మక, సమాచార భరిత వ్యాసాలు, పట్టికలు
చరిత్ర, వ్యవసాయం, పరిశ్రమలు, మౌలిక సౌకర్యాలు, ఆర్థిక వ్యవహారాలు,
సామాజిక పరిణామాలు, విద్యా వైద్య రంగాలు
ఆంధ్రప్రదేశ్ పురోగతి గురించి తెలుసుకోదలచిన వారందరూ
తప్పనిసరిగా అధ్యయనం చేయవలసిన గ్రంథం
ప్రతి గ్రంథాలయంలోనూ ఉండవలసిన గ్రంథం

ప్రతులకు, వివరాలకు




సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసెర్చ్ అండ్ కమ్యూనికేషన్
మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040 - 66843495 ఇమెయిల్ : reachcdrc@yahoo.com

Regn.No.APTEL/2003/11482 Published 27/12/2007 PRINTED BOOK





# వినూత్నం... విజయవంతం!

## ప్రతి పథకం ప్రజలకే సొంతం

**విజయవంతమవుతున్న పథకాలు**

| | | |
|---|---|---|
| జలయజ్ఞం | : | 1.30 లక్షల కోట్ల రూపాయలతో 1 కోటి ఎకరాల సాగు |
| ఇందిరమ్మ | : | ఏటా 20 లక్షల గృహాల నిర్మాణం. మొత్తం 80 లక్షల గృహాల నిర్మాణం లక్ష్యం. |
| ఇందిరాక్రాంతి పథకం | : | పావలా వడ్డీకే రుణాలు. మూడేళ్ళలో 6,500 కోట్ల రూపాయలు పంపిణీ. 2008-09లో 10 వేల కోట్ల రుణాలు పంపిణీ లక్ష్యం. |
| రాజీవ్ గృహకల్ప | : | పట్టణ పేదలకు సొంత ఇల్లు. |
| ఉపాధి హామీ పథకం | : | 19 జిల్లాల్లో పేదలకు ఉపాధి. 36.50 లక్షల కుటుంబాలకు ప్రయోజనం. |
| ఇందిరప్రభ | : | 500 కోట్లతో అసైన్డ్ భూముల అభివృద్ధి |
| ఆరోగ్యశ్రీ | : | నిరుపేదలకు ఉచితంగా వైద్యం, శస్త్ర చికిత్సలు. 8 జిల్లాల్లో అమలు |





ఇవి... రాష్ట్ర ప్రభుత్వం అమలు చేస్తున్న వినూత్న పథకాల్లో ప్రముఖమైనవి. ప్రజల భాగస్వామ్యంతో అమలవుతున్న ఈ పథకాలు రాష్ట్రాన్ని హరితాంధ్ర ప్రదేశ్ వైపు నడిపించే దిశగా విజయవంతంగా అమలు జరుగుతున్నాయి.

## ఇందిరమ్మ రాజ్యం - ఇంటింటా సౌభాగ్యం

R.O.No.661/Sou/Advt.I/2007-08

జారీచేయువారు: సమాచార, పౌరసంబంధాలశాఖ

Printed, Published and Owned by V. Hanumantha Rao and Printed at Charita Impressions for Nutan Art Printers, 11-5-417-420, Red Hills, Lakdi-ka-pool, Hyderabad-500 004 and published at 8-3-898/22, Nagarjuna Nagar, Hyderabad-500 073. Editor : V. Hanumantha Rao



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA106M288 |
| పుస్తకం పేరు | వీక్షణం |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 61 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Naveeda |
| పేజీలు విడదీసినది | Naveeda |
| స్కాన్ చేసినది | Afsar |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |